# భరత చరిత్రము

## చతుర్థ, పంచమాశ్వాసములు



గ్రంథకర్త
భద్రాచల సంస్థాన పండితుడు
శ్రీమాన్ పుదుప్పళి కాండూరు తిరుమలై యచ్చాన్
వేంకట తిరుమలాచార్యులు అయ్యావార్లు



లక్ష్మీ ప్రెస్, ఏలూరు.

1951



[వెల రు 8–0–0

# విజ్ఞాపనము



భరతచరిత్రము సర్వము సమాప్తమైనది. రామకృపయే దీని నీస్థితికి దెచ్చినది. కవికి కావలసిన పరికరములేవియు నాకు లేనేలేవు. నాకుగల విద్యయె యత్యల్పము. పైగా వ్యాధులు శరీరమును మనసును మిగుల పీడించినవి. దానికితోడు వయోవృద్ధకూడ కలిగినది. ఎనుబది మూడవవత్సరము వయస్సు గతించుచున్నది. కళాపూర్ణోదయములోని సుగ్రహునివలె కులగోత్రవిస్మృతి కలుగలేదుగాని విద్యాగంధమంతయు విస్మృతమైనది. మనస్సునకు గొప్పవిస్మృతి (పరాకు(భ్రమ) కలిగినది. భగవదారాధనము జేయుచు యే పురుషసూక్తమునో యుచ్చరించుచుండ నుత్తరభాగమంతర్ధానమొంది యెంతసేపు జ్ఞాపకముచేసికొన ప్రయత్నించిన తుదకు నుత్తరభాగము స్మృతిపథమునకు వచ్చుటయేలేదు. పరమ మిత్రుల దర్శనభాగ్య మబ్బినయపుడు వారిని ఫలానావారని దెలియలేక మీ రెవరని యడుగుట కభిమానపడి యనభిజ్ఞులతో మాటలాడినటుల మాటలాడిసగౌరవముగ గౌరవించక పూజ్యపూజావమానము నార్జించు చుంటిని. కొందరు పోల్చలేని నన్నుగని దయతో మేము ఫలానాయని తెలిపిన నేను మిగుల పశ్చాత్తాపమును పొందుచుంటిని. ఇట్లు నేనేడ భరతచరిత్రను వ్రాయుటయేడ. ఇది నా శక్తికిమించినపని. భగవంతుడగు రాముడె నన్ను కరుణించి యీ కృతికర్తయు భర్తయు కూడనైనవాడని నేను భావించుచుంటిని.

శనివారప్పేట
ఏలూరు తాలూకా
దీ 1-9-1951

ఇట్లు
పుదుప్పళి కాందూరు తిరుమలై యచ్చాన్
వేంకట తిరుమలాచార్యులు అయ్యావార్లు



శ్రీరస్తు

శ్రీ యైనమః

# భ ర త చ రి త్ర ము

## చ తు ర్థా శ్వా స ము

క. సీతా చేతః ప్రీతిద !
పీతాఖిలదుష్టదనుజ ! విశ్వాధీశా !
పీతాంబర ! వరవిగ్రహా !
నీతామరశోష ! రామ ! నిరుపమ సుగుణా ! ౧

క. వారాశి గర్వ భంజన !
శూరోత్తమ ! భక్తలోక శోకాపహరా !
సారాచార విశారద !
వీరస్తుత ! విశ్వవంద్య ! విశ్వవినోదా ! ౨

— ♦ భరతుని దండక యాత్ర ♦ —

వ. అవధరింపుము భరతాజ్ఞను మంత్రులందరును తత్కాలోచితానుష్ఠానంబుల నెరవేర్చి రామ గుణాను సంధాన మొనర్చుచున్న భరతుం గనుంగొని ప్రయాణ సన్నాహంబు సిద్ధంబయ్యెనని వినయంబున విన్నవింప భరతుండును దమ్ముండును సత్వరంబున భద్రదంతావళంబుల నెక్కి బయలు వెడలిరి. అపుడు

సీ. పురినుండ నొక్కఁడు బూనఁడు మనుజుఁడు దండక కేగఁగఁదలచి రంద
రతిహర్ష వశమున, నవని యీనినట్లు నరలోక మంతయు నడచినటుల
వాహనముల నెక్కి, వరుసలఁదీర్చుచు, సకలజాతులవారు సాఁగిరపుడు
మత్తేభహయరథ,మహితసేనలగూడిమంత్రిసామంతులుమాన్యతములు

గీ. మునులు విప్రులు గురువులు ముదితగములు
పురుషు లందఱుఁ బూజ్యులౌ భూపులెల్ల

రాజ పత్నులు నిజ భృత్యరాజి తోడ
రాము గనుగొన నేగిరి రమ్యముగను. 3

—♦ భరతుఁడు గుహునిఁ గనుగొనుట ♦—

చ. చనిచని కొంతదూర మట, జాహ్నవిచెంతను రామమిత్రుఁడౌ
ఘను గుహుఁ గాంచి యాత డధికంబగు సాశయ మొంద వానినిం
గనుగొని తాను రాజ్యమునఁ గాంక్ష యొనర్పమిఁ జెప్పి నమ్మఁగా
ననుపగు సత్యము ల్బలుక నాతడు నమ్మెను ధర్మబద్ధుఁడై. ౪

వ. భరతుఁ గనుగొని గుహుండు.

క. నీకంటె ధన్యుఁ డెవ్వఁడు
లోకంబున లేఁడు లేఁడు, లోభివి గాకన్
నాకంబు జూరగొంటివి
వీక జ్జనుమయ్య రాము వీక్షించుటకై. ౫

వ. అన్నా నేనొక పాపపుదలంపు దలచితిని. దానిని వక్కాణించె దను వినుము. నీవు రామునకు హాని జేయఁదలఁచి యడవి కేగుచుంటివని నా మనమునఁ దలఁచి నిన్ను నదిని దాటకుండఁ జేయుటకును సపరివారుడవగు నీతోడ నోపినంతవఱకుఁ బోరుటకై సర్వసేనల సమకూర్చి సిద్ధముగ నుంటిని. పరాభిప్రాయము నెఱుఁగుట దుర్లభముగదా ! నిను జయించుట దుర్లభమని తెలిసియు సామాన్యముగ నిను విడువఁదలంప లేదు. రామార్థ మసువుల విడుచుటయ మేలని భావించితిని. ఈ పడిన నా దురభిప్రాయమును మన్నింపుము. యథార్థకథనమును నీవంటి మహానుభావులు మన్నింతురు గనుక నేను క్షంతవ్యుడనని పలికెను. అపుడు గుహుని యోగ్యతకు విస్మితహృదయుఁడగు భరతుఁడు మన్ననతోడ గుహుని కరంబుఁబట్టి మిత్రమ ! మే మిదివఱకు సోదరులము నలుగురము. నీతోడ నిపు డయిదుగుర మైతిమి. నీవు మహాప్రాజ్ఞుడఁవు, రామప్రియుఁడవు, పరమాప్తుఁడవు.

సీ. దయయుంచి యా రేయి పశుధపుత్రుఁడు బండినచోటును భవ్య మూన్పు
మనగనుజూపించె మహితుఁడు దుఃఖించి తల్లుల భరతుఁడు దమ్ముఁబిలిచి
సార్వభౌమాన్వయజాతుడు రాముడుకఱకుదర్భలబండె గనుడుమీర
లీ శోకభారంబు నేరీతి నీగుదు గటకట పాపుడ కఠినమతిని

గీ. ధన్య యాసీత సౌమిత్రి ధన్యతముడు
కష్టదశయందు విడువక కలసి మెలసి
సమయ మెఱుఁగుచు సకలోపచారములను
సలుపుచుండిరి సద్భక్తి చతురమతులు. ౬

గీ. మనము జేసిన తప్పును మనసునందు
మఱచిపోవక యుండిన మనల రాముఁ
డాదరించుట కేమాత్ర మైనఁగాని
హేతువే లేదు మనగతి యేమి యగునొ. ౭

గీ. దశరథుం డేగె దివికిని దాశరథియు
విపినసీమకు వేంచేసె విశ్వమెల్ల
నారకాటియె లేనట్టి నావవగిది
నల్లలాడుచు నున్నది యమ్మలార ! ౮

సీ. వనవాసి యయ్యెను వనజాతనయనుడు పట్టణమంతయు బాడుపడియె
ప్రాకారముల గాచువారలు లేరైరి మదగజ తండంబు మసల దెచట
హర్షవశంబున హయములు దిరుగవు దెఱచిన గవనులు దెఱచియుండె
మోదంబు లేకయె మోములు వాల్చుచు మంత్రులు బంధులు
మతులు చెడిరి

గీ. వనితలంద రలంకారవతులుగాక
దేవతోత్సవ మెచటను దేజరిల్ల
దెంత విపరీతగతి కైతి హేతువేను
గనుక బాచిత మిటు జేయ గడగినాఁడ. ౯

ఉ. సంతసెవ భూమియందు తృణ పర్ణ కుటీరమునందు యుండెద
న్గండిగ నిర్ఝరాంబుములు దండక నుండక తీరుదేని నే
నుండెద రామపాదు దినుచుండెద బండ్లను గాయ లాకులన్
రండిక వేగఁబోయి రఘురాముని బిల్తము రాజ్య మేలఁగన్. ౧౦

తే. ఉసుచు సుహృగసీ యాన్యుని యమలచరిత
మింక స్నేహైన బల్కి నా కింపు గూర్చు
మనగ బల్కెను మీయన్న యచట మట్టి
నాల జడలను దాల్చెను బరమ నియతి. ౧౧

తే. చిదచిదీశ్వర తత్త్వంబు చేతనులకు
సత్యమని తెల్పుకరణిని సర్వవిభుడు
మూడు రూపంబులను దాల్చి ముదముతోడ
వెడలినాఁడని దలచితి వేదవిదుఁడ. ౧౨

క. వారల గాంచిన కన్నులు
వారల విడనాడలేక వారలఁ గూడె
న్వారల పదభక్తుల దని
వారగ సేవింప నిచట వరలితి నృపుడా! ౧౩

వ. నా యవస్థను విలోకింపుము.

సీ. కన్నులు రామునిగనుచుండు నెప్పుడుమనసు రాముని నెప్డుమఱవఁబోదు
పదములు రాముని సదనము దరిజేరు గరములు పూజింప గాంక్ష జేయు
వీను లాఘునుకథవిను పదతులసిని మూచూచునాముక్కు ముదముతోడ
శీర్షంబు నతిజేయు సీతేశు పదములు గాయంబు కౌగిలి గాంచనెంచు

గీ. నింద్రియంబులు వశమున నించుకేని
నిల్వకుండుట పనులను నిలిపి నేను
రామదాస్యంబు నెఱపుచు రమ్య భక్తి
పారవశ్యంబు నొందితి భరతరాజ! ౧౪

గీ. ఆజ్ఞ లేదయ్యె నాఘను ననుసరింప
కనులు మూసినఁ దెఱచినఁ గఱపురీర
దర్శనం బిచ్చుచుండెను దాశరథియుఁ
దన్మయం బయ్యె జగమెల్ల తథ్యముగను. ౧౫

వ. అని భక్తిపారవశ్యంబున బలుకు గుహుంగని వారందరును గూడ భక్తిపరవశులైరి.

—♦ భరత శత్రుఘ్నులు జడల నారల దాల్చుట ♦—

ఉ. ఆతని భక్తిభావనకు నద్భుత హర్ష పరీతచిత్తుడై
భ్రాతయు దానును న్జడల భాసురవృత్తిని నారచీరల
న్బ్రాతలబోలె దాల్చుచును భవ్య తపోవనసీమ కేగగాఁ
జేతమునందు గోరి గుహ! చెచ్చెఱ గంగను దాటజేయుమీ. ౧౬

క. అని పలుకు భరతుఁ గనుగొని
ఘనమగు హర్షాబ్ధి మునిగి ఘనుడిత డనుచు
న్మనమున దలచుచు మిక్కిలి
తన సంశయ మంత విడిచె దడయక యపుడే. ౧౭

క. భరతాజ్ఞ దాల్చి శిరమున
వరభృత్యుల బిలిచి రాజ వహనార్హములౌ
వరనౌకల గుహుడప్పుడు
త్వరగా దెప్పించి గంగ దాటింపుడనన్. ౧౮

—♦ భరతుడు గంగనుదాటుట ♦—

ఉ. నావల నెక్కి వేగముగ నవ్వవిలోకన హర్షయుక్తులై
భావము రామభద్ర గుణభావన భవ్యత నొందుచుండగా
నావలి గంగయొడ్డునకు హాయిగ జేరిరి వేగవారలా
నావల వీడి మార్గమున నవ్వగతి స్థని కాంచి రచ్చటన్. ౧౯

సీ. కమనీయ పానీయ కమలాకరంబులు వాపీశతమ్ములఁగూపములను
బరిపక్వ ఫలభార భరితవృక్షంబుల సహజవైరము వీడు జంతుతతిని
గలకల రవముల గలిగించు పక్షుల గుసుమరాజిత మంజు కుంజతతిని
సకలాగమంబుల జదివెడి విప్రుల గలగల స్రవహించు కాలువలను

గీ. చిర తపోలబ్ధ తేజో విశేష సిద్ధ
తాపసోత్తమ సంచార ధన్యమైన
వర భరద్వాజ మునిరాజ వాసయోగ్య
మాశ్రమోత్తమ మగపడె నగ్రభూమి. ౨౦

క. కనుగొని తమ్ముడు దానును
దనసేనల నిలిపి గుహుడు తనముందు జన
న్ఘనుడై భారద్వాజుని
గన నేగుచునుండ వారిఁ గాంచెను మునియున్. ౨౧

—♦భరద్వాజ సంభాణము♦—

వ. భరద్వాజమహర్షి

సీ. ఘనుని వసిష్ఠుని ఘనముగఁ బూజించి భరత శత్రుఘ్నుల భవ్యవిధిని
సత్కారముల జేసి సర్వవిధంబుల కుశలమెకా యన కుశలమనిరి
భరతుడు మునివరపక్షులుమృగములునియమము దేహమునిఖిలతరులు
శిష్యులు జలములుక్షేమంబెయననన్నియనిపల్కి భరతునికనియెనిటుల

గీ. రాజ్యమంతయు నీ కిచ్చి రాము నడవి
పాలుజేసెను నీ తండ్రి పాపమనక
రామచంద్రున కేమైన రాపుజేయ
దలచి వచ్చితె ధర్మంబు దలపవలదె ? ౨౨

గీ. నైక పుత్రుడవై యున్న కారణమున
సకల సేనలతో గూడి చనుచునుంట
దయయు ధర్మంబు దలపవు ధరణినాథు
లనుచు సంశయచిత్తుడ నైతినిటుల. ౨౩

క. పాపార్జిత మగు విత్తము
తీపాయెనె నీకు భరత తీరునె దీనన్
కోపము విడువగరాదో
పాపము సుమి భరత రాము బాధల బెట్టన్. ౨౪

గీ. కపటి యాతడు గాడయ్య కాశ్యపీశ
దోస మాతని పట్టున దొడరబోదు
సకల కళ్యాణగుణ గణ సంయుతుండు
రాము నీవెట్లు దలతువో రాజ్యకాంక్ష. ౨౫

గీ. వినుము నామాట రాజులు విపులనేల
దగినవారైన ధర్మంబు దాటునపుడు
మునుల మహిమల శస్త్రాస్త్రములకు గలుగు
మహిత మహిమంబు బోవును మహిప భరత ! ౨౬

గీ. అనిన గొడ్డట నరికిన యవనిజంబు
పడినయట్టుల భూమిపై బడియు లేచి
కనుల బాష్పంబు కాలువ గట్టుచుండ
దనువు గంపింపఁ దడబాటు దనర బలికె. ౨౭

సీ. సర్వజ్ఞుడవు నీవు సర్వసత్వంబుల భావంబు లెఱిఁగిన భవ్యమతివి
దశరథపుత్రుడు ధర్మంబు దప్పునే కఠిన వాక్యంబుల గర్ణయుగళి
బగులజేయుట మేలె భావ్యమే నీకిది కైకపుత్రుడ నైన కారణమున
మాతులగృహమునమసలుచుండుటచేత మాతల్లి జేసిన మాయ నెఱుగ

గీ. తప్పు నాయందు లేదని తలపవయ్య
ధరణి నేలగ మనమున దలప నెపుడు
వంశమర్యాద నెఱుగుదు వరగుణాఢ్య
రాము తమ్ముని జడుడని రవ్వగూర్తె ? ౨౮

సీ. సార్వభౌమాన్వయజాతుఁడు జ్యేష్ఠుఁడు రాజేల గాకుండు రామవిభుడు
దశరథ యజ్ఞీయ తత్వంబు రాముడు రాజేల గాకుండు రాజ్యమునకు

సకల సద్గుణ మణి సర్వలక్షణమూర్తి రాజేల గాకుండు రామవిభుడు
మహితర్షి పూజ్యుడు మహిమాభిరాముడు రాజేలగాకుండు రాజ్యమునకు

గీ. మను తపస్సిద్ధ మహితార్థ మాన్యమూర్తి
జనక జామాత వాసిష్ఠ జన్మఫలము
భరతభాగ్యంబు కౌసల్య భవ్యతపము
రామచంద్రుడు మను రాజ్య రాజుగాడె? ౨౯

సీ. కనులకందగరాని కమనీయతేజంబు గలవాడు రాముడుగాక యెవడు
నాలుక దెలియని నవ్యపీయూషాఖ్యగలవాడు రాముడు గాకయెవడు
మనసుభావనజేయుమహితమారూపంబుగలవాడు రాముడుగాకయెవడు
దివ్య మునులకైన దెలియనితత్వంబు గలవాడు రాముడుగాకయెవడు

గీ. కనుల గనుగొని తృప్తిని గాంచునెవడు
వినుచు నామము చాలని విసుగునెవడు
మనసు రాముని జేర్చక మసలునెవడు
పరమదైవము రాముడు భక్తులకును. ౩౦

గీ. జనన మాదిగ నాచిత్త చర్య యిట్లు
జరుగుచున్నది నిజమిది సంయమీంద్ర!
యతడె నాతల్లి దండ్రియు నతడె గురుడు
నతడె దైవము పాలకు డతడె నాకు. ౩౧

సీ. సర్వజ్ఞుడవు నీవు జడునిగ దలచితే రామానుజుని నన్ను రామభక్తు
నున్నది లేదన్న మన్నన జేయుదె? కపటవర్తన నాకు గలుగు ననుదె
పనినాడె రాముని పాదాబ్జసేవను పరమభోగ్య మనుచు బట్టలేదె
యల వసిష్ఠుని శిష్యుడనృతముబల్కునె కాముకునిగ నన్ను గాంచినావె

గీ. అహహా నను నీవె యిటుబల్క నవనిజనము
లేమి యనఁగోరొ యూహింప వేల నిజము
చెప్పుమని నిన్ను వేడెద చేతులొగ్గి
రాముతమ్ముని గరుణించరాదొ నన్ను. ౩౨

సీ. పరమశత్రులుగూడబఱికించిరామునిభావబంధముమాన్పబడయుబోరె
పరమ మూర్ఖులుగూడ బఱికించి రాముని భావవివేకంబుబడయుబోరె
పరమయోగులుగూడబఱికించి రామునిదమయోగదృష్టుగాదలపబోరె
పరమ కాముకులైన బఱికించి రాముని పరమవిరక్తిని బడయుబోరె.

గీ. తపము ధర్మంబు దానంబు తత్వ మనస
మార్యజనసేవ సర్వతీర్థాభిగమన
మతిథి గురు పూజ సేయక యధికభక్తి
రామచంద్రుని సేవింప రాదె ముక్తి? 33

క. నా మతము వినుము చెప్పెద
కామిత మొకటైనగాని గనబోనుసుమీ
కోమల సరసిజ నిభముల
రాముని వర పాదములను రక్తి న్గొలుతున్. 34

ఉ. పోవగ వచ్చినాడ రఘుపుంగవుఁ దెచ్చుట కే నయోధ్యకే
పావనమూర్తి రామనృపు పాదయుగమ్మున వ్రాలి యన్న నన్
గావుము తప్పు సైచుమని గట్టిగ వేడగఁ బూనినాఁడ నీ
తావిభు డుండుతావు కృపదప్పక సంశయమేది చెప్పవే. 35

వ. అని పలికిన పరమ విరక్తుని వాక్యముల విని.

చ. భరతుని జూచి నవ్వుచును బల్కె మహర్షి నృపావతంస ! నీ
గురుహిత కాంక్ష సాధులను గొల్చుట యొప్పును నిత్యకీర్తివై
పఱగుము నీకు సాటియగు భవ్యులు లేరు జగత్రయంబున
న్వరగురుబోధ నీ యెడల వాసికి నెక్కె సుధీమనోహరా! 36

చ. ఎఱుఁగుదు నీదు చిత్తగతి నెప్పుడు ధర్మము గూర్చబోవు నే
నెఱిఁగియుఁ గీర్తిగూర్ప మది నెంచితి బుద్ధి దృఢీకరింపగా
బిఱుసన బల్కినాడ పృథివీజను దమ్మునిగూడి ధీరుడై
బఱగెను చిత్రకూటమున భవ్యుని జూడగఁ బొమ్ము పార్థివా! 37

క. ఈ పూట నుండు మిచ్చట
నీ పౌరులు మంత్రివరులు నీవును సేనల్
కే పాడియొ పోవలయును
సాపాటాచరింప నిచట సమ్మతిపడుమీ. ౩౭

ఉ. భూమిప! సేనల న్నిలువ బుచ్చుము భృత్యుని బుద్ధిమంతునిన్
భూమిని దుర్లభంబుసుమి భూరి పదార్థయుతాన్న మిప్పుడే
యేమి కొరంత లేనటుల నేర్పడు దానన తృప్తిగల్గునూ
మామక వాంఛ దీర్చుటయె మంగళదాయక మౌను నీ కికన్. ౩౯

వ. అని పలుకుచున్న భరద్వాజ మహర్షి వాక్యంబుల విని భరతుండు భగవంతుడగు వసిష్ఠమహర్షికి విన్నవించి తదనుమతి నడసి భరద్వాజ మహర్షి నవలోకించి మహాత్మా! భవద్వాక్యంబులు వేద వాక్యంబులవలె ననుల్లంఘనీయంబులగుట భవదాజ్ఞానువర్తన కైంకర్యంబుల జేయ సంసిద్ధుండ నైతినని పలికి సేనల నెల్ల రప్పింప నాజ్ఞ యిడిన.

క. భరతాజ్ఞ సేనలన్నియు
త్వరితముగా జేరి నపుడె తత్పరిసరభూ
వర మైదుయోజనంబులు
బఱగెను బో సమతలంబు వరముని మహిమన్. ౪౦

వ. అంత నందరు నద్భుతపడి చూచుచుండ భరద్వాజమహాముని తపోవిభవంబున

సీ. చదరముగా నుండు చక్కని గృహములు గజవాజిశాలలు కనకగిరులు
కమనీయ నవరత్న కాంచన హర్మ్యము ల్మహిప యోగ్యము లైన మందిరములు
రాణులు నివసించు రమణీయ గృహములు శయనాసనంబులు చామరములు
దివ్య రసాంచిత దివ్యాన్న భక్ష్యము ల్సురతరువర పుష్ప శోభితములు
గీ. కలిగి పండువు గలిగించె కన్నులకును
మునియు ముదమున భరతుని ముందు నిలిచి

రమ్ము రమ్మని బిలుచుచు రమ్యభవన
మొకటి జూపింప భరత నృపోత్తముఁడు. ౪౧

చ. అనుచర మంత్రియుక్తుఁడు నృపాసన ముత్తమ ఛత్రయుక్తము
న్ననుగొని పోయి దూరముగ గ్రక్కున జుట్టి నమస్కరించుచు
న్మనమున రాము నెంచుచును మాన్యుని తమ్ముఁడు చామరంబు చే
కొనిగన మంత్రిపీఠమున కోరికలొప్పగ గూరుచుండినన్. ౪౨

వ. మంత్రులు గురువులు పురోహితులు మొదలగువార లందఱు
దమ కర్హంబులగు నాసనంబుల గ్రమముగ వసించిరి. రంభోర్వస్యాద్యప్స
రసలు భరద్వాజ మహర్షి నియమంబున భరతునిముందు నిలచి
మనోహరములగు తార్యత్రిక వినోదముల జరిపిరి. అంత

సీ. ఓపిక సురవేశ్య లొకనికి నెనమంద్రు సరసభాషణ గీత సంయుతముగ
దలయంటినలుగిడితగుజలములుబోసిధూపంబులిడికురుల్ దువ్వియార్చి
మహితగంధముబూసి మందారమాలిక లలకలపై జుట్టి యందముగను
కాంచన వస్త్రము ల్గాంచనాభరణముల్బరిమళద్రవ్యముల్బరగ గూర్చి

గీ. సకల సత్కారములచేత సత్కరించి
రతి మనోహర మధురాన్న మాజ్య సూప
శాక దధి భక్ష్య లేహ్యాది సంయుతంబు
జిహ్వ కింపగునట్టుల జేర్చి యిడిరి. ౪౩

క. నాలుక కింపగు రుచులకు
లోలంబగు చిత్తవృత్తి లుబ్ధం బగుటన్
బాలురు వృద్ధులు యువకులు
జాలగఁ దినుచుండి రమృతసార మొ యనుచున్. ౪౪

గీ. తపసునకు దుర్లభం బేది తలపగలదు ?
పరమపురుషుఁడు వశ్యుఁడై బఱగుచుండ
నితరములు వశ్యమగుటకు నేమికొఱత ?
గనుక మునులెల్ల మహిమలు గలుగువారు. ౪౫

వ. అప్పు డచట నున్నవా రందరును దమలోఁదా మిట్లనుకొనిరి.

సీ. చక్రవర్తుల యింట సరస రుచ్యాన్నము ల్దినలేదె యారుచి తీరుగలదె
చక్రవర్తులయింట సరసిజాక్షులనెప్డుగనమె యీసొగసందుగాంచినామె
చక్రవర్తులకుండు సకలసౌధంబులగనమె యీఘనమందుగాంచినామె
చక్రవర్తుల కెప్డు సమకూడియుండని సిరులు నేడిచ్చట సిద్ధమయ్యె

గీ. పలుక దలపగ శక్యమె పరమ మునుల
వర తపశ్శక్తి వర్ణించువారు గలరె ?
వినగ దలచగలే దిట్టి వింత మనము
భరతు సేవించ నీరీతి భాగ్యమొదవె. ౨౬

చ. భరతుడు కాల్యకృత్యములు భవ్యముగాగను దీర్చి తమ్ముఁతోఁ
బరమ మునీంద్రు పాదముల భక్తిని వందన మాచరించగా
భరత సుఖంబుగా జనెనె పావన రాత్రి యటన్న హాయిగా
బరచెను రాము జూడదగు బాటను దెల్పుము వేగఁ బోయెదన్. ౨౭

వ. అనవిని భరద్వాజమహర్షి భరతుని మన్నించి రామనివాసంబు దెలిపి యట కేగుట కనువగు త్రోవను తత్రత్యంబులగు విశేషంబులను సక్రమంబుగఁ దెలియజేసె నపుడు.

సీ. రాజేంద్రపత్నులు రథముల దిగి ముని పార్శ్వంబునందు సద్భక్తినుండి
రందుకౌసల్యతానతిశుష్క-యతిదీన సుమిత్రయైమొక్క-సాధుగతిని
కైకేయి సిగ్గున కరముల జోడించి వందన మర్పించి వాసవాభు
పుత్రుని దరిజేర పూజ్యుడు తల్లుల గలవిశేషంబులు గలయబలుకు

గీ. భరత యనవిని పల్కెను భరతు డీమె
రామ జనయిత్రి కౌసల్య రాజమహిషి
యీమె సౌమిత్రి జనయిత్రి యీమె నాదు
జనని కైకేయి కోపన చండశీల. ౨౮

గీ. గహనమున కేగె రాము డీకాంతవలన
గల్గె నాకంబు నృపున కీకాంతవలన

కలుషవారాశిఁ బడితి నీకాంతవలన
గదిసె దుర్దశ ప్రజల కీకాంతవలన. ౫౦

వ. అని పలికి మిక్కిలిగ శోకించుచుండె.

క. భరతుని శోకము కనుగొని
భరతా! నీవిట్లు కైకఁ బలుకకుసుమ్మీ
పరహిత కార్యముకొఱకై
పరగునుసూ రామ విపిన వాసము తండ్రీ! ౫౧

వ. అని భరతు నాశ్వాసించిన భరతుఁడు

చ. మునివరు నాజ్ఞ బొంది నృపముఖ్యుని గాంచగ సేన నప్పుడే
జనుమని యాజ్ఞ నిచ్చి జవశాలి తురంగము నెక్కి వేగమే
చనియెను దూర మగ్రమున జక్కఁగఁ జూచి వసిష్ఠసంయుమి
న్గనుగొని చిత్రకూట మదె కాంచుము నిమ్నగ కాననం బదే. ౫౨

మ. అదిగో తమ్ముఁడ! చూడు మల్లదియె ధూమాగ్రంబు గన్పట్టెడిన్
సదయుం డగ్రజు డున్న తా విదియె, అన్నా! వేఱుగా ప్రక్కగా,
నదిగో స్రోవ, సమస్తసేన నిటనే యాపంగఁబోలుంజుమీ!
పదనీ వేను సుమంతుఁడు న్గురుఁడు భూపాలు న్గనం బోఁదగున్. ౫౩

వ. అని పలికి వారలతోడఁ గూడి పరివారమును నిలిపి భరతుడు వేగముగ విపినంబెల్ల గలయం బఱికించుచుండ నట రామాశ్రమమున రామభద్రుడు తమ్ముడగు లక్ష్మణుడు సీతయు నివసించియుండ నొక్కసారిగ మృగతండమంతయు భీతిల్లి యఱచుచు దిక్కులకు బరచెను. పక్షులన్నియు చెదరి యాకసంబున నరచుచు నెగురుచుండెను. వీనులకు వింత గొలుపునటుల తురగముల ఘోషంబులును గజముల ఘుంకారంబులును భటుల జయజయారావంబులును రథముల చప్పుళ్ళును వియదంతరంబుల నిండి వినబడియె నపుడు రామభద్రుడు తమ్ముండగు లక్ష్మణవీరుం గనుంగొని,

సీ. తమ్ముఁడ లక్ష్మణ ధరణీశు డెవ్వడో సేనలతోఁ గూడి చేరనేమొ
తరువెక్కి పఱికించి తత్వముదెలుపుము ఘనజంతుగణములుగలఁగిపాఱె
యనవిని సౌమిత్రియటుల నెబఱికించియధికసేనలఁగాంచియనియెనిటుల
భరతుఁడు రాజ్యంబు బడసియు మనలను గడ తేర్చఁగా నెంచి గడగివచ్చె

గీ. కోవిదార ధ్వజంబదె కొమరు మిగిలె
సకల బలములఁ దెచ్చెను సాహసమున
సహజ సౌహార్ద మెచ్చట సమసిపోయె
కైకపుత్రున కబ్బెదో కైక గుణము ? ౫౪

గీ. అగ్ని నాత్మను శమియింపు మన్న యిపుడె
సీతనుంచుము గుహయందు శీఘ్రముగను
చాప మెక్కుడు బెట్టుము చతురముగను
కవచమును దాల్చి నిలువుము క్రమముగను. ౫౫

క. భరతుని నేఁబఱిమార్చెద
భరతానుగు లెందరైన బాయుదు రసువుల్
భరతుని జంపగవచ్చెను
భరతుం డపకారి యగుట బాపముగలదే ? ౫౬

సీ. సౌమిత్రి యీరీతి సౌజన్యమును వీడి సంరబ్ధకోపుఁడై సంచరింప
శాంతముగాఁ బల్కి శాంతునిగాఁ జేసి కోపము నీకేల కోమలాంగ!
మహనీయుఁడైనట్టి మనభరతుని నీవు సామాన్యుఁ డనెదవే సత్యమూర్తి
తండ్రిని విడనాడితమ్ముని దునుమాడి రాజ్యము గాంక్షింప రాక్షసుడనె

గీ. బంధు మిత్రుల బరిమార్చి పడయునట్టి
విత్త మరయంగ విషమ వివేకుఁకును
సమయ మిది నాకు సహజుల సంపదలకె
రాజ్య ధనముల గోరుదు రమ్యశీల ! ౫౭

క. తమ్ములు వెలియఁగు సొమ్ములు
వమ్ములుషూ నాకు నెపుడు వారిజనేత్రా

తమ్ముఁలు దినగా మిగిలిన సొమ్ములు
సొమ్ములు భోగ్యంబులగును సోమనిభాస్యా! ౧౭

క. తమ్ములకొఱకే విత్తము
తమ్ములకై రాజ్యకాంక్ష ధర్మము శరముల్
తమ్ములకొఱకే తనువును
తమ్ముల విడనాడ నిద్దితమ్ము లవెల్లన్. ౧౮

సీ. సాగరావృతమైన సర్వధరిత్రియు శక్రత్వమైనను శమధనాఢ్య!
ధర్మము చేకూర్ప దమ్ములకై నేను పాల్పింపబూనుదు పటిమతోడ
ధర్మము గాదేని ధరణియె గాదయ్య సర్వము వీడుదు సత్యమిదియ
భరతుడు నీవును బాలుడు దమ్ముడు బడయనిసుఖమును బడయజాల

గీ. తమ్ములందర నొకరీతిఁ దలతు నెప్పుడు
ప్రాణములకంటె తమ్ములే ప్రబలహితులు
భరతు గుణముల బరికించి పలికినావె
దయయు ధర్మంబు దలపుము తమ్ముకుఱ్ఱ! ౨౦

సీ. భరతుని భావంబుబరికించిచూడుము తెలిపెదనే నిప్డు తెలియఁవినుము
రాజగృహమునుండి రాఁదోడ నేవిని కులధర్మమంతయు గూర్మిదలచి
భ్రాతృవత్సలుఁడునుభక్తియుగలవాడు వనవాసులమనల వల్కలాఢ్యు
లనుగాగ నెఱుగుచు గనుగొన మదిగోరి దయయును స్నేహంబు
దఱుముచుండ

గీ. తల్లి గర్జించి బరికించి ధర్మవితతి
తాత మెచ్చగ ధరణిని తాను వీడి
మనలఁ గొనిపోవ వచ్చెను మాన్యుడతడు
ప్రాణములకంటెఁ బ్రియుడని భరతునెఱుగు. ౨౧

గీ. భరతు డెప్పుడైన యేవంత భయము నీకుఁ
గలుగజేసెనె పలుకుము గలిగియున్న
నిట్టి శంకకుఁ గారణ మేమొ జెప్పుమ
భరతు నన్నది నాయందు బఱగుసుమ్ము. ౨౨

గీ. ఎట్టియాపద చేకూర నెటులనైన
తండ్రి జంపెడి తనయుడు ధరణిగలడె?
ఎట్టి యాపద చేకూర నెటులనైన
భ్రాతలను జంపజాలిన భ్రాతగలడె ౬౩

క. భ్రాతల ప్రాణముకొఱకును
భ్రాతియె దన ప్రాణమరయ బ్రతికిన ఫలమా
భ్రాతలు దానును బ్రతికిన
భ్రాతలమందేమి కొఱత బుద్ధిని గనుమా. ౬౦

సీ. రాజ్యంబు లక్షించి రాఘవు నీరీతి బలికినాడవు నీవు పరుషముగను
భరతుసురాగానె భరతుడ! రాజ్యము సౌమిత్రికిమ్మని సౌమ్యముగను
బలికెద నిచ్చునో పరుషములాడునో పలికించిచూడుముపరమమిత్రు
బలికినకోడనె భయభక్తిరాజ్యంబు నీకివ్వగలడుసూ నిపుణుడతడు

గీ. కఠినచిత్తుడు కాడుసూ కరుణ గలడు
ధర్మతత్త్వము నెల్లను దఱచి యెఱుగు
భయము భక్తియు గలవాడు భద్రమూర్తి
భరతు నెఱుగుము పరిణత భక్తుడతడు. ౬౫

వ. లక్ష్మణ! నీ వాక్యంబుల నీవె పరిశీలించుకొనుము. నీ వింద్రియంబుల జయింప నేల ప్రయత్నింపవు? ఇంద్రియ వశుడగువాడు నిజమగు సుఖమును బడయజాలడు. నీవు కోపపరీత మానసుడవై పలుసారులు పరుషంబుల బలుకుచుంటివి. కోపంబు నీ వంటివానినిగూడ దన స్వాధీనంబున నిడి యిట్లాడించుచుండిన నిక నన్యుని గతిని యేమి చెప్పవలెను? క్రుద్ధుడగువాడు పరుష వాక్యంబుల సాధువులను గురువులనుగూడ దూషింపగలడు. క్రుద్ధుడు జేయనేరని దుష్కార్య మేదియేనిం గలదె? కావున నీవు శాంత చిత్తుండవై చేసిన యపరాధమునకు పశ్చాత్తప్తుడవు కమ్ము అని పలుకు రామవాక్యంబులను లక్ష్మణుడు విని.

క. హితములు రాముని పలుకులు
మతిమంతుడు లక్ష్మణుండు మన్నన విని తా

నతిలజ్జాపరవశుడై
పతివగు నిను జూడగోరి భరతుడు వచ్చెన్. ౧౬

చ. అనవిని రాము డిట్లనియె నార్యుడు సీతను నిన్ను నన్ను దా
ననఘు డయోధ్య జేర్చ మదియందు దలంచుచు వచ్చె సేనలా
ఘనులు సమస్త మానవులు గాంచగ గోరిన గోడి తెచ్చె నే
మనెదవు తండ్రి రమ్మనిన నర్హమె రా ననుబోవు టెట్లొకో. ౧౭

క. వినయంబున మన జనకుని
మన మలరగ నర్చజేసి మహితుని గరుణా
న్గని యిట నిలువగవలయును
ఘనసమయము నిండగానె ఘను గొలువవలెన్. ౧౮

గీ. సీత సుకుమారి యడవిని జేరి యిటుల
గష్టపడుదాని గనుగొని కరుణ గలిగి
తండ్రి యిప్పుడె గొనిచను ధరణిపుత్రి
నబల యడవిని నివసింప నర్హ యగునె ? ౧౯

వ. అని పలికి తానును వృక్షం బెక్కి యోహించి కనుగొని లక్ష్మణా కనుగొనుము.

క. జవనాశ్వంబులు రెండవి
పవనాధిక వేగయుక్తి బఱచును గనుమీ
రవి తురగంబుల కంటెను
భువనంబు లఱంచు గురుడు పలికిన నవియే. ౨౦

క. అదె సేనల కగ్రంబున
మదగజ మట నడలుచుండె మానుగ గనుమీ
యది శత్రుంజయ మనునది
విదితం బగు తెల్లగొడుగు విడిచె నదేమో. ౨౧

క. వెలిగొడుగు వెలయకుండుట

చలియించె నెడమ నేత్రము
విలసిల్లునొ జెవ్వుల నెట్టివింతల వినగన్. ౨౩

వ. అని శ్రీరామచంద్రుడు సంశయ గ్రస్త హృదయుడై సౌమిత్రి తోడ బలుకుచుండ.

క. అట సేనలు భరతాజ్ఞను
దిటముగ నా కొండప్రక్క తీరుగ నిలువన్
పటుగతి గనపడుచుండెను
చటులంబుగ క్రోసు లారు సరిపడునటులన్. ౨౪

క. భరతుడు తమ్ముని గనుగొని
పరివారము కొంత గొనుచు బటికింపు మికన్
సురరాజతుల్యు రాముని
పరిసర మిది యనుచు నాకు పలికెడిదాకన్. ౨౫

క. పురజనము నేను మంత్రులు
గురువులు విప్రోత్తములును గూరిమి యడవిన్
హరిదశ్వవంశు గనుగొను
వఱకును దిఱుగాడగలము వఱలెడి భక్తిన్. ౨౬

గీ. రమ్యగుణధాము రాఘవరాముగాని
శ్రీనిధానంబు సీత సుశీలగాని
విజయ లక్షణు లక్ష్మణ వీరుగాని
కనుల గనుదాక శాంతిని గనగ జాల. ౨౭

క. రాముని చరణంబులు నిజ
కామిత ఫలదాన దక్ష కల్పక తరువుల్
కోమల పల్లవ నిభములు
నా మది గనకుండ శాంతి నా కెటుగలుగున్. ౨౮

క. అభిషేక మంత్రబలమున
నభిషిక్తుని రాము గనుల నానందమునన్

విభవాభిరాము గనుగొన
ప్రభవించును శాంతి నాదు భావమునందున్. ౭౯

సీ. సర్వార్థసిద్ధుడు సరసుడు సౌమిత్రి సేవల జేయుచు జేరె రాము
కృతకృత్యువై దేహికృపతోడ(శ్రీ)రాముఛాయనుబోలుచు సంశ్రయించె
కాకుత్స్థు డుండుట గలిగిన కతమున చిత్రకూటనగము జెందె శుభము
పరమ పురుష పద భాసిత విపినంబు పరమపదంబన బఱగె మిగుల.

గీ. ననుచు భక్తిని పదముల నడవి దిఱిగి
భరతు డప్పుడు పుష్పిత పాదపముల
శిలల కంటకతతులను చేరి చేరి
రామవాసంబు దెలియగ రక్తి దిఱిగె. ౮౦

క. తరు వెక్కి చూచె భరతుడు
బరువడి ధూమధ్వజాగ్రభాగము దోచెన్
వర రామవాస మిదియని
పరిశీలన జేసి తెలసె పటుతర బుద్ధిన్. ౮౧

క. అనుజన్ముడు శత్రుఘ్నుడు
దన మార్గము ననుసరింప దన గురువరునిన్
తన తల్లుల గొని రమ్మని
ఘనతృష్ణను రాముగాంచ గదలెను వేగన్. ౮౨

క. రఘుకుల మంత్రి సుమంతుడు
రఘురాముని రాము గనగ రాజిత భక్తిన్
లఘుగతి నాభరతునితో
నఘదూరుడు కూడి చనియె నతివినయమునన్. ౮౩

క. నడచుచు గనుగొనె నుటజము
గడు రమ్యపు పర్ణకుటిని గడు దూరమునన్
పడవేయబడిన కట్టెల
వడి పువ్వుల సంచయముల వల్కలతతులన్. ౮౪

క. పిడకల రాసులు మిక్కిలి
పడియుండెను చెట్లమొదట బలమగు చలిచే
కడుపడి గలిగెడి పీడల
దిలుమునఁ గాననముల నోవగ దెచ్చిన వచటన్. ౮౩

క. వడచుమ సంభోగముల సమ్ముఖ
వశిష్ఠ మునిని పక్కన ద్రష్టి నిల్చి యిచటన్
గడు ముదము గూర్చుచుండెను
కడునడిగా రామభద్రు గాంచెద మనియెన్. ౮౪

క. వృషభ వ్యాఘ్రుని రాముని
పరిపూర్ణ శశాంకవదను భాస్కరవంశ్యున్
కరుణాసాగరు గాంచెద
పరమాత్ముని బరమయోగి. పరికించుగతిన్. ౮౫

ఉ. కేవల భూమిపంచు నృపకేసరి వీరవరాసనస్థుడై
పావనమూర్తి యుండె నిట పాప మెఱుంగని నాకు పాపము
ద్భావితె మయ్యె లోకమున భవ్యుని పాదములందు జేరి నే
లేవక యుండువాడ మిథిలేశుని పట్టిని భక్తి గొల్చెదన్. ౮౬

మ. అహహా యేమని చెప్పవాడ నిట నాహా రామపాదంబులే
మహితానందద ము గ్గనంబడియెగా మా భాగ్య మిారీతిగా
విహితంబై ఫలియించె పుణ్యఫలము స్వీక్షింపగా గల్గె బో
బహిరంతస్మృద మావహిల్లె రఘు భూపాలు న్విలోకించుటన్. ౮౭

సీ. మనురఘుముఖ రమ్యమాణిక్యమయపీఠ సంస్థితి కర్హుండు సత్వమూర్తి
కృష్ణాజినము దాల్చి కృతముని వేషుడు పరుష శిలలపైని బఱగె నిటుల
పావక నిభమైన పరమతేజముచుట్టు కనులకెక్కసమౌచుగలిగియుండె
చిదచిదీశ్వరులట్లు సీతయు దమ్ముడు దనతోడ నివసింప ధర్మనియతి

గీ. మామకీనాతి దుష్కర్మ మహిమవలన
నడవి బాధల బడియె నీ యార్యవరుడు

యేమి జేయుదు దుష్కీర్తి నెటుల దొలతు
నితని కరుణకు పాత్రుడ నెటుల నౌదు. ౯౦

గీ. సకల కళ్యాణ గుణగణ సంయుతుండు
కాన నిట్టుల గష్టము గనుచునుండె
నేమి చేయుదు దుష్కీర్తి నెటుల దొలతు
నితని కరుణకు పాత్రుడ నెటుల నౌదు. ౯౧

సీ. మాతులగృహమున మాతమ్ముడునునేనుమందమనీషను మసలినాము
మాతల్లి దుర్దైవమహిమను మతిచెడి మర్యాద విడనాడి మమత జెందె
మా తండ్రి కైకేయి మహితశక్తికి లొంగి ధర్మంబు విడనాడి దారితప్పె
మా గురువర్యుడు మాటాడగాలేక పోయినదారిని బోవనిచ్చె.

గీ. కైకమాటల మా యన్న గణనజేసి
యబల సుకుమారి దోడ్కొని యడవి జేరె
యిటుల గష్టంబు లందుచు నిచటనుండె
నేమిసేయుదు దుష్కీర్తి నెటుల దొలతు. ౯౨

వ. అని చింతించి భరతుండు నిజాగ్రభాగంబున సాలతాలాశ్వకర్ణపర్ణాచ్ఛాదితయు నీశాన్యభాగ నిమ్నోన్నతయు మృదుకుశాస్తీర్ణయు నగు పర్ణశాలంగని తదగ్రభాగంబున నుటజ మధ్య భాగంబు మనోహరంబగు వితర్దికపై నివసించిన

సీ. ఇందీవరశ్యాము నందితభృగురాము దశరథనందను ధర్మనిరతు
సింహపరాక్రము సింహసదృశమధ్యు ధవళాంశువదను సౌందర్యసదను
సౌదామినీ శ్లిష్ట సరస మేఘముబోలె సీతాసమన్వితు సేముషీఢ్యు
లక్ష్మణసేవితు లావణ్య సంయుక్తు కమలదళ నయను కాంతి సదను.

గీ. తపన సదృశ ప్రతాపు నతార్తి హారుని
శ్రితహిత ప్రియసంధాను శ్రీవిశాలు
సత్య నిత్య వచనసారు చారుహాసు
పురుషమోహాను రాఘవు పూజ్యు గనియె. ౯౩

వ. భరతరాజపుడు శ్రీరామచంద్రుని గని శోకహర్షంబులు దన మనంబున ముప్పిరిగొనుచుండ నిట్లు పలికెను.

సీ. వెలగల వస్త్రము ల్వేడుక దాల్చువా డీనారచీరల నెట్లు దాల్చె
కమనీయ సుమమాలికల నెప్డు దాల్చువా డీజడలనుదాల్చె నెట్లుజాలె
గసుల నెండల గాంచగాలేని సుకుమారు డీవిపినంబున నెట్లు దిఱిగె
కలమాన్నముల దిన గాంక్షించుచుండువా డీదుంపతూడుల నెట్లుమెక్కె.

గీ. సధిక భోగార్హుడగు సీత డడవి నిటుల
కష్టపడుచుండె మామక కారణమున
నెటుల జీవింతు ననులోకు లిట్లునవ్వ
నితని కరుణకు పాత్రుడ నెటుల నౌదు. ౯౪

వ. అని బహువిధంబుల బలుకుచు సమీపించినకొలది దుఃఖం బతిశయించుచునుండ బహువిధంబుల దన యపరాధంబులను రాముని సద్గుణంబులను వెల్లడించుచు నిక రాముని పదంబుల బడి నా యపరాధంబు క్షమించువఱకు లేవక యుండెదను.

క. అని మిక్కిలి విలపించుచు
కనుదమ్ముల నశ్రుగణము కాలువ గట్టన్
ఘనరోదన మొనరింపుచు
పరమార్తిని రామచంద్రు పదముల బడియెన్. ౯౫

క. పడియుండి యార్య యనుచును
దడబాటున నుచ్చరించి దారుణశోకం
బెడమియ్యకున్న కతమున
నుడివడి మారాడలేక సొక్కుచు నుండెన్. ౯౬

వ. అంత సత్వరంబుగ

క. పదపడి శత్రుఘ్నుడు తన
పదపతితుడుగాగ నెత్తి బాష్పము లొలుకన్

సదయుడు దమ్ముల నిద్దర
ముదమొప్పగ గౌగిలించి మూర్కొనె శిరముల్. ౯౭

వ. తమ్ములారా నాకన్నులు మిముగనుటచే చల్లబడినవి. మనంబున జెప్పశక్యముగాని యారాటంబు గలిగె గాని యది మిమ్ముగాంచుటచే నించుక యుపశమించినది యనిపలికి భరతు నీక్షించి,

క. మన తండ్రి యెచటనుండెను
ఘన జనకుని విడిచి నీవు కానకురాగా
మన మెటు లొప్పెను భరతా
విను జనకుడు బ్రతికియుండ విడుచుట తగునే ? ౯౮

క. చిరకాల మయ్యె గనుగొని
పురుహూతసమాను నిన్ను భూరిగుణాఢ్యున్
పరిశుష్కదేహివైతివి
యరుదిదె నీవిపినయాత్ర యర్థమె చెప్పుమా. ౯౯

క. మనతండ్రి బ్రతికియుండెనె
ఘను డాతడు లేక దివికి గడగెనె జనగా
మనమున కేమో శోకము
ఘనముగ చేకూరుచుండె కారణమేమో. ౧౦౦

క. ప్రజలందరు మన్నింతురె
ప్రజలను నీ ప్రజలవలెను పాలించుదువే
ప్రజలకు హితవును గూర్చెడి
ప్రభువేగద ధరణిలోన ప్రభు డన బఱగున్. ౧౦౧

క. జనకుని బూజించుదువే
మనగురువును భక్తితోడ మన్నించెదవే
మన తల్లులెల్ల కుశలలె
మన మంత్రుల మాన్యతముల మనవుల వినుదే. ౧౦౨

క. మతిమంతుని నీతిజ్ఞుని
హితకారిసుధన్వగురుని హితవుల వినుదే

అత డెఱుగు నస్త్రవితతిని
ప్రతిలే రాతసకి, నాకు ప్రాణాధికుడున్. ౧౦౩

ఉ. కాలము దాటకుండగనె కారుణికోత్తమ జీత మిత్తువే
కాలము దాటిపోయినను గాంతురు వైరము భృత్యు లార్తులై
బాలికవృత్తి దాల్చెదరు భక్తము లేక కృశించి యుండుటన్
పాలన జేయువారె పరిపాటిగ భృత్యుల గావగావలెన్. ౧౦౪

క. అనురక్తులు కులపుత్రులు
మన మలరగ ననుచయంబు మరి విత్తములన్
వెనుదీయక నర్పింతురు
ఘనమున గను వారి నెప్పుడు కాంచుము కరుణన్. ౧౦౫

గీ. రాజు మెచ్చిన సన్మాన రాజి నిచ్చు
భటుడు మెచ్చిన నిచ్చును ప్రాణమైన
గాన భృత్యుల నెప్పుడు గరుణతోడ
ప్రభువు గాపాడవలయును ప్రాభవముగ. ౧౦౬

వ. పదునాలుగు రాజదోషముల బరిహరింపుము. దశవర్గ చతుర్వర్గ సప్తవర్గాష్టవర్గ త్రివర్గముల నర్థవిధిని సేవించుము. విద్యాత్రయ షాడ్గుణ్యా దైవ మానుష కృత్య వింశతివర్గ ప్రకృతి మండల యాత్రా దండవిధానాదుల నెఱుంగుము. పూర్వుల వృత్తము ననుసరించుము.

క. అని పలుకు రాము పలుకులు
విని భరతుడు బలికె నిట్లు వినయముతోడ
న్ననదగునె ధర్మహీనుడు
ఘనమగు నీధర్మ వితతి కార్యము గలదే. ౧౦౭

క. తనకు గా పలుకగ నిటులను
తగియుండునె రాజ్యమేల ధర్మము విననే
నగుబాటు బొందబోవనె
తగుగాదే జ్యేష్ఠసుతుడు ధరం బాలింపన్. ౧౦౮

వ. కావున నీవు జ్యేష్ఠుండ వగుట రాజ్యపాలనాభారంబు వహించ నీవ యర్హుండవు. నేనును తమ్ములును రాజ్యపాలనాయోగ్యులము గాము. భవత్పరిపాల్యులముగనుక నే

క. మన పురమున కరుదెంచుము
ఘనుడవు రాజ్యంబు నేల గరుణింపగదే
మనుజుడు రాముడటందురు
నిను నారాయణునిగాగ నే మది దలపన్. ౧౦౯

క. నీ చరిత మెంచి చూచిన
దోచదె దేవత్వ మహిమ తోయజనాభా
నీచుడ దాసుడ భృత్యుడ
ధీచతురత గావు నన్ను దివ్యవిచారా. ౧౧౦

ఉ. పరిణయమైన పిమ్మటనె భాస్కరతేజుడ వీవు బొమ్మన
న్బరువడి పోయి కేకయ నృపాలకు వీటను నుంటి వేడ్కతో
పురమును వీడి నీ విటకు భూమిజతో సహజన్ముంతోడుతన్
సురనుత చేర భూధవుడు శోకముతో దివి కేగె రాఘవా. ౧౧౧

—♦ దశరథుని స్వర్గగమనమును రాముడు వినుట ♦—

వ. అంత నేను

క. గురుఁ డంపిన దూతలతో
బరువడిని యయోధ్య జేరి పటుశోకమునన్
పరలోక విహితవిధులను
పరిపాటిగ జేసినాడ పరుఁడనె యైనన్. ౧౧౨

క. ప్రియుఁడవు తండ్రికి నీవిట
క్రియలన్నియు జేయవలెను గేవలభక్తిన్
బ్రియపుత్రు లిచ్చు సలిలము
ప్రియహితముల గూర్చఁగలదు పితరుల కెపుడున్. ౧౧౩

క. నిను దలచుచు శోకించుచు
గనగా నిను మదిని దలచి గనలేక నిను
స్వప్నమున వీక్షించెను జనకుఁడు
వినిపింపఁగవలెఁ నిట్టి విషయము నాకున్. ౧౧౪

క. అన విని రాముఁడు చింతను
ఘనపరశువున గూల్పఁబడిన ఘన తరువువలెన్
తన బాహుల తలబాదుచు
తను నిలువఁగక కొంతతడవు ధరణిని బడియెన్. ౧౧౫

క. తమ్ములుఁ సీతయుఁ జేసిన
కమ్మని యుపచారతతుల గాంచుచు తెలివిన్
తమ్ముల సీతను గనుగొని
గమ్మున గన్నీరు కాల్వగట్టఁగ ననియెన్. ౧౧౬

క. నేనేమి చేయువాఁడను
భూనేతయె బోయె దివికి భూమిని విభవం
బీనేత్రము గనజాలునె
రానేరను బొమ్ము భరత రాజ్యము నేలన్. ౧౧౭

క. భరతా సిద్ధార్థుండవు
పరలోక క్రియలు నీవు బఱపిన కతనన్
పరిహీనుఁడ నేనన్నిఁట
బరపఁగ లేనైతిగాదె వరసంస్క్రియలన్. ౧౧౮

క. జనకుడు లేని యయోధ్యకు
జననేరను సమయమంత జనఁగా నైనన్
ఘనమగు నీవిపినంబున
మునివృత్తిని మనెదనింక మునుల గొలుచుచున్. ౧౧౯

క. సమయము దాటిన పిమ్మట
వినుతుఁడనై పురికి జేర విహితపు బోధన్

సుమకోమల వరవాక్కుల
క్రమముగ శిక్షించు ఘనుని గాంచగఁ గలనే. ౧౨౦

క. వినవిక చెవు లాపల్కులు
గనబోవిక గన్నులతని కాయము నెపుడు
న్మన మొక్కటి మఱువదు సూ
దినకరకులు డస్తమింప దీనుఁడ నైతిన్. ౧౨౧

క. మిన్నును మన్నును గనపడ
దెన్నండును శోకమారదిటు విను మిపుడే
ఖిన్నుఁడనైతిని నేనిఁక
క్రన్నన మిము వీడిపోదు గహానంబునకున్. ౧౨౨

క. అనిపలికి భరతుతోడను
జని సీతను గనులగాంచి సంతాపమునన్
వనితరో వినుమిా మిక్కిలి
ఘనశోకము నాకుఁ గలిగె కాలముదప్పన్. ౧౨౩

క. నా జనకుఁడు నీ శ్వశురుఁడు
నా జననిని నిన్ను నన్ను నా తమ్ములనీ
నా జనులను విడనాడుచు
వే జనియెను నాకపురికి వింటివెతరుణీ ! ౧౨౪

వ. అని పలికి లక్ష్మణుఁగనుంగొని

సీ. తమ్ముఁడా లక్ష్మణ తండ్రిలేఁ డిక నీకు నాకంబు జేరెను నరవిభుండు
గతియేమి మనకిఁక గలిగెను కష్టంబుమతిచెడిపోయెను మహిాతుఁడేగ
గాఢాంధ తమసంబు గలిగెను సర్వత్ర కర్తవ్య మేమియుఁ గాంచలేను
గనులుండియును నేను గనలేను దేనినిబహుశోకభారంబుబడియెమిాఁద

గీ. కరుణగలవాఁడు కాకుత్స్థ కలశజలధి
శీతభానుఁడు బోయెను సిరులుతొలఁగె
కర్మకృతముల దాటంగ గలమె మనము
కర్మతిప్పలఁబడుదురు ఘనులుకూడ. ౧౨౫

గీ. దైవ మిట్టుల విపరీత దైవమగుట
కష్టములమీఁద కష్టము ల్గలిగె మనకు
పూర్వభవమున జేసిన పుణ్యపాప
ఫలము బొందకతప్పదు బ్రహ్మకైన. ౧౨౬

వ. అని రాముడు పలుకుచుండ

గీ. సీత తనమామ మృతివిని చేరి భర్త
గనుల గన్నీళ్ళు విడుచుచు గనగలేక
శిరమువంచుచు దుఃఖించె శీలగరిమ
లక్ష్మణుండును దుఃఖించె రావమెసఁగ. ౧౨౭

వ. అంత శ్రీరామచంద్రుండు ధీరుండగుట సీతను లక్ష్మణుని సాంత్వన వచనంబుల నోదార్చి ప్రాణికోటుల గతాగతంబుల త్రోవల బోధించి లక్ష్మణుంగని యింగుదీపిణ్యాకమును చీరమును సంవ్యానమును దెమ్ము మన తాతకు జలాంజలుల నర్పింప మందాకినికిం బోదమనిన లక్ష్మణుండు తత్తత్పదార్థంబుల సమకూర్చి రామసన్నిధికిఁ జేరిన రాముడు లక్ష్మణుని గని తమ్ముడ దుఃఖితుల దుస్సహాగతిని వినుము స్త్రీ బాల పురస్సరముగ నడువవలెను గాన సీతను ముందుగ నడువ నియమింపుము. తదనంతరమున నీవు జనుము. వెనుక నేను జనుదెంచెదననిపలికిన నట్టులనె జన నుద్యమించిరి. యంత సుమంత్రుడు వారిచెంత జేరి శోకాపనోదక వాక్యంబుల బలుకుచు రాముని హస్తంబు బట్టుకొని నడిపించి మందాకినీ జలంబుల దింపె నంత రామలక్ష్మణులు ప్రాఙ్ముఖులై వసిష్ఠోక్త క్రమంబున యాచమించి సంకల్పంబు జెప్పి జలంబుల స్పృశించి దక్షిణాభిముఖులై తత్కాలోచితంబుల నెఱపి పదపడి జలపూరితాంజలుల బట్టి మహారాజ పితృలోకగతుడవగు నీకు "మద్దత్తముపతిష్ఠతు" అని పల్కుచు నివాపాంజలుల విడిచి యథాయోగ్యంబుగ సర్వవిధుల నెరవేర్చి సపిండీకరణంబు విధివిహితంబుగ సలిపి బదరీమిశ్రితమైన యింగుదీపిణ్యాకమును దర్భాస్తరణమున నిడి సుదుఃఖార్తుఁడై రామభద్రుఁడు మహారాజరాజ దశరథ భూలోక దేవేంద్ర యీయాగారపిండిని భుజించి తృప్తినొందుము,

"యదన్నః పురుషోభవతి తదన్నాస్తస్యదేవతాః" యని యున్నదిగదా! నాకుగల భాగ్యానుసార మర్పించినాఁడ ప్రీతినొందుము అనిపలికి తత్తత్కృత్యంబుల నెరవేర్చి సుస్నాతులై మందాకినీ జలంబుల నాచమించి బయలువెడలి పర్ణకుటీరద్వారమున భరత లక్ష్మణ శత్రుఘ్నులు కరములఁ బట్టి రామచంద్రుఁడు మిగుల దుఃఖించె. సీతయు తమ్ములును మిగుల పరిదేవన మొనర్చిరి; యంత సైనికులందఱును రామ భరత సమాగమనమును దెలిసి రామసన్నిధికి జేరిరి. రాముఁడు వారినందఱ యథాయోగ్యముగ గౌరవించె నంత వసిష్ఠ మహాముని దశరథపత్నులనందఱ రాముని సమీపమునకుఁ దెచ్చిన రాముఁడు వారినందఱ గని దిగ్గున లేచి భయభక్తులఁ దల్లుల పాదంబులఁబడి దుఃఖించి వారి దుఃఖంబుల నపగమింపజాలు మృదువచనంబులు బలికి తల్లులచే మృదుహస్త స్పర్శంబుల బడసె. లక్ష్మణుండును తల్లుల కభివందనముల నొనర్చి వారిచే నాదరింపఁబడియె. పతివ్రతాతిలకం బగు సీత దనయత్తల పాదంబుల కభివందన మొనర్చిన వారందఱు సీతను గౌఁగలించుకొని మిగుల జింతించిరి. కౌసల్యయు సీతను గాఢంబుగ నాలింగన మొనర్చి తన దుఃఖమంతయు వినిపించె నంత రాముఁడు సీతయు లక్ష్మణుండును వసిష్ఠభగవానుని పాదంబుల కభివందన మొనర్చిరి. ఆ మహామహుఁడు వారినందఱ శోకాపనోదక వాక్యంబుల నపనీతశోకుల జేసె నంత నందఱును యథోచితంబుగ నుపవిష్టులైరి. భరతుడు రామసన్నిధిని యభిముఖంబుగ నుపవిష్టుడయ్యె సభాసదులెల్లను రామ భరత సంభాషణంబుల వినకుతూహలులై దమ కర్ణ నయనంబులు తద్గతంబుల నొనర్చియుండిరంత.

క. భరతుని గనుగొని రాముడు
   వరకరుణను బలికె సిటుల వైభవయుక్తిన్ .
   భరతుఁడ చీరల జడలను
   కరమరుదుగ దాల్చినావు కారణ మేమో. ౧౨౮

గీ. రాజ్యమును వీడి నారల రమణ నీవు
   గట్టి జడలను దాల్చగ గడగితేల

ప్రజల మంత్రుల గురువుల బ్రబలముగను
తోడితెచ్చితి వేలొకో తోయజాక్ష. ౧౨౯

వ. నీకు భూరాజ్యంబు నాకు వనరాజ్యంబు పితృదత్తములు వనపాలనమునకు నేను మునివృత్తి నవలంబించితి నీవు ప్రజల గాచుటకు తగిన మహారాజ లాంఛనంబు లవలంబించుట పితాజ్ఞా విహితధర్మము. నీవు పరధర్మము నాశ్రయించి స్వధర్మమును విడిచితి వనియె. భరతు డామాటలు విని లేచి వందన మాచరించి యభిముఖముగ నుపవిష్టుడై.

క. అతివినయ భక్తియుక్తుల
నతశిరుడై భానువంశనాథుని ముఖమున్
జితవిషయి గనుచు భరతుడు
మతిమంతులు మెచ్చునటుల మహితుడు బలికెన్. ౧౩౦

క. కరుణాసాగర జనకుడు
విరచిత దుష్కార్యుడగుచు విపరీతగతి
న్స్మరనిభ నిను విడనాడుచు
సురలోకము జేరె మిగుల శోకాహతిచేన్. ౧౩౧

క. రాజ్య మరాజక మయ్యెను
పూజ్యజ్యేష్ఠుండు దీని బూనగదగుటన్
ప్రాజ్యక్షోణీచక్రము
భోజ్యము నీ కయ్యె, గాన బ్రోవగ రమ్మా. ౧౩౨

క. తడయక నరదేవేంద్రుడ !
వడి రాజ్యమునందు పట్టభద్రుడవై దా
సుడనగు నను గావంగా
కడువేడుక లేచిరమ్ము కారుణ్యనిధీ. ౧౩౩

నేను నీకు దయాపాత్రుడనైనను నాకంటెను నీకు దయాపాత్రులు గౌరవనీయులు మిత్రులు వీరిలో ననేకులు గలరు గావున వీరి ప్రార్థననైనను స్వీకరించి యయోధ్యాపురమునకు జనుదెంతువని యెంచి వీరిని గొనితెచ్చితి నదియును గాక వీరందరును నాదు ప్రార్థనకు

బూర్వమే భవదవలోకనాభిలాషులై తమయంతతామె బయలుదేరిరి. వీరందఱును నీవు పురికి చేరువఱకును నీవలెనె యాహార విహార వస్త్ర ధారణాదుల నిన్ననుకరించి యుండిరి. నియతవ్రతులైరి. నేను జటా వల్కలంబుల దాల్చుటకుఁ గారణము సర్వవిదితము. సర్వవిషయము లందునను నీకంటె నేను హీనస్థితిలో నుండఁదగినవాఁడను. నా శరీర మును నా ప్రాణంబులును నాసర్వస్వము నా తెలివియు నా వసనములు నేను చేయుపనులు నా గుణములు నీ కర్పించుటకె ధరించెదను. నీవు సర్వమునువీడి మునివేషమున వర్తించునపుడు నిను ననుకరించియైన చరించవలదా ! నీవు కిరీటధారణంబు జేసినయపుడు నేను నాపూర్వ వేషమును దాల్చి వన్యాహారాదుల విడిచెదను. భవదనుగ్రహ పాత్రుఁడనై యెన్నటికేని భవత్కైంకర్యము నొనర్చలేకపోదునా ! యని ప్రాణముల ధరించియుంటిని గావున నాయందును వీరియందును కృపాయత్తచిత్తుఁడవై యయోధ్యాపురమునకుఁ జనుదెమ్ము.

క. భూరి కళాన్వితచంద్రుని
చే రాకాక్షణద యట్లు స్థిర, నీచేతఁ
వారక నాధవతియునై
సారార్థచయంబు గలిగి చక్కఁగ వెలయున్. ౧౩౪

గీ. సకల సామంత సచివాది సంయుతముగ
శిరము తోఁడుత నర్థించు శిష్యు దాసు
తమ్ము మిత్రుని భక్తుని ధర్మపరుని
కరుణ గైకొని ధరణిని గావరమ్ము. ౧౩౫

క. విమలాత్ములు పూజితులు శు
భమతులు పితృసఖులు రాజభక్తులు విప్రుల్
సుమనోగురు సమధిషణులు
సమయజ్ఞులు వీరిమాట జక్కఁగ వినుమిా. ౧౩౬

క. అని పలికి భరతుఁ డప్పుడు
కనుదమ్ముల బాష్పజలము గారుచు నుండన్

ఘనభక్తి రామపదముల
వినయంబున శిరముఁజేర్చి వేఁడెను భక్తిన్. ౧౩౭

వ. అంత రామనృపాలుడు

సీ. మదగజమును బోలి మాటికి మాటికి శ్వాసల విడుచుచు జాలిదోప
పదముల శిరమును గదియించి లేవకపడియున్న దనతమ్ము భరతుఁగాంచి
తన బాహువులనెత్తి తనయంకముననుంచి కౌఁగిటఁజేర్చుచు గౌతుకమున
సత్కులీనుడ వీవు చరిత్రవతుండవు సత్వయుతుండవు సత్యరతుఁడ

గీ. నీవు రాజ్యంబు గాంక్షించి యిట్టి పాప
మాచరించితి వనునట్టి యతఁడు గలఁడె?
యగ్నియందైన భానుని యందునైన
మలిన మంటఁగ జాలునె మాటలేల? ౧౩౮

క. అని భరతుని గని రాముడు
జనయిత్రిని దూలనాడ జనునే నీకు
న్మనమున శంకను దక్కుము
వినుమీ నామాట విశ్వవిధి హితముసుమీ. ౧౩౯

వ. నీవు ప్రాజ్ఞుండవు సకలధర్మంబుల నెఱుఁగుదువు గురువులకు శిష్యులు జననీ జనకులకు పుత్రులు గృహస్థులకు భార్యలు స్వాచ్ఛంద కరణ యోగ్యులు. పుత్రులు దారలు శిష్యులు నియామ్యు లనఁబడు దురు. మనము దశరథునకు నియామ్యులము సౌమ్యుడవగు నీవుమాత్ర మీధర్మమెరుగనివాడవా? దశరథుడు నన్ను చీర కృష్ణాజినాంబరధరునిగా గాని రాజ్యాధికారిగాగాని నియమించ నియంత. తండ్రి పుత్రున కెంత గౌరవార్హుఁడో తల్లియు నట్టిదె యట్టి ధర్మశీలురగు జననీ జనకులచే నేను వనమున నివసింపను నీవు రాజ్యభారము వహింపను నియమింప బడితిమి. మన కివి పితృదత్తంబులగు దాయభాగములు. మన దాయముల మన మనుభవింపవలసినవారముగాని వాని నతిక్రమింప దగినవారము గాము. సర్వేశ్వరుఁడు, సర్వనియంత, సర్వస్వతంత్రుఁడగు జనకునియాజ్ఞ లనతిక్రమణీయములు గావున నీ వయోధ్య పట్టాభిషిక్తుఁడవై రాజ్యపాలన

మొనర్పుము. నేనరణ్యంబున పదునాలుగు వత్సరంబులు నివసించెద తండ్రి యాజ్ఞను నెఱవేర్చుటకంటె సర్వలోకేశ్వరత్వమును నాకు సమ్మతము కాదు. నీవును నావలెనె తండ్రియాజ్ఞను నెరవేర్పుమని పలికె నచటనున్న సర్వజనులు నన్నదమ్ముల వాక్యములవిని వింధ్యమా కిడినట్లు నిశ్శబ్దచేష్టితులై నేత్రంబుల కర్ణంబుల తద్వశమున నిడి యుండిరి. భరతుఁ డపుడు లేచి తత్పాదంబులకు వందనం బిడి సమీపమున నభిముఖముగ నుండి.

క. భరతుడు రాఘవ రాముని
వరముఖమున దృష్టి నిలిపి వాసిత భక్తిన్
పరిసరవర్తులు మెచ్చఁగ
కరయుగమును మోడ్చి పలికె కమ్మని పలుకుల్. ౧౪౦

క. ఆశ్వాసించితి తల్లిని
విశ్వాసముతోడ నిన్ను వేఁడుచునుంటి
న్విశ్వము నేలగ రమ్మా
విశ్వేశ్వర విశ్వవినుత విశ్వవిధిజ్ఞా. ౧౪౧

క. సాగర ముద్రిత వసుమతి
వేగమ పాలింప నీవ విహితుడ వనుచుం
బాగుగ మదిలో నెంచుచు
సాగిలిపడి వేడువాఁడ సరసపు భక్తిన్. ౧౪౨

క. కోసలదేశపు రాజ్యము
భాసురమై జ్యేష్ఠపుత్ర పరిపాలితమై
యీ సరికిఁ జెల్లుచున్నది
వాసవనిభ నీవు ద్రోయవచ్చునె నీసిన్. ౧౪౩

వ. మనువు మొదలుగ నేటివఱకు నవిభాజ్యమై జ్యేష్ఠపుత్రపరిపాలితమై యొప్పుచున్న మనరాజ్యమును బాలించు జ్యేష్ఠపుత్రునకుఁ బరిపాలనాధికారమెగాని యథేష్టముగ నన్యున కెవ్వనికేని యర్పించు నధికారము లేదు. అట్లిచ్చిన నది చెల్లనేరదు. తండ్రి యిచ్చిన నివ్వాఁడన్నను

జ్యేష్ఠపుత్రునినుండి యదియెట్లు తొలఁగిపోవును? కావున దండ్రికిచ్చుట కును నాకు గ్రహించుటకును హక్కు లేదు. ధర్మవిరుద్ధమగు పని ధర్మమెట్లగును? తండ్రి పరమపూజ్యుఁడై, మనమా మహారాజున కాజ్ఞా కింకరులము గాని మనమా యాజ్ఞ ధర్మబద్ధమై యుండవలెను. ధర్మాతిక్రమణమున కెవరికిని శక్యము లేదు. తండ్రి యిచ్చుట యధర్మము నేను గ్రహించుటగూడ యధర్మమే.

క. ఆతత జలరాశమునకున్
సేతువు గట్టంగఁగలరె చెనటులు రాజ్యం
బేతఱి సమర్థు లేలఁగ
నేర్తురు పాలింప నీవ నేర్తువుగావే. ౧౪౫

సీ. గరుడుని గమనంబు కాకికి గలుగునె నక్కసింగముబోలె నడువగలదె
యుచ్చైశ్రవమువలె నురుకునె ఖరమెందునటుల నధర్మాత్ము నార్యతిలకు
నిత్యసత్యవ్రతు నిరుపమతేజుని నినుబోల నేనెట్లు నేర్తుజెపుమ
బలువురఁ బోషించి బహుభంగి జీవించువాఁడె సుజీవుడు వసుధలోన

గీ. బరుల చేతను బోషింపఁ బడెడివాని
జీవనము సుజీవనమౌచుఁ జెలఁగ దెచట
భువనమంతయుఁ బోషింపఁ బూనఁగలుగు
నట్టి నీవేడ యడవికి నరుగుటేడ. ౧౪౬

గీ. ఎవనిచేతను పదుగురు హెచ్చుగాను
జీవనము జేతురో వాడు జెల్లు బ్రతుక;
బ్రతుక నేటికి దనపొట్ట బకముభంగి
నింపుకొనువాఁడు బరువగు నిలకు మిగుల. ౧౪౭

సీ. ఒకకాపు తగుచోట నోపిక సహకార బీజము మొలవేసి పెంచుచుండ
నుక్కిపెరిగి పెద్ద మ్రానైన చెట్టయ్యె పొట్టవానికి నెక్కబోలదయ్యె
కొమ్మలు వ్యాపించి నెగొప్పగ బెరిగెను మొదలు లావయ్యెను ముమ్మువుగాను
[illegible] బెరిగె

గీ. పువ్వులన్నియు రాలెను భూమిమీద
కాయ యొకటైన లేకుండె కాంక్ష లుడిగె
భూమి బాలింప కడవికి బోతివేని
పైనజెప్పిన సామ్యంబు బడసె దీవు. ౧౪౮

క. పురజనములు నీ సచివులు
ఖరకిరణుని గాంచినటుల గాంతురు నిన్నా
నరసింహాసన మందున
వరమతి వసియింపవయ్య వాసన విభవా. ౧౪౯

క. ముదమున నీతోనిప్పుడె
మదగజములు గూడివచ్చు మహితులు మెచ్చన్
ముదమున నంతఃపురగత
ముదితలు సంతోషవార్ధి మునుగుదు రధిపా. ౧౫౦

వ. నాతల్లియగు కైకయు దన కృత్యంబు నిందితమైనదని చింతించి మిగుల పశ్చాత్తప్త యైనయది యూపెను నేను బహువిధంబులమన్నించి తిని యూమెయు నేనునుగూడ వినయంబున రాజ్యపాలనమునకు నిన్ను బహువిధంబుల ప్రార్థించుచుంటిమి నీవు కరుణాపాత్రుండనగు నాయందు నను నీకును గౌరవార్హ యగు నాజననియందునను కరుణించి మాకోర్కెల నెరవేర్పుము నీవు సర్వజ్ఞుండవు పరేంగితజ్ఞుడవు నీకు నావంటివాడు విస్తరించి పలుకవలెనే యనిన విని

గీ. కనుల గన్నీరు కాలువ గట్టుచుండ
కరుణ బుట్టంగ బలికెడి క్రమవచను
తగిన మాటల నోదార్చి తమ్మునకుజ్ఞ!
వినుము జెప్పెద గార్యంబు విశదముగను. ౧౫౧

గీ. తత్త్వదృష్టిని వినవయ్య తథ్య మిదియ
తండ్రి కైకయు ధర్మంబు దప్పిరనకు
దైవ మిట్టుల దలచుట దనరె నిటుల
దైవ మొక్కటె హేతువు ధరణిజులకు. ౧౫౨

సీ. అస్వాతంత్ర్యుఁడు పురుషుఁడై యలరుచుంట
కామకారుఁడు పురుషుఁడు కాఁడుసుమ్ము
యిటకు నెటకైన పురుషుని హీనబలుని
పటిమ దైవంబె త్రిప్పును భవ్యతముఁడ. ౧౫౩

సీ. చెడును రాజ్యంబు సేనలు సిరులు మిగుల
పతనమొందు సముచ్ఛ్రాయ పటలి మిగుల
విరహమొందును సంయోగవితతి యెల్ల
జీవితం బెప్డు మృతిఁ గోడ జెల్లిపోవు. ౧౫౪

సీ. పక్వఫలములు పతనంబు బడయునట్లు
చావు తప్పదు పుట్టిన జంతువులకు
గట్టిగా కట్టబడినట్టి క్రమగృహము
శిథిలమైనట్లు దేహంబు శిథిల మగును. ౧౫౫

క. స్థిరమగు బుద్ధిని గొందుము
దురితంబగు శోక మిప్పుడె దూరము బోనీ
వరజనకుని పీఠంబున
కరమరుదుగ నిలచి జనుల గావుము తండ్రీ. ౧౫౬

క. జనకుని వరశాసనమును
మనమున నేనుంచి యడవి మహితాసక్తిన్
మునివర సేవాచరణా
భినివేశిత సమయవిహిత విధి నేనుందున్. ౧౫౭

క. జనకాజ్ఞను నే విడువక
జని యడవిని నిట్టు నేను జక్కని నియతిం
జనికాజ్ఞను నీ విప్పుడు
జని పురమున నిలచియుండు సర్వేశుడవై. ౧౫౮

క. అనవిని భరతుడు రాముని
గనుగొని వినయప్రయుక్త గౌరవ బుద్ధిన్

మన మలర గలుగు మాటల
వినిపించెను మరల నిటుల విస్తృత ఫణితిన్. ౧౭౧

క. వశగత సర్వేంద్రియుడవు
వశమగుదే శోక హర్ష వైరంబులకున్
మశకీకృత రిపుచక్రుని
వశమే వర్ణింప నసమ వైభవు నిన్నున్. ౧౭౨

సీ. మృతుడైన మనుజుని మృతితోడ వైరంబుబోవునుమనమునబుధవరేణ్య
యపకార మొనరించు యరులనైననునేను ప్రేమించుచుండెదపేర్మితోడ
లేని వస్తువునందు లేకుండు కోరికగలుగువస్తునందె గనను కాంక్ష
తత్వజ్ఞుడగు నీదు దరిరాదు దుఃఖంబు శక్రుని బోలుదు సర్వగతుల

గీ. సత్య సంగరుడవు సర్వ సంహనుడవు
సర్వ సముడవు శమదమ సంయుతుడవు
సర్వదర్శివి సర్వజ్ఞ సమ్మతుడవు
సత్వమూర్తివి సర్వార్థ సాధకుడవు. ౧౭౩

వ. అట్టి కరుణాసాగరుడవగు నీవు దయామయదృష్టిని ధర్మ దృష్టిని నన్నవలోకింపుము. నా విన్నపము నాలించుము.

గీ. క్షుద్ర నాతల్లి సుతునకై చోరవజేసి
క్షుద్రకృత్యంబు జేసెను చోద్యముగను
ప్రోషితుడనౌట నెఱుగను బుధవరేణ్య
తప్పు నాయందు లేదని తలపవయ్య. ౧౭౪

వ. అదియునుగాక నా తల్లి కైక మంథరాకులితస్వాంతయై దూర మాలోచించక యాడుదిగావున చాపల్యంబున నీయందుగల ప్రేమను హఠాత్తుగ విడనాడి వనితాహిత సాహసకృత్య మొనర్చినది. పిమ్మట సహజ వివేకము గలదౌట తత్వధర్మంబుల దెలసి మిగుల పశ్చాత్తప్తురాలై విచారసాగరమున మునిగి నిన్ను మన్మఖంబున మిగుల ప్రార్థించుచున్నది. సిగ్గున నిన్ను గనలేక మాటాడలేక యున్నది, నీవు మాతృగౌరవమున న్నాజననియగు కైకను మన్నించుము. ఆమె చేసిన యపరాధమును

ఆమె తెలిసి తప్పని యొప్పుకొనుచున్నది. తప్పని యొప్పుకొనినవానిని నీవంటివారు మన్నించెదరు. ఆనాడు నాకు తీవ్రకోపము కలిగినదిగాని,

సీ. తల్లిని జంపుట ధర్మంబుగాదని చంపక విడిచితి జగదధీశ !
త్రికరణశుద్ధిగ దెలిపెద నభిషేక విషయ మేమియు నేను వినియెఱుంగ
నిజసుఖకాముడనై నీతిజ్ఞ కాకుంట నిరయ భయము వీడి నెరపె నిటుల
దశరథ పుత్రుండు ధర్మంబు విడనాడి దనవంశ మర్యాద దప్పగలడె

ఆ. జనని మాయను జడుడైన జనకు నేను
గురుడు యజ్వయు వృద్ధుడు కోవిదుండు
తండ్రి ప్రేతయు నృపతియు దైవమనుచు
దలచి సభలోన నిందింప దలచబోను. ॥౭౫॥

వ. కాని తండ్రి యొనర్చిన కృత్యంబు ధర్మవిరుద్ధంబు, వయసు చెల్లి మహాదుఃఖాంభోనిధి మునిగి సత్యహానికి చకితుడై భవద్వియోగ మును సహించనేఱక మనుజసహజమగు మృతినొందిన తండ్రికై యంతగ చింతించను. మన తండ్రియు మనోవ్యధచేత బరిశీలించలేక సత్యచ్యుతికి మాత్రమె ఝడిసినవాడు. అయినను నిన్ను అడవికి పొమ్మని తానుగ నీకు చెప్పియుండ లేకపోయినవాడు. అదియె యామహాత్మునియందుగల మహాసద్గుణము. వసిష్ఠాదులైన యద్ధుకొని నీవనవాస గమనమును నిరోధించలేకపోయిరి. నీవును జనకుని కంఠోక్తివినని దె యుపేక్షయె యాజ్ఞ యని భావించి రాజ్యమును విడిచి వనమున కేతెంచి యిట్లు క్లేశముల బడుచుంటివి. ఇందుకు నేను మిగుల చింతించుచుంటిని. నేను చింతించి చింతించియె నిన్ను ప్రార్థించ నేతెంచితిని. నీ యాజ్ఞను తిరస్కరించు చున్నాడనని యనుకొనకుము. నీవు రాజ్యమును విడుచుటయు వనమున కేతెంచుటయు ధర్మవిరుద్ధమనియు నాకు జననీప్రదత్తమగు రాజ్యపాలన మనర్హమనియు దృఢముగ నమ్మి నీతోడ నింతగ నెదురాడుచుంటిని నీవెన్ని విధముల జెప్పినను నా మనోభినివేశము మారుటలేదు.

సీ. నీయాజ్ఞయే నాకు నిగమైక వాక్యంబు నీపదసేవయే నిత్యపదవి
నీనామకీర్తన నిజగురుమంత్రంబు నినుగాంచు నిముసంబు నిత్యసుఖము

నీసేమమే నాకు నిరుపమానందంబు నీకథాకథనమె నియతవృత్తి
నీసహవాసము నిజకాంక్షిత మెపుడు నీరాజ్యసంస్థితి నిత్యవాంఛ

గీ. నిఖల కామిత కల్పక నిర్జరాభ !
సకల మునివర సన్నుత సత్యవాక్య !
జనకతనయాధినాయక ! చారురూప !
పరమ పావన ! కరుణాలవాల ! రామ ! ౧౭౬

గీ. నిఖల జగదేకవీర మునీంద్రవంద్య !
నిజగురుండవు దాతవు నిఖలగతివి
నీవె దేవుడ వాశ్రిత నిత్యసుఖద!
నీవె నా కేడుగడయంచు నియతి గొలుతు. ౧౭౭

అన్నా ! రామచంద్ర! కరుణాసముద్ర ! నీవునాకు 'జ్యేష్ఠభ్రాతా పితృసమః' అనుటవలన పితృసముడవు. శ్రేష్ఠమంత్రోపదేష్టవగుట గురుడవు గావున,

సీ. యేపాపమెరుగని యీదీను పాలించి పాలించుమీభూమి పార్థివేంద్ర !
గురువులు తల్లులు కూడిరి యాచించ పంతంబువీడుము పద్మనయన !
జ్యేష్ఠుడు రాజ్యంబు జేపట్టియుండుట మనువంశమర్యాదమనుసమాన !
యరుణ పల్లవములనదలించుపదముల నడవిని దిఱుగు టెయమరసేవ్య !

గీ. నిఖల జగదభిసంస్తుత ! నిరుపమాన !
శ్రితజనానందసంధాన ! శ్రీనిధాన !
భవదధీనుని నన్నేలు భవ్యనామ !
ఛాయబోలుచు వర్తింతు జగమునందు. ౧౭౮

సీ. భూమిని బాలింప బూనకయుందువా యడవికి నీతోడ ననుగమింతు
గురుడు జెప్పినమాటగూడను వినకున్న నడవికి నీతోడ ననుగమింతు
కౌసల్యకోర్కెను కడతేర్చకుందువా యడవికి నీతోడ ననుగమింతు
ప్రజలకోర్కెల దీర్ప పాటింపకుందువా యడవికి నీతోడ ననుగమింతు

గీ. నవని బాలింప దలచిన నడవినున్న
నధికభక్తి నీసేవ కాశ్రయించి

దిఱుగుచుండెద నీతోడ తీర్థపాద !
రామ రఘురామ శ్రీరామ రామరామ! ౧౮౯

శా. ఆహాహా యిదియేమి రామవిభుడే యాచారధర్మంబుల
న్నోమహీభూత నృపాజ్ఞ పీడదగునా మోదంబె లోకాళికి
న్నోహో మాతులగేహ సౌఖ్యవిభవం బుద్విగ్నమై బండెనా
యూహాపోహాలు లేక దల్లి నను సంహారాశిలో ద్రోసెనా. ౧౯౦

సీ. ఉపభోగ్యవస్తు సదుపయోగమెట్టులో నటులనేనుపయోగమగుదునీకు
నటువంటినేనేడ నవనిపాలనమేడ మతిలేనిజనకుని మాటయేడ
నఖిలలోకులః నిన్నునామోదమునగోర నడవికిబోవుట యర్హమగునె
దుర్ధ్యానసంభవ దురితంబుబోవును తత్పరిత్యాగైకధర్మ కలన
గీ. తల్లి దెలియక గైకొన్నదాన మామె
తెలిసి పరితాపపడి వీడె తెల్లముగను
దాని నేనెట్లు గైకొన దగుదు చెపుమ
ధరను పాలించి తమ్ముని ధన్యుజేయు. ౧౯౧

సీ. బాల్యము మొదలుగ భక్తిని నీసేవజేయుట క్రొత్తగ జెప్పవలెనె
పరమాత్ముడని నిన్ను భావించుదమ్ముని పరమాత్ముడవు నీవు పరిహరింతె
పదములచెంతను భరతుడు లేకున్న భుజియించనొల్లని భూరికరుణ
పదునాలుగేడులు భరతునివిడనాడి యుండనీమనసెట్టుల నొప్పుకొనియె
గీ. తల్లితప్పును నాతప్పు తండ్రితప్పు
దలపక దయాంబురాశివై దరినిజేర్పు
తమ్ముకుర్రని తప్పుల దలపవలెనె?
ధర్మ మెఱుగవె? నీతిజ్ఞ ! ధర్మశీల ! ౧౯౨

వ. అని వినయంబున విన్నవించు దనతమ్ముని పలుకులు విని దయార్ద్ర హృదయుడగుచు భరతు నవలోకించి తమ్ముడా మఱియొక ధర్మవిశేషంబుగలదు. అది నిన్ను పాలనధర్మంబున బంధించగలదు. దానిని వినుము. మన జనకుండు భవజ్జననిని పరిణయ మాడునప్పుడు

కేకయ మహీపాలునకు గైకగర్భంబున బుట్టినవానికి రాజ్య మిచ్చెదనని పలికి కైకం బరిణయం బయ్యెనట. పదపడి శంబరసంగరమున మనతండ్రి వరద్వయమునుగూడ నొసగె. కైకచే వనవాస పట్టాభిషేకంబులు కృతంబులయ్యె గావున మన మిరువురము ధర్మబద్ధుండగు జనకాజ్ఞకు బద్ధులమైతిమి. మన మెట్లు దాని నతిక్రమించగలము? సమర్థుడవగు నీవు తండ్రిని సత్యవాక్యునిగ నొనర్ప గడగుము. పినతమ్ముడును నీవును పురంబున నిలిచి రాజ్యమును బాలింపుడు. సౌమిత్రియు నేనును దండక నిలచి మృగములను మునులను బాలించెదము. ప్రజలకుగలుగు క్షతముల బాపుటయెగదా క్షత్రియధర్మము! నీవు ధర్మయుక్తముగ బ్రజల బాలించి సౌఖ్యముల నందుము. మేము చల్లనితరుచ్ఛాయల స్వచ్ఛోదకంబులు గల మహానదుల కనుల కానందమును గూర్చు మృగపక్షికదంబముల ధర్మోప దేశకులగు మునుల ప్రఫుల్లపద్మషండ మండితంబులగు పద్మాకరంబుల గాంచి హాయిగ ప్రకృతిశోభల కానందించుచుందుము. మన మిరువుర మును ధర్మమార్గచ్యుతులము గాకుండుదము. నీవు నామాటలవిని తండ్రి యాజ్ఞానువర్తివై యయోధ్య కేగుము అని పలికెను.

—♦ జాబాలి సంభాషణము ♦—

గీ. రామవాక్యము లాలించి రాము జూచి
పలికె జాబాలి చార్వాక ఫణితి బూని
రామ ! సామాన్యులను బోలి రక్తిలేని
మాట లాడుట మానుము మహితధిషణ ! ౧౯౩

వ. మనువు కకుత్స్థుడు మాంధాత రఘువు మొదలగు చక్రవర్తుల వంశమున బుట్టిన నీవు రాజ్యపాలనంబు వీడి మిథ్యాధర్మంబుల బురస్క-రించుకొని యడవికి జని దీన మునుల ననుకరించి కందమూలాదుల మెక్కెదనని పలుకుచుంటివి. అది నీకు తగదు. పరిశీలనాకృత్యమును గాదు. వినుము. శరీరమునకు ఫలము సుఖము. సుఖము లేకుండిన శరీర మున కేమిఫలము ? విత్తువలన వృక్ష మెటుల బొడముచున్నదియో జంగ మములగు ప్రాణికోటులన్నియు బీజాంకురన్యాయమున స్త్రీ పురుష

సంయోగ విశేషమున బొడముచున్నవి. ఇది స్వభావము. దీనికి తుద మొదలు లేదు. ప్రపంచమంతయు!నిట్టిదే. దీనిని సృజించుకర్త యెవ్వడును లేడు. కర్తయె యుండిన మనకాత డగుపించును. అదృశ్యు డున్నాడనుట కంటె లేడనుటయె యుక్తము గాన దైవముగలడనుట యసంగతము. దైవమున్నచో మనకేల యగుపడడు? మన కనుల కగుపించనిది యేదియేని మనకు లాభనష్టముల నొసగునది యెటనైన గలదా! కనులకు గాని చెవులకుగాని శరీరమునకుగాని తెలియుచున్నదియె మనకు సుఖ దుఃఖముల నొసగుచున్నది. వస్తుసమ్మేళనమున ననేక విచిత్రకార్యము లుత్పన్నము లగుచున్నవి. వస్తువులు స్వభావసిద్ధములు. వస్తుసమ్మేళనా భావదశలో యేవిశేషమును గలుగుటలేదు గావుననే.

గీ. పుట్టునొక్కఁడె చచ్చును పురుషుఁడొకడె
చుట్టమెవ్వఁడు పరమని చూపు నెవడు
గాన తల్లిని దండ్రిని గాంచి నరుడు
మోహమందుట జూడగ మోఘ మగును. ౧౮౪

గీ. చుట్ట మెవ్వఁడు దేహికి సొంపుగాను
దేహసౌఖ్యంబె ఫలమగు దేహమునకు
గనుక తల్లిని దండ్రిని గాంచి నరుడు
మోహపడు టెల్ల మూఢ్యమై మొనయుసుమ్ము. ౧౮౫

క. ఉపకార చింతచేతనె
యుపకార మొనర్చు టెల్ల నుచితమె యైనన్
యుపకృతి దేహికి దగినటు
లపహృత దేహునకు జేయ ననువగు టెటులో? ౧౮౬

గీ. తల్లిదండ్రులు సుఖకాంక్ష తారసిలుచు
భోగ మొనరింప బుట్టిరి పుత్రులిటుల
సకలజంతుల సంయోగ సరణిగాదె
జగము వృద్ధిని జెందెను జగదధీశ! ౧౮౭

గీ. దేహి దేహంబు విడనాడి తెల్లముగను
పంచభూతంబులందున బఱగ జేరు
మేనులెల్లను మేదిని మిళిత మగును
సర్వశూన్యంబు పిమ్మట సాధువర్య ! ౧౭౮

గీ. విత్తు మొలవేయ వృక్షమా విధముగాను
శుక్ల శోణిత యోగోత్థ సూక్ష్మవిధుల
దేహియును దేహమును బొందు ధీరవర్య !
తుదకు జేరును భూమిని తుల్యగతిని. ౧౭౯

వ. స్థూల సూక్ష్మ రూపంబులగు పంచమహాభూతములు జంగమ స్థావరాత్మకంబులగు సకల జగత్తునకు ననాదినుండియు సహజంబుగ నాదికారణమై విరాజిల్లుచున్నయవి. సంయోగ వియోగ శక్తి విశేషంబులవృద్ధిక్షయంబుల నొందుచున్నవి గాని యింతకంటె వేరుగ నేదియును లేదు. బీజభేదంబున వృక్షలతాది భేదంబులు గలుగునటుల శుక్ల శోణిత రూప బీజభేదంబున మృగ పక్షి మనుష్యాదిభేదంబులు గలుగుచున్నవి. సంయోగశక్తి విశేషంబున ననేకవిధ శక్తి భేదంబులును జ్ఞానవిజ్ఞానాది భేదంబులును బొడమచున్నవి గావున మీవంటి ప్రాజ్ఞులు యీదేహము దృఢమ్ముగ నున్నంతవరకును సుఖరూపఫలమును సంపూర్ణముగ ననుభవించవలెను. దేహవైకల్యమేర్పడిన సుఖమనునది లేశంబునుగలుగనేరదు.

గీ. పాంథుడొకయూరు విడనాడి పథ్యగడచి
మధ్య నొకయూరు జేరును మార్గమునను
యిట్లు దల్లిని దండ్రిని నింతి గృహము
నవ్యముల దేహిబడయును నరవరేణ్య! ౧౮౦

గీ. ఇట్టి తల్లియు దండ్రియు నెందరైరి
దేహ మన్యంబు దాల్చిన దేహికరయ
వారినందర బూజింప వశమ చెపుమ
గాన నాత్రోవ బడబోడు గడుసువాడు. ౧౮౧

క. ఆవాస మాత్రబంధుల
నేవాస్తవ వస్తువేది యేమనిగొలుచున్,
యోవాసవాభ ! తత్త్వము
ధీవాసన నెఱుగుమయ్య దివ్య విచారా ! ౧౯౩

గీ. మనుజులకు, పశువులకును, మహితమైన
జన్మకారణ మొకటియై జగతి బఱగ
తండ్రియందున పూజ్యత తనయులకును
గలుగవలెనంట ధర్మమే కరుణ దెలుపు. ౧౯౪

గీ. దేవు డొకడున్న జంతుల దిద్దరాడె ?
తల్లిదండ్రుల పూజ్యత దైవవిహిత
మైన పశువుల దిద్దడే తగినవిధిని ?
నంతకంటెను మనుజుల కధిక మేమి ? ౧౯౫

గీ. తమకు లాభంబు గోరుచు దండిమగలు
ధర్మమని చెప్పి వంచించి ధరణిజులను
కపట నటనల జేసిరి గడుసువారు
బుద్ధిమంతులు నాదారి బోవ రెపుడు. ౧౯౬

గీ. చదువు జక్కగ జదివిన చతురమతులు
శాస్త్రములను వేదములనెల్ల సంఘటించి
చిక్కగా గూర్చి వంచన జేసినారు
శాస్త్రవిధి దాటజనదని చాటినారు. ౧౯౭

గీ. శాస్త్రవిధులను దాటిన జనులకెల్ల
నరక బాధలు గలవట, నమ్మదగునె ?
నరక మెక్కడగలదయ్య నరవరేణ్య !
దాని గనుగొన్నవారలు ధరణిగలరె? ౧౯౮

గీ. పుణ్యపాపంబు లనుచును బూటకంపు
పద్యముల వ్రాసి మోసంబు పటిమజేసి.

జగము వంచించగలిగిరి జాణలగుట
పుణ్యమును లేదు పాపంబు బొసగఁబోదు. ౧౯౯

గీ. ధనము నార్జించుటొక్కటే తగినదారి
ధనముగలిగిన సుఖమెల్ల దానగలుగు
సుఖము బోలినదానిని చూడమెచట
సుఖము గాంక్షించువారలె నూరిజనులు. ౨౦౦

గీ. పితృరాజ్యంబు విడనాడు పిచ్చి నీకు
బుట్టి వనమున కేగంగ బూనినావు
సుఖము విడనాడి కష్టించు చొరవ నీకు
గలుగ నేటికి చెప్పుమయ్యా కంజనేత్ర! ౨౦౧

గీ. కంటకావృత మైనట్టి కాననమున
కష్టమొందగ నేటికి గడగవలసె?
పరమ సుఖముల నెల్లను పాడుచేసి
కాయలాకులు దిననేల గాంక్షగలిగె? ౨౦౨

గీ. రాజభోగంబు లెల్లను రాజితముగ
రాజవదనలతో గూడి రాజధాని
యందు నివసించి పొందుము హాయి నెపుడు
సుఖము వీడిన లాభంబు జూపగలవె? ౨౦౩

సీ. దశరథు డనునట్టి ధరణీశు డొక్కడు రామచంద్రుండను రాజొకండు
యీనృపులిద్దర కీలోకమందున బంధుత్వమేమియొ బలుకవలయు
నత్యల్పకారణ మరయగ జనకుడు మహిత హేతువుతల్లి మనుజులకును
శుక్లశోణితములు శుభజన్మ హేతువులనుచును దెలియగనగునుసుమ్ము

గీ. చనిరొ గంతవ్యపదవికి జగదధీశు
డదియె జంతులకెల్ల ననాదిగతియ
మిధ్య పితృపుత్రసంబంధ మిళితపీడ
బొందనీకేల జెప్పుము బుధవరేణ్య! ౨౦౪

గీ. ధర్మమోక్షపరులను దలచి యధిక
శోకమును బొందుచుండెద సూర్యకులుడ
పరము లేదని నమ్ముము పఱగు నిహమె
సుఖము కేవల మర్థింప శుభము గలుగు. ౨౦౫

గీ. కాన సుఖమును గోరుము కమలనయన!
యిహమునందున సౌఖ్యంబె యింపుగూర్చు
సుఖము లేనట్టి దేహంబు సుష్టుగాదు
సౌఖ్య మొక్కటె దేహికి చాలు జాలు. ౨౦౬

గీ. తండ్రిమాటకు ధరణిని తగదు విడువ
సుఖము వీడుచు కష్టింప సొంపు లేదు
సుఖమె జన్మకు ఫలమాట సూక్ష్మధిషణ!
సుఖమె కాంక్షింపవలయును సుష్టుగాను. ౨౦౭

క. వేదము శాస్త్రము నమ్మకు
పేదలు గల్పించినారు పేరిమి వాని
న్వేదము దేవుని సొత్తట
కాదనకను నమ్మ వెఱ్ఱిగలడే జగతిన్. ౨౦౮

క. దేవుని యునికియె లేదన
దైవికమా వేదమెటుల దలచగ వశమా
దైవము వేదము ధర్మము
ధీవినుతులు నాస్తి యనుచు దెలియుదు రధిపా. ౨౦౯

గీ. పురుష వనితల భేదంబె పుడమి గనుము
శుక్ల శోణిత సంయోగ సూక్ష్మ శక్తి
జన్మ కారణ మగుటను జాతిభేద
మెట్లు గలిగెను జెప్పుము హేతువున్న. ౨౧౦

గీ. దానధర్మంబులకు నెల్ల ధనము బంచి
పెట్టు వానికి సుఖమెట్లు పేర్మిగలుగు ?

చేత ధనమేమి లేకున్న చెనటి కెవడు
ధనమునిచ్చునో బల్కుము ధైర్యగరిమ. ౨౧౧

గీ. శ్రద్ధతో కర్మనొనరింత్రు శ్రాద్ధమునను
పితరు లిద్దాని దినువారె పేర్మితోడ?
నన్నమెంతయొ నాశంబు నందగలదు
దాన లాభంబులేదని తలపవలయు. ౨౧౨

గీ. అన్న మొక్కడు దిన నది యన్యు జేరు
నన్నమాటయె నిజమైన యరసి శ్రాద్ధ
మమరజేయుడు పాంథుల కందువలన
వారు తృప్తిని బొందుచు వరలగలరు. ౨౧౩

గీ. దాన సంవసనంబులు దగినయటుల
పరధనంబుల లాగగ పటుధిషణులు
గ్రంథములయందు జెప్పిరి గడుసువారు
దానధర్మంబులను జేయదనరినారు. ౨౧౪

సీ. పరలోక మనునది పరదైవమనునది పరజన్మమనునది పరగలేదు
తెలివిగలుగువారు తెలిపిన వినినమ్మి తెలివితేటలులేక దిఱుగవలెనె
ప్రత్యక్షసుఖమునుబరిహరించుచునీవు పరలోకసుఖకాంక్షబడయుటెల్ల
కడవలజలమును కడకుబారగబోసి ఘనజలకాంక్షను గనినయటుల

గీ. ధర్మమనుచును తపమని దానమనుచు
వెఱ్ఱిమాటల నమ్మెడి వెఱ్ఱియేల?
సకలసుఖదము రాజ్యంబు జక్కగాను
విడువబోకుము సుఖపడ వేగరమ్ము. ౨౧౫

గీ. జాతిభేదంబు గలిగించి జడులు మిగుల
జనుల మిక్కిలి వంచించ జాలినారు
విప్రజాతికి ధనముల విస్తరించి
కలుగజేయగ నివియన్ని కల్పితములు. ౨౧౬

గీ. కనుల కగుపడునది యొండె గలదుగాని
కనుల కగుపడకున్నది గలుగ దెచట
మనమునందున సంశయ మలినములను
విడిచి వేగమ నడువుము విపులనేల. ౨౧౮

గీ. సర్వవిబుధులు నమ్మిన సత్యపదవి
బలికినాడను నామాట భక్తివినుము
పరములేదని మనమున పటిమదెలిసి
భవనమునకేగి రాజ్యంబు ప్రభుతనేలు. ౨౧౯

వ. మఱియు మనవారు విమర్శించక ప్రతిదానిని విశ్వసించెదరు. పరిశీలించకున్న సత్యమెట్టుల బయల్పడును ? పరిశీలించిన దమగుట్టు బయటపడునని తలచి, మేము చెప్పినదానినే వినుము, కుశ్శంకల వేయకుము, ''సంశయాత్మా వినశ్యతి'' యన్నాడు. నీవు సంశయించితివేని నీ యాత్మ నశించును అని పెద్దలమనువారు బోధింతురు. పెద్దలని నమ్మిన మనవెఱ్ఱివారు వారేది చెప్పిన, దానినే నమ్మెదరు. వేదవాక్య మెట్టిదో పెద్దలవాక్య మట్టిదట. వేదవాక్యమునకె విశ్వసింపవలసిన కారణము లేనపుడు పెద్దలమను వంచకుల వాక్యములకు గతియెక్కడిది ? వినుము, కొన్ని నిత్యపదార్థములు గలవట, వాటి కెప్పటికిని నాశనము లేదట, వాటికి జన్మకూడ నెపుడును లేదనియు, యనాదినుండి యటులనె యున్న వనియు బలికెదరు. సకల పదార్థములును కొంతకాలమునకు నశించిపోవు స్వభావము గలిగియుండగ, కొన్నిటికి మాత్రము నాశన మెటుల లేకుండును ? సకలపదార్థములు, పునఃపునరుదయమానము లగుచుండఁ గొన్నిటికి పుట్టుక లేదనుటెట్లుపొసగును ? నిత్యపదార్థములలో మొదటిది యీశ్వరపదార్థమట. ఈశ్వరుడు జగత్కర్తయట. అతడు పరలోకమున నుండునట. సర్వాంతర్యామియట: సర్వనియంతయట. సర్వేశ్వరుడట. భక్తి నతని నమ్మి కొలచిన పరలోకశ్రేయ మబ్బునట. అతని దయ నార్జించుటకె విప్రులకు దానధర్మముల నాచరించవలెనట. విప్రుల సేవ ఋను స్పృశించతగదట. కొందరు వారికి బహుదూరమున నుండవలెనట.

మానవ శరీరములు తుల్యములుగావా? ఇది యెంతటి విశ్వసనీయము? అట్టి దేవుని గనుగొనినవా రెవరు? పరలోక మెవరికిని యనుభవ సిద్ధము కాలేదు. స్వర్గాదులు భూమిలో నవాంతరప్రదేశములేగాని యన్యములు గానేరవు. స్వర్గాది లోకము లాకసమున నల్లలనాడుట లేదు. మేరుగిరి ప్రాంతమె స్వర్గమని బుద్ధిమంతు లనుచున్నారు. కొన్నిలోకము లిటులనె భూమికి అనుబంధములుగ నుండవచ్చును. భగవంతుడు ప్రత్యక్ష ప్రమాణ బోధితుడుగాడట. శబ్దప్రమాణబోధితుడట, శబ్దమన వేదమట, వేదమీశ్వ రునివలె నిత్యమట, వేదమున దేవుడున్నాడని యుండుటవలన దేవుడున్నా డని నమ్మవలెనట. ఇది కేవల మసంబద్ధము. పరలోకమును పరుడు కలవనుమాట యసత్యము. వేదము కవికల్పితము. అక్షరరాశి యొక రుచ్చరించకుండ నెట్లుకలుగును? ఒకరుచ్చరించినది నిత్యమనుట యెట్లు? బలవత్ప్రమాణ మెట్లగును? దీనిని విప్రజాతులెగాని యన్యు లుచ్చరించ తగరట. అన్యు లేల పఠించతగరు? ఇవి యన్నియు నసమంజసములె. ఇట్టి యీ యాడంబరము లన్నియు నమాయకుల వంచించుటకుగాను మాయావిదుల కల్పితములు. వారి మాటలేనిచో యడుగుడీసి యడుగు బెట్టుటకు గూడ ప్రజ లస్వతంత్రులైరి. నీవంటి మహాబుద్ధిమంతుడుగూడ రాజ్యమును పరిత్యజించి సుఖమును వీడి విపినంబునకు జని దుంపల తూడుల దినుచుండవలసినవాడ వైతివి. సర్వశక్తి సంపన్నుడవగు నీవు పరిశీలన జేయుము. మాయావిదుల మాయావాగురుల బడకుము. ఇకనైన నరణ్యాగమనమును విడనాడి యయోధ్య కేతెంచి పట్టాభి షిక్తుడవై భూమిని బాలింపుము అని విన్నవించెను.

—♦ జాబాలికి రాముని సమాధానము ♦—

క. రాముడు జాబాలిని గని
మామక హితకామివలెనె మలినోక్తులచే
నామది కనుకూలించని
నీ మతమును దెలిపినావు నీకిది తగునే. —౨౦

సీ. వినరాని మాటల వినిపించినాడవు చేయగరానివి చేయమనెదు
పథ్యంబుగానిది పథ్యమటందువు మర్యాదవిడనాడి మలినవృత్తి
పాపులయాచార పటలినిసేవించి భిన్నచరిత్రను భీతిలేక
పెద్దలసన్నిధి పేర్మినిబలికితి మానమక్కరలేదె మంచిలేదె

గీ. పలుక దగనట్టి మాటల బలికి మిగుల
విహితవిధులను నిందించి వివిధగతుల
దురితమార్గంబు బోధించి దూరిబుధుల
రాజసన్నిధి బలుకగ రాదు నీకు. ౨౨౧

వ. విప్రుండవనియు పితృసఖుండవనియు వృద్ధుండవనియు నిన్ను మన్నించుట నింత ప్రసంగ మిట్లు చేయగలిగితిని.

గీ. నీవు దెలిపిన యీరీతి నీచమగుట
నిటుల చరియించి యితరుల నిట్లుద్రిప్ప
గలుగువారున్న లోకంబు గడియలోన
చెడుట కేమైన కొరతను చెప్పగలవె? ౨౨౩

క. ఈగతి హీనుడనై చెడి
యేగతి నాజనులనెల్ల యేలంగలనో
యేగతి నాకము నొందుదు
నేగతి నావ్రతిన విడిచి హీనుడ నగుదుఁ. ౨౨౪

క. యద్వృత్తి రాజులుండిన
తద్వృత్తిని ప్రజలు నడిచి తాదృశు లౌటఁ
సద్వృత్తి రాజులుందురు
సద్వృత్తిని ప్రజల నడుపజాలుట కొరకై. ౨౨౫

క. సత్యమగు నానృశంస్యము
సత్యంబే లోకములకు సత్పాత్రయగుఁ
సత్యమున సర్వముండును
సత్యంబె పూర్వరాజ సద్వ్రతమగుఁ. ౨౨౬

క. సత్యంబగు మునివర్గము
సత్యంబగు దేవగణము సత్యాశ్రయమై
సత్యంబగు పరధామము
సత్యంబుగ నుండువాడె సాధుల హితుడౌ. ౨౨౬

గీ. అనృత వాదిని గనుగొని యఖిల జనులు
మిగులభీతిని బొందుచు మిణుకుచుంద్రు
గాన సత్యంబు ధర్మంబు గడపజనదు
సత్య మొక్కటె సర్వార్థసాధకంబు. ౨౨౭

క. సత్యమె యీశ్వరు డగుసుమి
సత్యంబే సిరులనెల్ల సమకూర్చెడి దా
సత్యమగు సర్వమూలము
సత్యమె పరమార్థదంబు సాధులకెల్లన్. ౨౨౮

దత్తమిష్టము హుతమును తప్తతపము
వేదకందము వేదాంత వేద్య వస్తు
వెల్ల సత్యముగా నెంచి వేడ్క నీవు
సత్యపరుడవు గావలె సాధుచర్య! ౨౨౯

గీ. ఒకడె లోకము బాలించు నొకడె కులము
నేలు నొక్కడె నాకంబు నేలగలడు
ఒకడె కీర్తికి నిలయుడు నొకడె పరము
నొందగలవాడు ధన్యుడౌ నొకడెసుమ్ము. ౨౩౦

గీ. తండ్రి యాజ్ఞానువర్తినై తప్పకుండ
సంచరించగ శపథంటు సలిపినాడ
సమయవర్షంబు లెల్లను సత్యముగను
వనమునందున బుచ్చెద వైభవముగ. ౨౩౧

గీ. సత్యహీనుని చలచిత్తు సత్వరహితు
హావ్యకవ్యాదికంబుల నర్హములని

పితరు లెల్లరుగాంచరు పేర్మిననుచు
విన్నవాడను పెద్దల విహితఫణితి. ౧౩౨

గీ. వినగ జెప్పగ దగనట్టి వింతపలుకు
లెన్నొ బలికితి పరభీతి యేలలేదు?
ధర్మరక్షణ జేయంగ దగరటంచు
దలచినాడవె దశరథ తనయులెల్ల. ౧౩౩

గీ. అజముఖాదులు వినుతింప నలరుచున్న
నిగమముని విప్రముఖ్యులు నీకు నేడు
పూజ్యపదమున నిలువగ బోలలేదు
కశ్యపాదులు నీకైరి కపటమతులు. ౧౩౪

గీ. తండ్రిసన్నిధి సమయందు ధర్మసరణి
జేసి నేనెట్లు సుఖవాంఛ జేయకుందు?
గురుని వాక్యము విడనాడి కూడనట్టి
భరతవాక్యము నేనెట్లు పట్టువాడ? ౧౩౫

క. స్థిరమతా సమయము జేసితి
గురుసన్నిధి దాటగలనె కులధర్మంబే
పరమతి కైకయు నప్పుడె
పరమాహ్లాదంబు నొందె భాగ్యార్థినియై. ౧౩౬

గీ. జాతిభేదంబు కల్పితసరణి గాంచె
పురుషకల్పితమై యొప్పె పూజ్యవేద
మార్యధర్మంబు కల్పిత మంటివీవు
విషయతృప్తియె పరమమై వెలసె నీకు. ౧౩౭

గీ. జాతిగర్వంబు లేకుండ జాతివిహిత
ధర్మవర్తను లెందరో ధరణి గలరు
హీనజాతిని కూడను హేయమనరు
జాతులన్నిట పూజ్యులు జగతి గలరు. ౧౩౮

వ. నీవు చెప్పిన పిండోత్పత్తికారణ మతితుచ్ఛము. ఇట్టి వాక్యంబులు మహారాజులకు వినిపింపదగదు. మనుజులకును పశువులకును జన్మకారణము తుల్యమంటివి. పశువులకు లేని మాతాపితృభక్తి మనుజుల కేల నంటివి. జన్మకారణ మొకటియైనయపుడు వివేకాదులుఁగూడ తుల్యముగ నేలలేవు ? పశువులతో సమమగువారికి నీవాక్యము రుచించును. అప్పుడు పశువునకును మనుజునకును భేదమేమిగలదు ? విద్యావివేకాదులు పశువులకు లేవుగదా ? మనుష్యులకుమాత్ర మేలయుండవలె నందువా ? పశుతుల్యులగు మనుజుల కక్కఱలేదు గాని మావంటివారి కుండవలసినదియె. ఆహార నిద్రా భయ మైథునాదులుమాత్రమె పశువులకు మనుజులకు తుల్యములు. అవియె ప్రధానముగా గలవా రట్టివారె. పశువులు నియమబద్ధములు గావు. మనుజులు నియమబద్ధులు. పశువు లింద్రియవశమున దిఱుగునవి. మనుజు లింద్రియముల దమవశమున నుంచదగినవారు. ఇంద్రియముల స్వవశమున నుంచుకొనుటకె నియమము లేర్పడినవి. ఇంద్రియాకర్షణాలకు లొంగినవాడు పశుతుల్యుఁడె. నియమబద్ధుఁడగు మనుజుఁడు క్రమముగ నింద్రియముల జయించును. పశువులకు గురువులు, విద్యలు లేవు. మనుజులకు గురువులు, విద్యలు గలవు. వారి నాశ్రయించి విద్యావివేకాదుల నెఱుంగగలవారై యున్నారు. గురువులలో తలిదండ్రు లధికపూజ్యులు. పూర్వజన్మ గలదు. కర్మఫలము కలదు. కర్మానుసారముగ నెవ్వ రెచట నెవరికి బుట్టదగుదురో యచటనె వారికె పుత్రులు గాగలరు. పూర్వజన్మయు కర్మఫలములును లేవనుట యసంగతము. పూర్వజన్మయు కర్మఫలమును కలవనుట కనేక నిదర్శనములున్నవి. నీవుసుఖఫలమె పుత్రుఁడంటివి. కానిమ్ము, అట్టిపుత్రుని బెంచి పెద్దవానిని జేసి విద్యాబుద్ధుల నేర్పి తమ సర్వస్వ మర్పించిన తల్లిదండ్రులయందు గౌరవ ముంచనక్కఱలేదని నీ జిహ్వ పలికినదిగాని మఱి యే జిహ్వయు బలుకనేరదు. స్త్రీపురుషయోగమె పుత్రజనన కారణ మంటివిగదా! అదియె కేవల కారణమైనచో మా తండ్రికి యరువదియేండ్ల వర్షముల పర్యంతము పుత్రోత్పత్తి లేకయుండిన నేమి కారణము ప్రశ్నయగు. పుత్రకామేష్టి చేయించితి రప్పుడు పుత్రోదయమాయె

దానికి కారణమేమి? దీనికి నీ వేమి యనియెదవు? పుత్రులు లేక పలు పాట్లు పడియు ఫలముగాంచనివా రెందరు లేరు ? దిలీపునకు - నందినీ యనుగ్రహమున పుత్రోత్పత్తి యేల కావలెను? పూర్వజన్మకృత సుకృత దుష్కృత పరిపాకమె సుఖదుఃఖకారణము. అదియె జంతుజనన సమ యనుగ్రహమును భగవత్కృపయె కారణమనిన ననవచ్చును. మను జులు శాస్త్రవశ్యులు గాన శాస్త్రమునగల విధుల ననుసరించవలెను. నేను పూజ్యుడు గురువు తండ్రి పోషకుడు సర్వస్వదాత మహా రాజు విద్యాబుద్ధిప్రదుడగు జనకుని యాజ్ఞ నెన్నటికి నతిక్రమించను. నీయుక్తు లతిగర్హ్యము లశ్రావ్యములు. దైవము లేడంటివి. కారణము లేని కార్య మెచటనైన గలదా ? ఈ ప్రపంచకార్యమునకు కారణు డీశ్వరుడు. ఈశ్వరుడు లేకుండిన ప్రపంచ మెటుల బుట్టును ? కనుక దేవుని సత్త ననుమతింపుము. కంటికగుపించునది సత్యమంటివే. నీవు దేనిని కనగలవు? నీ దృష్టి ఎంతవరకు ప్రసరించును ? నీ దృష్టి కగుపించనిది లేదందువా? నీకంటి కగుపించనివి యెన్ని గలవు? సూక్ష్మదర్శినియను అద్దమున బరిశీలించిన యెన్నియొ నేత్రగోచరములుగానివి యంత్రగోచ రము లగును. తేజఃపదార్థములలో నెన్నియొ మన చర్మచక్షుస్సున కందనివి కలవు. మహాత్ములు తమదివ్యదృష్టుల జూచి, తెలిసి మనకు తెలిపినవి బహుసంఖ్యాకములు కలవు. అట్టివాటిని నీవవలోకించ లేకపోయిన మాత్రమున నవి లేవనెదవా ? వినుము. శనిని నీవు విని యుందువు. అతనిగోళము మననేత్రమునకొక నక్షత్రమువలె గనుపించు చున్నది. యది సమీపించి చూచిన కొలది చుట్టును కడియము లగుపించును. వాటిని నీవు చూడనిమాత్రమున నవి లేకపోవునా ? ఇట్టి గ్రహములను సరిగా లెక్కవేసి యీభూమి కవి యిన్ని యోజన ములలో నున్నవనియు నిన్నిదినములకు తమతమ కక్ష్యలలో దిరుగు చున్నవనియు దెలుపబడినవి. అవి యసత్యము లనెదవా ? సూర్యుడు స్థిరముగ నున్నాడని చెప్పెదరుగాని యాసూర్యునకుగూడ గతిగానవచ్చు చున్నది. అది నూరు సూర్యసంవత్సరములకు ముప్పది వికలలై యున్నది. అట్లనె సూర్యుడు నడిచి ప్రద్యుమ్నునకు ప్రదక్షిణము జేయు

చున్నాడు. ప్రద్యుమ్నుడు దన యక్షమునందు సుమా రరువదియారు వందల సంవత్సరములకు ఒక వికల నడచుచున్నాడు. ఇట్లనే తనకక్ష్య యందు నడచి సంకర్షణునకు ప్రదక్షిణ మొనర్చుచున్నాడు. సంకర్షణుడు వాసుదేవునకు ప్రదక్షిణ మొనర్చుచున్నాడు. ఇది యెవరికంటికి కనుపించును? మనము నివసించియుండునది యొక బ్రహ్మాండము. ఇట్టి బ్రహ్మాండము లనేకములు గలవు. వీటిలోగల సూర్యాది గోళములు మన కేమి తెలియును గనుక మనదృష్టికి గోచరముకానివికూడ యున్నదని నీవు నమ్ముము. మహాత్ములు తమతపశ్శక్తుల దెలిసి తెలిపిన విషయము లనేకములు దూరదర్శక యంత్రములచే బరిశీలించి సరిపోయినటుల తెలియపరచినవి గలవు. ఈ పరిదృశ్యమాన జగమంతయు నొకనిచే నిర్మింపబడక యనాదినుండియు నిట్లనే పుట్టుచు గిట్టుచు నుండుట స్వాభావ మంటివి. పుట్టుటకు గిట్టుటకు కారణము స్వభావముకదా! ఆస్వభావమే యీశ్వరుడనిన నీవేమ నెదవు? ఈశ్వరు డొక రూపువాడు నొక్కచో నుండువాడు కాడు. సర్వవ్యాపి సర్వరూపుడు సకలశక్తియుక్తుడు. అతడిట్టివాడని యెవడు చెప్పగలడు! యోగదృష్టిని పరమాత్మావలోకన మొనర్చినవారుగలరు. వారి సాక్ష్యము నీకు చాలదా? మహావీరుడును భూలోకచక్రవర్తియు మద్వంశ ముక్తామణియు నగు మాంధాత యొకసారి వసిష్ఠభగవానుని సేవించపాదచారియై యయోధ్యనుండి తపోవనమున కేగెనట. అపుడట వసిష్ఠభగవానుడు యోగనిష్ఠుడై పరమాత్మావలోకనసుఖము ననుభవించుచు దనలోదాను సంతోషించుచున్నాడట. అపుడు మాంధాత చప్పుడేమియు చేయక యాయానందవిశేషముల బరిశీలించుచు నుండి గురుకటాక్షము కలిగినపుడు తద్విశేషముల వినియున్నాడట యది సత్యమానో కాదో మన్గురువరుల నడుగుము. పోనీ నీపార్శ్వమున ఘోరవ్రతులై నివసించి యున్న కృశశరీరులగు వాలఖిల్యాదుల నడుగుము: వీరెవరి ప్రీతికై యిట్టి దారుణవ్రతధారులైరి! వీరుగూడ మూఢులు వంచకులు అనెదవా? కనుల కంపనివానిని గనుగొననెకదా వీరి పరిశ్రమ గావున జగత్సృష్టికర్త యొకడున్నాడని విశ్వసించుము. ఈ భువనంబునగల జంగమస్థావరముల నిర్మాణకౌశలము

బఱికించితివా ? దీనికి కారణమేమి యందువు? జీవుల స్వస్వకృతకర్మ విశేష మనకతప్పునా? అపుడు భగవంతుడు జీవుల స్వస్వకృతకర్మల కనుగుణముగ నీశేషితవ్య వైషమ్యముల నొసగుచున్నవాడని యంగీకరించుము. పోనీ మన తెలివి నెంత వినియోగించినను యీ ప్రపంచమున గల జంగమస్థావరాత్మకములగు ప్రాణికోటుల విచిత్రభేదములను స్థూల సూక్ష్మరూపభేదములను మనము తెలియగలమా? నీటియందు వాయువు నందు స్థలమున మననేత్రములకు గోచరములుగాని జంతుసముదాయము లెన్నియో గలిగియున్నవి. ఎంతయో విచిత్రములగు రూప భేదములుగూడ గోచరము లగుచున్నవి గాన ఎవ్వడును భగవత్తత్వమునుగాని భగవత్సృష్ట జంతుతత్వమునుగాని సుస్పష్టముగ నెఱుగజాలక కించిజ్ఞుడనని యంగీకరించి భగవంతుని శరణుంబొందవలె గాని సర్వజ్ఞుడనని గర్వించతగినవాడు లేడు గనుక భగవంతు డున్నాడని సృష్టికార్యమునకు భగవంతుడే కర్తయని తెలిసికొనుము. మానవులు తమ నిజస్థితిని దెలియదగిన వివేకము నార్జించగల తెలివితేటలు గలవారు గనుక వారు మంచిచెడ్డల నెఱుగుటకుగాను భగవంతుని సంకల్పవిశేష మున వేదము లుద్భవించినవి యవి మనుజకల్పితములు గావు. స్వయముగ బుట్టినవే. యవి గ్రహణధారణపటువులగు బ్రహ్మాదులువిని ధరించిరిగాన నవి శ్రుతులని వాటికి పేరు గలినది. అదిమొదలు నేటివరకు నొకరు రుచ్చరించిన దానిని విని మఱియొకరు రుచ్చరించి సుస్వరముగ పఠించుచున్నారు. అక్షరరాశి జడ మనియు నదియొకరు రచించినగాని నెలుబుట్టిననియు నంటివి. జడపదార్థము లెన్ని యదృచ్ఛముగ బుట్టియుండలేదు ? భగవత్సంకల్పమున కవరోధ మెచట గలుగును? భగవచ్ఛక్తికి మేరగలుగునా? కావున నాశంకను విడువుము. ఎట్లైన జెప్పుము, ఒక డుచ్చరించినగాని యక్షరరాశి కలుగదనెదవా ? అపుడు భగవంతుడ ట్లుచ్చరించినాడనిన నేమనెదవు? ఎట్లయినను భగవంతు డున్నాడు. వేదములు మానవకల్పితములు కావు. ఇతరభాషలలో కూడ వేదములున్నవి. వానియందువారికి గౌరవముకలదు. అవి వారు పౌరుషేయములే యనెదరే. మీరందుకేల యంగీకరింప రనెదవా ? అవి పౌరుషేయము లగుట వారట్లు పలికెదరు.

ఇవి యపౌరుషేయము లగుట నిట్లు బలుకవలసివచ్చినది. ఈ భరత ఖండమున ననాదినుండియు బ్రాహ్మణాది వర్ణవిభేదము లేర్పడియున్నవి. గుణకర్మలబట్టి భగవంతుడు యీవర్ణముల సృజించినాడు. వర్ణములు మనుష్యకల్పితములు కావు. బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు జన్మాదిస్మశానాంతములగు వేదోదిత షోడశకర్మలుగలవారు కనుకనె ద్విజు లనబడిరి. కర్మలుకూడ జన్మకారణము లైనవని యభిప్రాయము. ఉపనయనాది సంస్కారములు లేనివారు ద్విజులుకారు. ద్విజులు కానివారికి వేదమును పఠించు అధికారము లేదు. వేదములో తెలియదగియున్న విషయము లన్నియు పురాణములలో ద్విజేతరులనిమిత్తము సుస్పష్టముగ మహర్షు లుపపాదించియున్నారు. వాటి ననుసరించి ద్విజేతరులు సిద్ధిని బొందగలరు. ద్విజేతరులకే తెలిసికొను విషయమునను కర్మాచరణమునను సులభముగ ఫలసిద్ధిని బొందుమార్గ మేర్పడినది. ద్విజులసిద్ధి మిగుల కష్టము. ద్విజస్త్రీలకుకూడ వేదోచ్చారణార్హతలేదు. శృత్యాశృత్యర్థానుసారము మునులు స్మృతుల వ్రాసిరి. శృతిస్మృతీతిహాస పురాణసమన్వయమున వేదార్థము ప్రతిపాదింపవలయును. ధర్మమొకరిని వంచించుట కేర్పడినదికాదు. వారివారి యర్హతలకు తగినటుల నేర్పడినది. వర్ణానుసారముధర్మము భేదించినది. స్వధర్మవర్తనులిహాపరశ్రేయముల నొందుదురు. స్వధర్మ పరిత్యాగు లుభయభ్రష్టులు. కులభేదముల వీడి సర్వజనులును పరస్పర వివాహముల నొనర్చుకొని యేకముగనుండిన మహాలాభము కలదని కొందరి యాశయ మది నీ యభిప్రాయానుసారము సుఖఫలజనకమైనను సర్వసంకర మొనర్చుట తగదు. నరకపతనమూలకము. భరత ఖండవాసుల కది తగనిపని. ఈ ఖండమునగల భూమి కర్మభూమి. అనాదినుండియు నిట్టి భేదములతో నలరారుచున్నది. ఇతర ఖండములలో నీ భేదమేలలేదు, యిందేల గలిగినదనిన వినుము. మానవజాతి యాదియందు భరతఖండముననె బుట్టినది. మానవులంద రార్యులెగాని కొంద రార్యధర్మముల విడనాడి యనార్యు లనిపించుకొనిరి. వారినె దస్యు లనెదరు. మఱికొందరు యీ కర్మభూమిని విడనాడి యితర ఖండములకు నితర ద్వీపములకు పోయి యార్యధర్మముల విడచి

వర్తించుటచేత వారి కార్యధర్మములు లేకపోయినవి గాని వారికిని మాదియుం డీధర్మములు గలిగియె యున్నవి. వారి క్షేమముకొఱకు దేవుడు వారికితగినటుల వారిలో యోగ్యులగువారి నావేశించి మన వేదములవంటివె ధర్మబోధకగ్రంథములను రచింపజేసి యున్నాడు. వాటి ననుసరించివారు తరించుచున్నారు. కనుక వారు వారిధర్మములను మనము మనధర్మములను విడువకూడదు. వారిలోకూడ ననేకజాతులు ననేక భేదములు కలిగియున్నవి. శ్రాద్ధాదులలో మన మిడుచున్న యన్నము మృతులు దినుటలేదనునది యందరికిని విశదవిషయమె. శరీరము పోయిన జీవుడు పోడు. స్వర్గముననో నరకముననో జన్మవిశేషముననో యుండును. మనమాచరించు శ్రాద్ధాదులకు పితృదేవతలు మొదలగువారు తృప్తినొంది ప్రీతినొందినవారికి శ్రేయోదాయకు లగుదురు. వా రెక్కడనున్నను వారాలాభము నొందగలరు. ఆ దేవతలయందున్న సర్వవ్యాపియగు భగవంతుడే యటుల ననుగ్రహించును. ఏపని మనము చేసినను భగవదారాధనమునకే. ఇట్టివన్నియు భగవదారాధనా భేదములుగాని యన్యములుగావు. కర్మ భగవత్ప్రీతిని గలిగించును. కర్మాచరణమున గలుగు నన్నవ్యయము బ్రాహ్మణులకంటె బ్రాహ్మణేతరుల కధికము లేదు. బ్రాహ్మణులు స్వలాభమునకే కర్మల నాచరింపజేయుట లేదు. హస్తదగ్ధము లేక నిష్కామకులై కర్మల నాచరించు బ్రాహ్మణు లనేకులు గలరు. విప్రులందరు మాయాకంచుధారులు కారు. కొంద రున్నారనిన నట్టివా రందరిలోను నుండవచ్చును. స్వధర్మపరిశ్రమకూడ వారికే యధికము. బ్రాహ్మణుడగువాడు పరలోక సుఖాకాంక్షియై యైహికసుఖమును విశేషించి కోరక శరీరమును కష్టపెట్టుచుండ వలెనని శాస్త్ర ముపపాదించుచున్నది. ఐకమత్యమనునది సకలజనహితకాము కుల హృదయైక్యసాధ్యముగాని యన్యము కాదు. కులభేద మున్నను హృదయాభిప్రాయైక్య మున్న లాభము కలదు. హృదయాను రాగములు లేనిచో కులభేదములు లేకపోయినను విపత్పరంపరలు గలుగును. ఏకజాతిలో పరస్పరబంధువులలో నైకమత్యములేక బహు కష్టములపాలై యొకరినొకరు వధించుకొని సమూలనాశనమైనవా రెందరో

గలరు. అన్ని జాతులవారును పరస్పరస్పృశ్యులై యుండవలెనుగాని కొందర స్పృశ్యులనియు కొందరు స్పృశ్యులనియు జెప్పఁటతగదనిన మనయనయు వములలోనె కొన్నిటిని స్పృశించి జలస్పర్శను జేయుచున్నాము. ఆర్యుల కస్పృశ్యత సహజము. ఏకజాతివారిలో కూడ కారణములేనిదే యొకరి నొకరు స్పృశించతగదు. స్పృశించవలసిన విధులు కొన్ని యున్నవి. అపుడు స్పృశించవలెగాని సర్వత్ర తగదు. తల్లియు సోదరియు పుత్రికయుగూడ యవస్థాభేదములలో స్పృశించదగదు. అట్లు స్పృశించిన సాంక్రామికములగు కొన్ని వ్యాధులుఁగూడసంక్రమించవచ్చును. వైద్యులు జ్వరితుల స్పృశించి హస్తముల జలముఁతో కడుగుకొనుట యనాది నుండియు గలదు. ఆహారభేదమున సత్వాదిగుణములు భేదించును. అట్టి గుణభేదములుఁ గలవారి శ్వాసలు శరీరములు పరస్పరవిరుద్ధ ఫలజనకము లగును గాన స్పృశించకుండుటయే మేలు. సర్వజనులును సత్వగుణమధిక మగునటుల ప్రవర్తించవలెను. సత్వగుణమును వృద్ధిజేయు ఆహారములనె దినవలెను గనుకనే కొన్ని యభక్ష్యములని యాహారపదార్థములలో విడదీయబడినవి. బ్రాహ్మణులకుతదితరులకంటెగొప్పలాభమేమియులేదు. పరిశీలించగా స్వధర్మప్రవర్తకుడగు బ్రాహ్మణునకె కష్టమెక్కువ. మోక్ష ఫలము నార్జించుటకు బ్రాహ్మణునికంటె బ్రాహ్మణేతరునికే సులభము. రజస్తమోగుణములు వృద్ధినొందిన దుష్ప్రవర్తన లధికమై రెంటచెడిన రేవడిగ నొనర్చగలవు గనుక నీవాదము పరాస్తమై దేవుడున్నాడనియు సృష్టికి దేవుడె కర్తయనియు పుణ్యాపాపములు కలవనియు వేదము లపౌరుషేయములనియు జాతులనాదులనియు స్వధర్మము లపరిత్యాజ్యము లనియు లోకములు దేవతలు గలరనియు దేవతాప్రీతికై శ్రాద్ధముల నాచరింపవలయుననియు భగవదనుగ్రహము కలవానికి మోక్షము కల దనియు ప్రకృతిబంధవిమోచనమె మోక్షమనియు పరిష్కారమేర్పడినది.

గీ. అన్నదమ్ములలోనెల్ల నగ్రజాతు
డెట్లు విప్రుడు జాతుల హెచ్చుసుమ్ము
సత్వగుణుడను గొప్పయె సంభవించె
సమరసంబున క్షేమంబు జాలగలుగు.

గీ. జాతి విహితంబులగునట్టి సర్వకర్మ
లాచరింతురు విప్రులు హర్షముగను
వారిఁ గాతురు రాజులు వసుధలోన
వారు తపమున బ్రోతురు వసుమతీశ. ౨౮౦

సీ. వనమున నివసించి వరధర్మములజేసి నియతవ్రతుండనై నియతిగలిగి
దుంపలనాకుల తూడులదినుచును తర్పితామరపితృతతుడనగుచు
పంచవర్గమునెల్ల పరితృప్తినొందించి యైహికయాత్రనుహర్షముగను
జక్కగజరిపెద సాధులు మెచ్చగ కపటమేమియులేక కార్యమెఱిగి

గీ. సాధుజనులకు హితముల జరుపువాడ
ఖలుల శిరముల బరిమార్తు ఖండితముగ
సకల జంతుల గాతును సమరసముగ
తపము జేసెద తాపసతతులు మెచ్చ. ౨౮౧

సీ. భరతఖండంబెల్ల భవ్యదేశముసుమ్ము శుభకర్మకర్తమై శోభగూర్చు
కర్మలజేసియె గాంచిరుత్తమగతి వహ్నియు సోముడు వాయువరుణు
లదిగాక మిక్కిలి యధికుడౌ శక్రుడు శతయజ్ఞములజేసి శమితరిపుడు
నాకంబునకునెల్లనాథుడై వెలసెను తపమున దివిజుల దన్ని మునులు

గీ. దివికి నేగిరి రాజులు దివ్యపదవి
గనినవార లనేకులు గలరుసుమ్ము
కార్య మెప్పుడు కారణ కలితమగుట
పరము పరముడు లేడంట పాడియగునె. ౨౮౨

సీ. సత్యముధర్మముసత్పరాక్రమమును సకలభూతదయయు సత్ప్రియంబు
బలుకుచుండుటయును పటువిప్రపూజయు నమరపూజయు మఱి
యతిథిపూజ
సురలోకమేగగ సులువైనమార్గంబు లనెడివిప్రులమాట లాదరమున
వినియున్నవాడను విప్రులుగనుకనె ధర్మమార్గమునెప్డు దప్పకుండ

గీ. సంచరించుచు తెలివిని చాల నంది
స్వర్గసుఖముల గాంతురు స్వచ్ఛబుద్ధి

తండ్రిజేసిన దానిని తప్పటంచు
బలికి చార్వాకమత ధర్మపటలి తగునె. ౨౮౩

వ. ఈశ్వరు డొక్కడు. జీవులు ధాన్యరాసులవలె పెక్కండ్రు. ఈశ్వరాపేక్షయా కించిజ్ఞులు ఈశ్వరపరతంత్రులు కర్మవశ్యులు ప్రకృతివశ్యులు భగవత్కృప గలిగిన సర్వశక్తుల నలరారగలరు. ప్రకృతివశమున ఉత్తమ మధ్యమాధమశక్తులు గలిగియుండిరి. ప్రకృతి ఈశ్వరప్రేరితమై యచింత్యశక్తిసమన్విత బహువిధరూపసమన్వితము కాగలదు. జీవప్రకృతుల బహిరంతరముల సర్వేశ్వరసంచారము కలదు. అట్టి జీవు లనాదిస్వకర్మవిశేషంబుల నిత్యముక్తబద్ధభేదముల ప్రవర్తిల్లుచున్నారు. అందు బద్ధులు నిత్యసంసారులు. పిపీలికాది బ్రహ్మపర్యంతము గల మనమందరమును బద్ధులమె గనుక

క. పరలోకము పరదైవము
బరికింపక లేదటంచు వరసుఖ మొకటే
స్థిరముగ గోరగవలెనని
ఖలబోధల జేయుఖలుల ఖండింపవలెన్. ౨౮౪

క. చోరునివలెనే బుద్ధుని
ధీరుని చార్వాకఖలుని ధీబలయుక్తున్
భీరుని తాథాగతుగని
దూరీకృతు జేయవలెను దురితము దొలగన్. ౨౮౫

క. కనుగొన వలవదు నాస్తికు
గనపడినను కన్నుమూసి గడకేగవలెన్
గనుగొన కలుషము లొదవును
దనరాజ్యమునుండి వాని దఱుమగవలయున్. ౨౮౬

సీ. శబ్దానుమానాది సత్ప్రమాణంబులు ప్రత్యక్షమునుగూడి ప్రబలిమిగుల
నర్థముసాధింప నర్హములౌనందు శబ్దమధికమనుచు సమ్మతించి
నిగమమార్గంబుల నియమముగానమ్మి నడువగవలయునునరులుమిగుల
నీకంటెపెద్దలు నీకంటెపూజ్యులు నియతధర్మంబుల నిలచి మహాత్మ

గీ. సకలవైదికకర్మల జరిపినారు
నాకమందిరి పరిపూర్ణ నవ్యభవ్య
దివ్యతేజంబుతోఁ గూడి తేజరిలిరి
వారి నెరుఁగవె పేరిని వారినడుగు. ౧౪౭

క. దానగుణ దీప్యమానులు
మానితధర్మైకరతులు మహితులు పూజ్యుల్
మానుగ తేజోవంతులు
మానీశులు వీరివడిగి మాన్యత గనుమీ. ౧౪౮

వ. ఈ ప్రపంచకార్యమునకు సర్వేశ్వరుడు సర్వసాక్షి సర్వనియంత సర్వాంతర్యామియగు భగవానుడు కర్త. అతడు తన యచింత్య సంకల్పవశమున సర్వమును సృజించినవాడు. తచ్ఛక్తి వర్ణనాతీతము. మన తెలివి యత్యల్పము. కించిజ్ఞులము. భగవత్సృష్ట పదార్థములలో నొకపదార్థజాతినైనను పూర్ణముగ మనము బరికింపజాలము. ఒక్కొక జాతిలో నెన్నెన్నియో చిత్రవిచిత్ర భేదములుగలవు. ఒక తృణజాతిని బరికించుము, లేదా యొకపిపీలికాజాతిని పరిశీలించుము, లేదా పక్షి జాతిని పరిశీలించుము. ఎన్నెన్ని భేదములు గలవో పరిగణింపుము. పక్షులు మొదలగునవి యే జాతికాజాతియై యైకమత్యముకలిగి పరజాతిలో జేరకయున్నవి. మానవజాతికన్నను పక్ష్యాదులలోనె విరోధములు బలముగనున్నవి. మానవజాతికూడ పరిశీలించినకొలది మనంబున నత్యధికాశ్చర్యజనక విభేదంబులు గనుపించుచున్నవి. మన యాయుః కాలమునంతయు వినియోగించినను యొకజాతిలోని భిన్నభిన్నములగు విశేషములను పూర్ణముగ గనజాలము. ఇట్టి తెలివిగల మనము పెద్దలను శాస్త్రములను దూషించుట పరిహాసాస్పదము. తుచ్ఛములగు సుఖముల నమ్మి యుభయభ్రష్టులముగాక మహాజనులు గమనించు మార్గమును సంశ్రయించి నడుచుట సర్వశ్రేయము. తద్భిన్నముగ నడుచువానిని శిక్షించుటకె విఘ్నమ్ములు విశ్వనేత విశ్వేశుల కర్పించె నవి యివియె. ఇవి రిత్తబోవునవి గావు. తపశ్శక్తియు మాయందు

తాదృశమహిమాన్వితము. శస్త్రాస్త్రములయందును సమర్థులగువారల నెంచి మహాశక్తిసంపన్నులగు మహర్షులు భూలోకపాలనమున నియమించిరి. అట్టి వంశంబున జనించిన మేము పాపాసక్తులను ధర్మ విధ్వంసులను నాస్తికులను బట్టి శిక్షించుటకు మాప్రాణములను శస్త్రాస్త్రములను దాల్చియున్న వారమని పలుకు భువనైకవీరుడగు శ్రీరామ భగవానుని క్రుద్ధునిగ దెలిసి భీతిల్లి జాబాలి తనవాక్కులు నింద్యము లనుకొని వినయంబున రామచంద్రా ! రఘురామ ! వినుము. ధర్మ సంకట సమయమున సర్వమతజ్ఞుడగు విద్వాంసు డేదేని యొకమతము నవలంబించి ధర్మస్థాపన మొనరించుట యుక్తముగాన గొప్పరాజ్యమున కరాజకత్వదోషమును వారించుటకు నాస్తికమతము సర్వసుచ్యమగుట దాని నవలంబించి పలికితిని. నీవు వేదమార్గమున సవిచాల్యుడవు. లోకు లందరు నీ సద్గుణములకు సంతసింతురు. నీ వయోధ్యాసింహాసన పట్టాభి షిక్తుడ వగుటయె నా వాక్యములకు ఫలము. భరతముఖోల్లాస మపే క్షించితిని. నేను నాస్తికుడనుగా నని వచించుచుండ వసిష్ఠమహాముని,

## వ సి ష్ఠో ప దే శ ము

గీ. కోపియగు రాము గనుగొని కోప మేల ?
రామ ! జాబాలి తత్వంబురమ్యముగను
దెలిసియుండియు పురిజేర్చ తేటగాను
బలికెగావున మన్నించు పరమపురుష ! ౧౮౮

గీ. వినుము నా మాట విశ్వేశ ! విశ్వసించి
యాదియందున సర్వేశు డవ్యయుండు
లోకసృష్టిని జేయగ లోనెంచ
నాదికారణములు గల్గె నద్భుతముగ. ౧౮౯

వ. తన్మాత్రలకంబులై యనేకకోటి బ్రహ్మాండంబులు మహా మనస్వి బుద్ధిగణనాతీతంబులై యచింత్య భగవచ్ఛక్తి సమన్వితములై పరస్పర బహుదూర విక్షిప్తంబులై, నిరాలంబంబులై, నిస్తులంబులై, మహాకాశపథంబున నలరారుచుండినవి. ప్రతిబ్రహ్మాండంబునందు రవ్యా

ద్యనేకగ్రహగోళంబులు స్వస్వకక్ష్యల ప్రదక్షిణగతుల భగవత్ప్రదక్షిణంబుల జెల్లించుచుండును. మనము నివసించియుండు యీబ్రహ్మాండంబునందు మొదట సృష్టికర్తయగు చతుర్ముఖబ్రహ్మ పరమేశసంకల్పవశమున నుదయించి బ్రహ్మాండమంతయు దిరిగి యేమియుదోచక చింతించుచుండ "తపస్తపః" అనుశబ్దము వినిపించినది. పిదప పరమనిష్ఠ తపస్తప్తుడయ్యె, నంత నతనికి నిగమంబుల నొసగి చేతనకళేబరసృష్టికి సర్వేశ్వరు డనుమతి యొసగె.

సీ. సకలజగంబుల శతధృతిగలిగించె తీవ్రతపశ్శక్తి ధీరుడతడు
గనియె మరీచిని కళ్యాణగుణగణు డతడు కశ్యపుగనె హర్షయుతుని
కశ్యపుడనువాడు గనియెనుభాస్కరు భాస్కరపుత్రుడై బరగెమనువు
మనునిర్మితంబయ్యె మహీనయోధ్యాపురి మనుపుత్రు డిక్ష్వాకు
మహితవిభుడు.

గీ. కుక్షి యైక్ష్వాకుడయ్యెను కువలయమున
కుక్షి గనియె వికుక్షిని కూర్మితోడ
బాణు డతనికి పుత్రుడై పరిఢవిల్లె
బాణు డనరణ్యుగనియెను భద్రమూర్తి. —౭౫౧

వ. అనరణ్యునకు పృథువు జనించెను. పృథువునకు త్రిశంకుడు, త్రిశంకునకు దుందుమారుడు, దుందుమారునకు మాంధాత, మాంధాతకు సుసంధి, సుసంధికి ధ్రువసంధి, ధ్రువసంధికి భరతుడు, భరతున కసితుడు, అసితునకు సగరుడు, సగరున కసమంజసు, డసమంజసున కంశుమంతుడు, అంశుమంతునకు దిలీపుడు, దిలీపునకు భగీరథు, డతనికి రఘువు, రఘువునకు కల్మాషపాదుడు, కల్మాషపాదునకు శంఖణు, డతనికి సుదర్శనుడు, సుదర్శనున కగ్నివర్ణు, డతనికిశీఘ్రగు,డతనికిమరుడు, మరునకు ప్రశుశ్రుడు, ప్రశుశ్రునకు అంబరీషుడు, అంబరీషునకు నహుషుడు, నహుషునకు నాభాగుడు, నాభాగున కజుడు, అజునకు దశరథుడు, దశరథునకు సకల కళ్యాణ గుణగణభాజనుడవగు నీవు జ్యేష్ఠపుత్రుడవు. మనువు మొదలుగ నేటివరకును యీ వంశంబున గలవారలలో జ్యేష్ఠపుత్రుడె యవిభాజ్య

మగు నయోధ్యారాజ్యమును బాలించుచుండె. నీ వీయాశ్రితుల దీనా లాపంబుల విని యందర ననుగ్రహింపుము. క్రమప్రాప్తమగు యీనీరాజ్య మును బాలింపుము. వీరందరు నిను గొనిపోవ నేతెంచినవారు. వీరి మనోరథమును దీర్పుము. అచేతనంబులుగూడ నీదర్శనంబునకు తొంగి తొంగి చూచుచున్నవి. నీ వయోధ్యకు రావేని వీరందరును నీవలెనె యడవియందు నివసించి మునివృత్తి నవలంబించెదరు. సౌఖ్యముల విడ నాడెదరు. మీ వంశమున జ్యేష్ఠుడుండ కనిష్ఠుడు రాజు గాలేదు.

క. కులమునగల వరధర్మము
విలసిల్లగ జేయవలయు విశ్వవివేకా!
కులధర్మ మెప్పుడు విడువగ
వలదనుచును పెద్దలెల్ల పలుకగ వినవే. ౨౫౨

క. పురుషునకు ముగురు గురువులు
వరజనకుడు తల్లి గురుడు వరలుదు రందా
పురుషుని జన్మకు హేతువు
వరజనకుడు ప్రజ్ఞదెలుపు పరముడు గురుడా. ౨౫౩

క. గురుడను తండ్రికి నీకును
పరమాచార్యుండ కులమువారికి నెల్లన్
పరమాచార్యుని వాక్యము
పరమాప్తమటంచు విన్న పరగతి చెడునే? ౨౫౪

క. వీరలు విప్రులు పౌరులు
వీరలు నీహితముగోరు విబుధులు వీరల్
వీరలు శూరులు మంత్రులు
వీరల మన్నింప ధర్మవితతియు చెడునే? ౨౫౫

గీ. వయసు చెల్లిన తల్లియె వాసిగాను
కరుణ యాచించు పలుకులు కాదటంచు
గడుసుదనమున కాల్నడ కానకేగ
కలుగు ఫలమేమి చెప్పుము కార్యవిదుడ! ౨౫౬

క. భరతుఁడు శరణార్థియునై
వరయాచన చేయుచుండె వరదుఁడ! నిన్నిఁ
బరమాదరమున నాప్తము
పరమార్థము నీకుఁ జెడదు పార్థివముఖ్యా! ౨౪౭

వసిష్ఠునకు రామసమాధానము

క. అన విని యనియెను ధీరుఁడు
తనగురువును జూచి ధర్మతత్పరుఁ డౌచుఁ
తన తనువును గలిగించిన
తన పితరుల వృత్తి మధికతరమగు టరుదే. ౨౪౮

క. విదితము జనకుని యుపకృతి
యదియు సుకృతికరమగు నెద నాచార్యవరా!
ముదమున బలికెద జనకుడు
సదయుండగు గురునికంటె జను నధికుండై. ౨౪౯

క. జనకుడు సర్వస్వంబును
తన తనయునకిచ్చి మిగుల దగు నుపకృతులఁ
ఘనముగ జేయుచు గరుణను
మనమలరగ బెంచెగాదె మహితమనీషా! ౨౫౦

గీ. అతఁడు భూపుడు జనకుడు హర్షదాయి
యతని సన్నిధి జేసిన యమలశపథ
మెటుల మిథ్యను జేయగ నెంచువాడ?
తిరుగనేరదు నా జిహ్వ తీర్థపాద! ౨౫౧

వ. నీవు సర్వజ్ఞుడవు. నీకు నెదురాడ దగదు. ధర్మశృంఖలనాకాళ్ళ దగులుట నిట్లనవలసినవాడ నైతిని. నన్ను మన్నించి మారాడితినని తలపకుము. మఱియు, రాముఁడు మారాడువాడుగాడని నీవెరుగనిదియా? అని పలికిన విని భరతుఁడు చేయున దేదియు దోచక సుమంతు నవలోకించి, సుమంత! సత్వరంబుగ లేచి దర్భల నిటుదెచ్చి యిట స్త్ర

మంబుగ బఱువుము. రామానుగ్రహముకొరకు ప్రాయోపవేశం బొన ర్చెద నని పలికిన సుమంతుడు రాము నవలోకించి తదాకార చేష్టల ననుమతి లేదని తెలిసి యుపేక్షించి యుండ భరతుడు కుశోత్తరమును స్వయముగ బఱచి తదుపవిష్టుండై పరుండి ప్రాణంబుల నిరోధించుచుండుటను రామభద్రుండు గాంచి, తమ్ముడా! ధర్మజ్ఞుడా! భరత! ఇది యేమి? నేను నీకేమి యపకార మొనర్చితిని? ప్రత్యుపవేశమునకు కారణ మేమి? ఇది యధర్మము. ఇది విప్రునకు విహితము. బ్రాహ్మణు డేకపార్శ్వమున బండి నరుల నవరోధించ దగునుగాని ప్రత్యుపవేశకర్మకు, మూర్ధాభిషిక్త క్షత్రియుల కధికారము లేదు గాన శీఘ్రముగ లెమ్ము. జలమును స్పృశించుము, నన్నంటుము. సత్వరంబుగ నయోధ్యకేగి పట్టాభిషిక్తుడవు కమ్ము. రాజ్యము నేలుము. ఈ దారుణవ్రతమును చాలించుము. అనవిని భరతుడు భ్రాతృవాక్య గౌరవమున సత్వరంబుగ లేచి జలస్పర్శనంబు జేసి తన యన్నను స్పృశించి పౌర జానపదసముదాయము నవలోకించి మహాజనులారా! మీ రంద రును ధర్మమునందును, న్యాయందును, సంపూర్ణాభిమాన ముంచి శ్రీ రామప్రభువును లోకపాలన కర్మమునకు విచ్చేయుమని ప్రార్థింపుడు. సత్వరంబుగ లెండు లెండని పలుకుచున్న భరతు నవలోకించి వారు భరతరాజా! నీవు సర్వసమర్థుడవు. నీవే మాటలాడుము. రామ నృపాలుడు స్థిరప్రతిజ్ఞుడు, పితృవచనపరిపాలన రూపధర్మనివిష్టుడు, యుక్తి యుక్తవచోనిపుణుడు, మహావక్త గావున నాధీమునితో ప్రతివచనరచనా పాటవము మాకు లేదు. రామచంద్ర భగవానునితో మాటలాడుటకు భరతభగవానుడె యర్హుడు. మే మసమర్థులము గామని పలికిరి.

భరతుడు రామునితో మాటలాడుట

అంత భరతుడు మహాపరిషన్మధ్యభాగంబున లేచి నిలువబడి సభికుల నందర నవలోకించి

సీ. వినుడయ్యసభికులు విశ్వాసయుక్తులు తథ్యంబుబలికెద ధర్మముగను
రాజ్యార్థినై నేను రాజ్యంబు తండ్రిని కోరలేదెప్పుడు గూఢముగను

తల్లినిరాజ్యంబు దశరథుఁ డడుగంగ బోధించియొసఁగను భోగకాంక్ష
పరమధర్మిష్ఠుఁడు భాస్కరతుల్యుఁడు కానకుబోవుట కనను వినను

సీ. గాన నాయందు దయయుంచి కార్యవిదుఁడు
రఘుకులాంభోధిచంద్రుఁడు రామనృపుఁడు
సత్యమని నమ్మి నామాట సత్వరముగ
భూమి నేలఁగ వేంచేయఁ బూనవలయు. ౨౬౨

గీ. తండ్రియాజ్ఞను జరుపక తప్పదేని
యడవియందున నేనుందు నధిక నియతి
సమయపర్వంబులెల్లను చనెడిదాక
రాజ్య మేలుము నీవిష్టే రమ్యముగను. ౨౬౩

వ. అన్నా! రామచంద్రా! సకలకళ్యాణగుణసాంద్ర! మానవలోక దేవేంద్ర! గురుడును, తల్లులును, నేనును, మంత్రులును, బంధువులును, పౌరులును, జానపదులును, సకలమానవులును మిగుల ప్రార్థించుచున్న వారము. ఈ ప్రార్థనలుగాక నియతధర్మముగూడ నదియె. నేనెన్నఁడును రాజునుగాను, నీవెన్నఁడును రాజవు కాకపోవు గావున ధర్మప్రాప్తమగు రాజ్యపాలనమును సత్వరంబుగ స్వీకరింపుము. తమ్ముని కోటిక చెల్లించుము. నన్ను ప్రతినిధిగా నియమించుటకు సందేహించకుము. నీకు నేను యథేష్ట వినియోగార్హుఁడను. నన్ను నీవెట్లు నియమించినను నీనియమనానుసారము వర్తించెదను.

క. అని పలుకు భరతవాక్యము
విని రాముఁడు జనులగాంచి విస్మితమతియై
జనకుఁడు వనమును నాకిడి
ఘనరాజ్యము గొనియె మాల్యకరణముచేతన్. ౨౬౪

క. వనవాస మనెడి మాల్యము
ఘనముగ నాకిచ్చి నృపుఁడు కాశ్యపి గొనియెన్
ఘనమగు కాశ్యపి నీకిడె
మన జనకుని యాజ్ఞ నాకు మాన్యము నీకున్. ౨౬౫

క. ఆహితము రాజ్యమూటను
సాహసముగ నేను గొనుట సాగదుసుమ్మీ!
యీ హితము చెప్పినాడను
నా హితవును నీవు వినుము నరనుతచరితా! ౨౬౭

క. ప్రీతమగు రాజ్య మెట్టుల
చేతో మోదంబు తోడ చేకొననేర్తు
ప్రీతిని రాజ్యము నేలుము
నా తరమా మాటదప్ప నలినాప్తకులా! ౨౬౮

గీ. రాము డాడిన మాటకు రభసముగను
మారుమాటాడ డనుమాట మనమునందు
మరచినాడవు కాబోలు మహితధిషణ!
మరవకుండిన మాటలు మారిపోవె. ౨౬౯

క. ఉపధికి హేతువు లేదిట
నపకీర్తియు గలుగుదాన నతిహేయమెయా
ఉపధి యశక్తుల కగుసుమి
శపథము నే దప్పజాల శక్తుడనౌటన్. ౨౭౦

క. మనకిద్దర కీకల్పము
మనమున మన్నించదగును మహితంబగుటన్
మనమే ధర్మము విడచిన
జను డెవ్వడు ధర్మమందు జనునో చెపుమా. ౨౭౧

క. భరతుడ! నిను నేనెఱుగనె,
గురుభక్తుడ వీవుగావె కూర్మియు లేదే!
భరతా! భద్రము నీకగు
చరితార్థుడ! సత్యసంధ! సత్వగుణాఢ్యా! ౨౭౨

క. వనమున సమయము దీరిన
మనమలరగ పురముజేరి మహితమనీషా!

నినుగూడి రాజ్యమేలుదు
మనమప్పుడు సుఖమునొందె మనగల మనుజా ! —౨౭౩

సీ. జనని కోరెను వరముల జనకుడిచ్చె
నేను శపథము జేసితి నెనయ తోడ
మమ్ము ముగ్గుర సన్మతంపు మాటబడక
మసలవలె నీవు భక్తితో మాన్యులనుచు. —౨౭౪

క. మన జనని కైక పెండిలి
మనరాజ్యపు శుల్కముననె ఘనముగ నయ్యెన్
చనునే దానిని దాటగ
మనమున నద్దాని దలచి మహినేలు మికన్. —౨౭౫

క. ఘనుడౌ జనకుని వాక్యము
మన కెప్పుడు విడువదగదు మాన్యం బగుట
న్ననునే దానిని దాటగ
మనమున నద్దానిదలచి మహినేలు మికన్. —౨౭౬

క. విన, నౌధరించినాడవె
దినకరకుల రాముడాడి తిరిగె నటంచున్
జను లనుకొన వినగలమే!
మనమున నద్దాని దలచి మహినేలు మికన్. —౨౭౭

వ. అను రామచంద్ర ప్రతిపాదితవాక్యంబులు కర్ణశష్కులిం దగుల నమ్రుడై కరముల జోడించి సభాసదుల నంతర నవలోకించి యన్నా! కరుణాసాగర! రామచంద్రా! నీవిట్లు పలికిన నేనెట్లు ప్రతివచనదాన దక్షుడ నగుదును? ఈదీనుని, యీతమ్ముని యందుగల, కరుణ యేమయ్యె నామాటలు సత్యములని నీవు విశ్వసించలేదు. నేనసృత మాడుదునా? ఇది యేమి, కలియుగమా? కలియుగమునగూడ సత్యవాక్యులుండరా? బాల్యము నుండియు గలిగియున్న భ్రాతృవాత్సల్యమును మఱచితివా? ఇంతకుపూర్వ మెన్న డేని నాకోర్కెను రిత్తపరిచితివా? ఇప్పుడిది యేల యింతతీవ్రముగ ఖండితముగ మాటలాడెదవు? మనతండ్రి వృద్ధుడై వనితా

లోలుడై ధర్మ మరయలేక ననుచిత సంభాషణము జేసిన నీ వదియె ధర్మ మని పట్టిపల్లార్చెదవా ? అందించుకేని ధర్మలనంబు గలదా ? నా జనని వివాహకాలమున మనతండ్రి రాజ్యశుల్కం బిచ్చె నంటి వది యెట్లు ధర్మంబగును ? రాజ్య మవిభాజ్యము, వంశస్థిత సర్వజ్యేష్ఠపరిపాల్యము. దశరథ రాజేంద్రునకు పరిపాలనాధికారమెగాని యథేష్ట వినియోగార్హాధి కారము లేదుగదా! కేకయరాజుమాత్రము మహిషీపుత్రునకు రాజ్య మివ్వక తన పుత్రీపుత్రునకు రాజ్యమర్థించుట యెట్టి ధర్మము ? అట్లుధర్మ ముగ నర్థించిన దశరథుడు కామాతురుడై వల్లె యనినమాత్రమున నది ధర్మమెట్లగును ? "వివాహకాలే రతి సంప్రయోగే" యనునట్లు తన|కార్య నిర్వహణమున కవిచారితుడై యంగీకరించినను నది సూనృతవాక్యము కానేరదు. మనసున నిష్టములేక కార్యసాఫల్యమునకుగాను అంగీకరించి నటుల నభినయించె నదియునుగాక మఱియొక గొప్పయుక్తినిగూడ నుప యోగించినవాడు. అది నీశ్రుతిపథమున బడియుండకపోవచ్చును. మహా మేధావులగు వసిష్ఠ సుమంతులందు సమ్మతి నిచ్చిరి. అది వినుము. దశరథరాజు తనపుత్రునకు పట్టాభిషేక మొనర్ప బ్రయత్నించునపుడు కేకయు లెవరేని మీ యీకోరికను దెలియ బఱచితిరేని మీ దౌహిత్రునకు పట్టాభిషేక మొనర్పబడును. లేకుండిన మీకోర్కె నెఱ వేరదని దృఢముగ వక్కాణించిరి. దీని యాథార్థ్యమును యీవసిష్ఠ సుమంతుల నడుగుము. పిదప కేకయులు భవదీయ కల్యాణగుణగణ ప్రవాహమున మునిగి యావృత్తాంతమును మఱచిరి. అది మా తల్లికిని మంధరకును గూడ శ్రుతిపథమున లేనేలేదు. పట్టాభిషేకమని యెవరికిని దెలుపకనె మనరాజు పట్టాభిషేకప్రయత్నమును జేసెను. తెలిసికొన వలసిన బాధ్యత కేకయులదిగాన మన జనకుని కందు దోసము లేదు. మంధరోపదేశమున శంబరాసుర సంగరదత్త వరద్వయము ప్రకృతోప యోగ మయ్యెగాని యదియు ధర్మముగ జెల్లదగినదికాదు. దశరథుడు దనమంత్రులతో నాలోచించి గురునిసమ్మతిగొని మహాజనుల యను మతిని మహాసభలో సభికులకు వినిపించి భవదీయ పట్టాభిషేకమును జేతునని ప్రతిన యొనర్చె, నిను దీక్షితునిగ నియమించె. పుర

మంతయు నలంకరింపబడినది. పట్టాభిషేక సంభారములు సంపాదితము లైనవి. నీవు దీక్షితుడవైతి వపు డసూయాగ్రహాగ్రస్తయగు మంధర మజ్జననికి బహువిధముల బోధించి నందున ప్రథమమున నంగీకరించకున్నను మంథర మాయావాక్యములకు లొంగి శంబరసంగర సంప్రాప్త వరద్వయమును ప్రకృతము కోరిన రూపముగ యాచించినది. దాన నింతచేటు మూడినది. మహాసభలో సర్వజ్ఞుల సమ్ముఖమున ప్రతిన నొనర్చిన పట్టాభిషేకమును మానిపించుటకును ప్రథమ వాగ్దానమును వీడి ద్వితీయవాగ్దానమును నెరవేర్చుటకును కారణమేమి? వాగ్దత్తమైన రాజ్యమును తిరిగి యన్యుల కిచ్చుటకు దశరథ భూపాలునకు హక్కుగలదా? నీవు దానిని ధర్మమని నిలుపుటకు హేతుకల్పన జేతువా? అది ధర్మ మెట్లగును? నీవు బలవత్తరములని ప్రతిపాదించిన హేతువులు రెండును సద్ధేతుబలమున నపగతము లయినవి. ఇక నీ పట్టుదలనుండి నిన్ను మరలించగలవారు మాత్రము లేరు. నీవు స్వతంత్రుడవు. నేను పరతంత్రుడను, నేను నీ కెదురాడదగినవాడనుగాను. నీవే ధర్మమును బరికీలించి యీ దీనుని, యీ నిష్కపటసహోదరుని, యీ పాదసేవకుని కరుణాకటాక్షవీక్షణంబుల గనుగొనుము. కులధర్మము నవలంబించుము. నీ కిప్పటికి నయోధ్య కేతెంచుటకు సమ్మతము కాదేని మేమందరమును నీతోడిదే లోకమని నీతోడనే యరణ్యమున నుండెదము. నిర్వ్యాజభక్తులగువారు యింతకంటె చేయదగినది యేమి కలదు? మాటాడవేమి? నీ మనసున కరుణ యేల యుదయించదు? ఈ దీనుని కరుణించరాదా? మదపరాధము క్షంతవ్యముకాదా? నీవు స్వతంత్రుడవనియా? నీ కెదురాడువారు లేరనియా? నామాటకు సహాయ మొనర్చువారుకూడ లేరనియా? ఇంతమందిని మాటాడనివ్వకుండ జేయుశక్తి నీకు కలిగియున్నదనియా? న్యాయాధికారివగు నీకు నావంటి దుర్బలపక్షమువానియందు దయయుండుట ధర్మముకాదా? జనకుడు తన ప్రియావాక్యవాగురుల దగిలి నిన్నడవికి బొమ్మనియె. నీ వదియె ధర్మమని యంగీకరించితివి. సర్వజ్ఞ వసిష్ఠభగవాను డది ధర్మము కాదనలేక, యుపేక్షించె. నీ కెదురాడలేక ధర్మరక్షణ కడ్డుపడడాయె, నా ప్రియ

సోదరుడీ సౌమిత్రి నీకు సహాయపడి కుసుమకోమలి మహాపతివ్రతయగు
సీతామహాదేవినికూడ నడవికి దెచ్చుటకు సమ్మతించి తానుకూడ నిను
ననుసరించె. సుమంతుడు వృద్ధుడగుట మతిచెడి ధర్మమరయలేక నీకు
రథచోదకుడై నాకపకార మొనర్చె నిదియంతయు నా దుర్దైవమహిమ
కాకున్న హితకాంక్షులింద రిట్టి వ్యతిరేకభావము నేల వహింతురు?
నేనేమి చేయగలను? వీరందరును నీకు ధర్మము నుపదేశింతురనియు వీరిని
చూచియైన నీవు పురమునకే తెంతువనియు నమ్మి వీరల గొని తెచ్చితి.
ఇది యేమి చిత్రమో! నీకు దయబుట్టలేదు. వీరిలో నొకరును నోరెత్తి
మాటాడ నేరకున్నారు. వీరి వావదూకతయంతయు నేడేమియయ్యెనో?
ఇదియంతయు శ్రీరామచంద్ర వచోనైపుణ్య ప్రభావవిశేషముగాని
యన్యముకాదు. లేక నాదుర్దైవ మాయాశక్తి విజృంభణమైన గావలె
లేదా, భగవంతుడేదేని మహోద్దేశ్యము మనమున నిడుకొని యిట్టి
కార్యసంఘటనమును జేయుచునైన నుండవలెను. ఇదియంతయు జూడ
నేను మహామాయావిభ్రమమున బడిపోతిని. తుద మొదలు గాంచలేక
పోవుచుంటిని. నామాట వినువా రొకరునులేరు. ఎపుడును బలవంతుని
పక్షముననే లోకులందరుందురు. ఇది వాది దౌర్బల్యముగాని వాద
దౌర్బల్యముగాదు. నామాట చెల్లుటలేదు. నా ప్రియసోదరుడే నాముద్దు
చెల్లించుటలేదు. ఇతరుల ననసేల? దైవమునకే దయ తప్పినది.
దేవతుల్యులగు మునులకు దయ తప్పినది. విశ్వామిత్రునంతవానిని వశ
పరచుకొనిన వసిష్ఠభగవానునకె దయతప్పినది. అని పలుకు భరత
వాక్యముల విని యటనున్న వారందరును చిత్రప్రతిమలవలె కదలక
మెదలక యుండిరి. అపు డంతరిక్షమున నివసించి సోదరుల సంభాషణ
ముల వినుచున్న దేవతలును దేవమునులును భరతు నుద్దేశించి యో
భరతరాజా! మేము దివ్యులము. వీరు దివ్యమునులు. దశరథుడు ధన్యుడు.
పుత్రులగు మీరు నలుగురును ధర్మజ్ఞులు, సత్యసంధులు. మీ సంభాషణ
ములు మాకు సంతోషమును గలిగించినవి. నీవచనములు యుక్తములు.
నీవజేయ్యములగు నింద్రియముల జయించితివి. ఈషణములలో నుత్తమ

మైన ధనీషణమే నిన్నాకర్షించలేకపోయినది. పురుషుడు కామకారుడు కాడు. దైవోద్దిష్టానుసారముసర్వమును జరుగును. దైవమును ప్రతిఘటించి జయించువా డెవడును లేడు. రామునియందు నీకుగల భక్తి మెచ్చతగినది. అదియె నీకు సర్వశ్రేయముల నొసగును. దాని నెన్నడును విడువకుము. రామభద్రుడు నీ వాక్యముల వినలేదని నీవు విచారించకుము. రామవిపిన యాత్ర యవశ్యముగ కావలసియున్నది. దానిని మరలించుట కెవరికిని శక్యముకాదు. జీవిత శ్రమనొందక రామాజ్ఞాపదేశము నంగీకరింపుము. లోక కళ్యాణమునకు రామవిపినయాత్ర కారణము కాగలదు. మీ సోదరుల వంటివారితరు లెవరును లేరు. మీకు మీరే సాటి. నీవు సత్కులజాతుడవు, ధర్మజ్ఞుడవు. మాయందుగల గౌరవమున మావాక్యముల వినుము. భవితవ్యమును మార్చువా రెవరును లేరు. నీతండ్రిని సుఖాస్థితుని జేయ దలచితేని రాముని పితృఋణమునుండి విముక్తుని జేయదలచెదవేని మీ తండ్రి కైక కునృణుడై స్వర్గమున నివసించుట నీకిష్టమేని రామవిపిన యాత్ర నడుమకొనసాగ మెట్లైన జరుగుట నిశ్చయమగునపుడు నీవును సమ్మతించుట యుక్తముకదా యనిరా వాక్యముల విని రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు లేచి యదృశ్యులై యున్న దివ్యుల కభిముఖులై తత్కాలోచిత సపర్యల నొసర్చిరి. భరతుడు త్రస్తగాత్రుడై సజ్జమానములగు వాక్యముల కృతాంజలియై రాము నీక్షించి

గీ. రామ యిది యేమి చిత్రము రమ్యగుణుడ!
దివిజులనుగూడ దిద్దితే దివ్యధిషణ!
తమ్ము నిట్టుల జేయుటె ధర్మమయ్య?
కరుణయుంచుమ నాయందు కార్యవిదుడ!

క. మన కులమున గల ధర్మము
మనుకులుడవు నీవె విడువ మాన్యమ చెపుమా
ఘనుడవు జ్యేష్ఠుడ వాటను
కనికరమున రాజ్య మీవె గైకొనవయ్యా

వ. రామచంద్రా! నీవేదియో మాయాకల్పనజేసి, నన్ను మోహ పెట్టుచుంటివి. ఇది యేమిపాపము ? రాజధర్మము నేల యవలంబించవు? జ్యేష్ఠాభిషేకరూప - పరమధర్మ సంస్థాపన మేల సంస్థాపించవు ? మిగుల పశ్చాత్తాపమునొందుచున్న మనతల్లి కైకనుగనుగొనుము. ఆమెకోరికను దీర్చుము. దీనురాలగు కౌసల్యామహాదేవులకరుణించుము. నే నశక్తుడను. నన్ను పాలనకర్మమున నియోగింపకుము. దాస్యకర్మల విధుమింపుము. బాల్యమునుండియు భవద్దాస్యమున నాకుగల యభిరుచి నీవెరుగనిదియా! ప్రజలందరును కర్షకులు పర్జన్యునివలె నిన్ను రాజుగ గోరుచున్నవారు. లోకమును పాలింపుము. నా మనంబు చెడినది. కర్తవ్యమేమియు దోచుటలేదు. శరీరము కంపము నొందముచున్నది. భీతియు, శోకము నన్నావరించినవి యని రాముని పాదములబడి లేవకున్న భరతు నీక్షించి శ్రీరామచంద్రు డతని యోగ్యతకు సవినయవాక్యములకు మెచ్చి దయార్ద్రహృదయుడై యానంద బాష్పములు గన్నుల గ్రాల బాహుల భరతు నాలింగన మొనర్చి యంకమున జేర్చి, నాయనా!... తమ్ముడా! నవనీరద ఘనశ్యామ! అని పిలచి నీవు నామాటల వినుము... నా యందు గౌరవముంచుము. నా వాక్యమున కెదురాడకుము. నీవు సర్వసమర్థుడవు, మంత్రులు సుహృత్తములు సర్వకార్యధురీణులు. వీరి సహాయమున ధరణి బాలింపుము. పదునాలుగు వత్సరములు పదునాలుగు గడియలవలె వెడలబుచ్చి శీఘ్రముగ నేనయోధ్య కేతెంచి నీ భుజమునుండి నాభుజమునకు మేదినిని గ్రాబట్టుకొనెదను. అంతవఱకు నాయాజ్ఞను నిర్వర్తించుము. మారు పలుకకుము. చంద్రిక చంద్రు నెడబాసినను హిమము హిమవంతుని విడిచినను సాగరము వేల నతిక్రమించినను భానుడు పశ్చిమమున నుదయించినను, నేను జేసిన ప్రతిజ్ఞయెన్నడును మారదు. రాముడు మాటాడువాడు గాడు... తల్లి యెట్లు కోరినను తండ్రి యెట్లనుమతించినను వారివాక్యము లనువర్తనీయములు. వారు సర్వావస్థల బూజ్యులు. నీవు సత్వరముగ, పురమునకు బొమ్ము. రాజ్యము నేలుము. పదునాలుగు సమము లెట్లనో సహింపుము. నీవు నన్ను విడువలేక యెంత వ్యథపడుచుంటివో నేనును నిను విడుచుట

కట్టిపీడ నొందుచుంటిని. ఏమి చేయగలము ? విధి చైద మిటుల నున్నది. మనకది యెటుల దప్పును? "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ" మనువాక్యము నీ వెఱుగనిదియా యని పలికె నపుడు రామ స్పృశ్నకు సమాధానము జెప్పుటకు బ్రయత్నించు భరతుని బిలిచి వసిష్ఠమహాముని భరతుని కర్ణమున మాత్రము వినబడునట్టుల నేదియో నచించి హేమరత్నభూషితములగు పాదుకల నొసంగె, భరతు డప్పుడు రామ విభునకు నమస్కరించి మహారాజా ! నీవు స్వతంత్రుడవు, నేను పరతంత్రుడను. నీవు నాకు సర్వవిధరక్షకుడవు, నేను నీకు రక్ష్యుడను. భవదాజ్ఞా కైంకర్యకరుడను. నాయాత్మ భవదధీనమైనది. ధర్మమని నీ కెదురతట్టె వాదించితిని, క్షమింపుము. పరతంత్రుని ధర్మమది కాదని తెలిసియు, నీ వియోగమును సహించలేక నింతదనుక నీ తోడ ప్రసంగించితిని. నేను నీ కుపకరణప్రాయుడను. ధరణిని నేను పాలించినను నీ యుపకరణము భూమిని పాలించినటులనె గాన నన్ననుగ్రహించి నాకు స్వాతంత్ర్య మనునది లేకుండునటుల ననుగ్రహింపుము. ఈ దీనుని వాక్యంబుల మన్నింపుము. ఈపాటి మాటనైన చెల్లించుము. హేమరత్నభూషితములగు నీ పాదుకల నధిరోహించి నా కొసంగుము. ఇవియె సర్వలోక యోగక్షేమావహము లివియె యయోధ్యా సింహాసనమున వసించి రఘురాజ్యము నంతయు బాలించగలవు. నేను భవత్సన్నిధి నున్నయటుల తత్సన్నిధిని వసించి వసిష్ఠాదుల యాజ్ఞ చెల్లించెదనని విన్నవించిన, కరుణామయ హృదయుడగు శ్రీరామ భూపాలుడు భరతుని ప్రతివాక్యమునకును మిగుల హర్షించి, మన్నించి, మెచ్చి పాదుకల నధిరోహించి విడిచె, సాత్వికాగ్రేసరుడగు భరతుడు సత్వరంబుగ పాదుకల గైకొని శిరంబున దాల్చి నమస్కరించి వినయంబున రాము నవలోకించి

మ. వినుమా రామనృపాల నా మనవి నీ విశ్వంబు పాలింపగా
ఘనమౌ పాదుక లర్కవంశవిలస త్కాకుత్థ్స పీఠంబునన్
ననయంబొప్పగ నిల్పి భూమిగత రాజద్రాజకార్యంబుల
న్ననిపింతు న్గురుముఖ్యు లాతగవుల న్వేదీర్చు రుత్సాహులై. ఇటం

మ. పదునాల్గేడులు నేను భూసురులు భూపాలోత్తము ల్బంధువు
ల్సదుపాయంబుగ కార్యము ల్జరుపుచు న్సంపత్తులం బెంచుచు
న్మదమావంతయులేక మౌనివలెనే ముప్పొద్దుల న్మ్రొగ్గుచు
న్సదనంబు న్విడనాడి పల్లెనిలుతు న్శాకంబుల న్మెక్కుచున్. ౨౮౧

క. నారల జడలను దాల్చెద
కోరను నే సుఖము నెపుడు కోపము విడతున్
వారక భూమిని బండెద
కోరెద నీ రాక నేను కువలయనాథా! ౨౮౨

వ. మహాత్మా! రామచంద్రా! నీవు శపథం బొనర్చిన పదునాలుగు సమంబులు పూర్ణంబులైనపిదప మరునాటి పగటియందు నీ దర్శనంబు గాదేని నిజముగ నే నగ్నిం బడియెద, నిది నిశ్చయంబు. సమయాబ్దంబులు లెక్కించుచు భవదధీనమనస్కుడనై నిరంతర భవన్నామ సంకీర్తనపరుండనై యుండెద ననిన రామచంద్రుండు ప్రహృష్ట మనంబున నల్లెయని చతుర్దశాబ్దంబులు నిండినఃకోడనె తప్పక మరునాటి పగటియందు నీకు దర్శనం బిచ్చెద. నీవు సమ్మతింపుము. నీ మాట వినలేదనుకొనకుము. నేనెక్కడనున్నను నా హృదయంబున నీ మూర్తి నిలచియుండును. ఇది వియోగ కాలముగాన విడువవలసి వచ్చిన దని పలికి భరతు నాలింగన మొనర్చి తనకు మ్రొక్కిన శత్రుఘ్ను కౌగిలించి యాదరించి భరతు నవలోకించి

క. భరతా! విను నా వాక్యము
పరమార్థము బలుకువాడ పరహితపరుడా!
సరిగా కైకను జూడుము
మదవుము రోషంబు తల్లి మాన్యయగు సుమీ. ౨౮౩

క. ఇది మరువకు జనకజతో
కుదురుగ నా తోడవట్టు గూర్చితి సుమ్మా
తుది వాక్యము సుమ్మిది యని
గాఢగాని బాష్పంబు గనుల గురియగ జనియెన్. ౨౮౪

క. ఆ పాదుకలన్ భరతుం
డేపుగ దనశిరమునుండి యేర్పడగొనుచు
న్గోపాలు డెక్కు గజమును
నేపారిన భక్తినుంచి యేగగ దలచెన్. ౨౮౫

వ. అంత శ్రీరాముడు తల్లులను తమ్ములను గురువులను బంధువులను మంత్రులను గుహుని ప్రజలను గౌరవించి, స్వధర్మమున హిమవంతుని వలె స్థిరుడై వర్తించె. తల్లులు బాష్పగృహీతనయనలై రాముని గాంచలేక తలలు వంచిరి. రాముడు తల్లులకు, గురువులకు, పూజ్యులగు నందరికి వందనము లర్పించి యన్యుల యథార్హముగ మన్నించి స్వకుటిని ప్రవేశించె. భరతుడు శత్రుంజయ నాగశిరంబున నున్న శ్రీరామపాదుకల గొని దనశిరమున నిడుకొని తమ్ముడు చామరమును వీచుచుండ పాదుకాప్రాప్తివలన స్వాతంత్ర్యభీతి లేక పారతంత్ర్యము సిద్ధించినందుకు హర్షపరవశుడై తదుపాయమును బోధించి పాదుకల నిప్పించి తన్ననుగ్రహించిన గురువర్యులకు బహుసహస్ర వాదనంబులు సమర్పించి రథము నధిరోహించె, వసిష్ఠ వామదేవజాబాలి ప్రభృతి మునిపుంగవులు మంత్రి సామంతాదులు గుహుడు, సకలప్రజలు రామానుమతిని బొంది స్వస్వవాహనంబుల నధిరోహించి చనుచుండిరి. అంత కొంతదవ్వేగి మందాకినికిని చిత్రకూటమునకు ప్రదక్షిణ మొనర్చి ప్రాఙ్ముఖులై చని భరద్వాజాశ్రమసమీపమున సేనల నాపి భరతుడు రథమును దిగి పాదుకల శిరంబున దాల్చి భారద్వాజుంగని నమస్కరించె. భరద్వాజుడు భరత నృపా! నీవు చేయగలనంతయుచేసితివి. రాముని భక్త్యతిశయమున సేవించితివి. దివ్యులుగూడ నీ యోగ్యతకు మెచ్చిరి. నీ వేమి జేసెదవు? భవితవ్య మెవ్వరికిని యలంఘ్య మనియె. భరతుడు ! మహానుభావ ! సర్వజ్ఞ ! నే నెన్నియో విధముల బ్రార్థించితి. స్థిరప్రతిజ్ఞు డగు రామనృపతి పురగమనమున కంగీకరించనివాడయ్యె. వసిష్ఠానుమతిని పాదుకల నొసగెనవియె యివి యని పలుకు భరతునిగని భరద్వాజుడు భరతరాజా ! నీ జ్యేష్ఠానువర్తనము నిష్కళంక భక్త్యుపష్టంభకమగుట శ్రేష్ఠమయినది. పల్లమునకు నీరు పోవునటుల నీవు రాముని సహజంబుగ సంశ్రయించితివి.

సర్వము నీకు రక్షకుడగు రాముడేయని తలచితివి. ఇంత దృఢాధ్యవసాయము, తపస్సఫలమగు మాకును లేదనిన నతిశయోక్తి కానేరదు. దృఢమైన భావన ఫలము నిచ్చునుగాని యెన్నటికిని చెరుపుకలుగదు. నీకు రాముడె దైవము. దైవమని దృఢముగ నెవనిని దేనిని భావించినను వానికి దేవుడు ఫలసిద్ధిని గూర్చగలడు. ఇది నిస్సంశయ మనియె నంత భరతుడు భరద్వాజానుమతి నొంది యమునను గంగను దాటి శృంగిబేరపురమున గుహుని సాదరముగ నిలిపి సింహవర్జితమగు గుహవలె కాంతిహీనమగు దశరథవర్జితాయోధ్యాపురమును జేరి మిగుల దుఃఖించి తల్లుల నంతఃపురకాంతల నట నిలిపి గురువుల గనుగొని నేను నంది గ్రామమున నేగుచుంటిని. మీరంద రటకు విచ్చేయుడు. నందిగ్రామముననుండి దుఃఖము నపనయించెద ననవిని వసిష్ఠాదిమంత్రు లందరును భరతు ననుసరించి రంత

క. భరతుడు రాముని దలచుచు
పరమార్థ వచోవిలాస భాసురమతియై
వరరథమున తమ్మునితో
కరితురగ రథాది వీరగణములతోడన్. ౨౮౫

క. జని నందిగ్రామంబును
గని గురువుల బుధుల జూచి కరుణను బలికెన్
ఘన రాజ్యభార మంతయు
మును రాముని పాదుకలకు సముద్రిత మగుటన్. ౨౮౬

గీ. తనకు ప్రతినిధియని యిచ్చె తనదు పాదు
కలను రాముడు వసుమతి గాచనవియె
సకల భూలోక పాలన సంస్థలెల్ల
పర్యవేక్షించి దెలిపెద పాదుకలకు. ౨౮౭

క॥ రఘోత్తమా క్షేమావహాములు
యోగీశ్వర హృదయగమ్య యోగావహముల్

భోగానంద ప్రదములు
సాగరవృత ధరణి నేల జాలిన మహిమల్. —౨౮౮

గీ. శక్తి గలవాడు జానకీజానిగాన
శక్తమైయుండు సంబంధి సకల పదము
గాన పాదుక లిలనెల్ల గావగలవు
దాసుడను నేను తత్సేవ ధన్యతముడ. —౨౮౯

సీ. తనకు ప్రతినిధిగ దయచేసెగావున పాదుకలనె రామభద్రుగాగ
భావించిసేవింతు భక్తిని యెప్పుడు భావన ఫలమిచ్చు భక్తియున్న
సర్వంసహాచక్ర సకలభారము నెల్ల బూనగ గలవివి భూరిశక్తి
ప్రకృతి మండలమంత ప్రహసితమగుచుండ జయజయ ధ్వానము
లెలగుచుండ

గీ. రామపాదుకలకు నేడు రమ్యరాజ్య
భద్రపట్టాభిషేకంబు భవ్యముగను
రామ పట్టాభిషేకార్థ రమ్య వస్తు
వితతి వెచ్చించి చేయుడు వేగమీరు. —౨౯౦

వ. అని భరతుండు వక్కాణించిన పలుకులు విని సకల సామంత సచివాది బంధు పురోహిత మంత్రిముఖ్యు లందరు మిగుల సంతసించిరి. అంత వసిష్ఠానుమతంబున వామదేవ జాబాలి ప్రభృతి మునిపుంగవులు సుముహూర్తమున దివ్యమణిఖచిత రమ్యసింహాసనంబున శ్రీరామచంద్ర శ్రీ పాదుకలనుంచి సవితృవంశమర్యాదల ననుసరించి పాదుకా పట్టాభిషేకంబు విధివిధానంబునజరిపిరి. భరతుండు ఛత్రంబుబట్టె. శత్రుఘ్నుడు చామరంబువీచె. ప్రకృతిమండలమంతయు సంస్తుతించె. మంత్రులందరు రాజ్యపాలనరూప కార్యభారనిమగ్నులై భరతునిగూడి శ్రీ రామచంద్ర పాదుకాయుగళంబునకు రాజ్యతంత్రంబులనెల్లవినిపించుచు సవిమర్శంబుగ న్యాయధర్మంబుల కర్హంబుగ కార్యతంత్రంబుల నడుపుచుండిరి. భరతుం డును నిరంతర రామనామ జప పరాయణుండై యుండె.

క. విరచిత సాగర సేతూ
పరిచారిత వానరాచ్ఛ భల్లూకేశా!
పురవైరి చాపఖండన!
పరిమర్దిత దైత్యవార భాస్కరవంశా. ౨౯౧

క. కాలాంబుదనిభ గాత్రా!
హేలాజిత దైత్యనికర హిమవద్ధైర్యా!
సురనుత మునినుత రాఘవ!
పురహారనుత భూరితేజ భూరిగుణాఢ్యా. ౨౯౨

క. కాలాత్మక వేదాత్మక!
లీలాలోలాఖిలాండ లీలావాసా!
హేలాధృత నరవేషా!
భూలోకత్రాణ శౌండభూజావినుతా. ౨౯౩

మాలినీ. సురముని నుతచర్యా సూదితారాతివర్యా!
పురహారనుతవీర్యా! భూమిజాహృద్యవిద్యా!
పరిహృతఖరశౌర్యా! భక్తసంత్రాణధుర్యా!
సురుచిరనుతకార్యా! సూర్యవంశాతి హృద్యా. ౨౯౪

ఉ. భాసుర సర్వసద్గుణిని భవ్యతపోవిభవాభిరామునిన్
భూసురముఖ్య పూజితుని పుత్రజితాఖిల పండితోత్తము
న్దోసములెల్ల బోవుటకు దోసిలియొగ్గి నుతింతు భక్తితో
న్భాసురవంశ వర్ధనుని భవ్యసుబోధుని యజ్ఞమూర్తినిన్. ౨౯౫

శా. లోకాతీత గుణాభిరాముడు రమాలోలుండు రామప్రభుం
డీ కళ్యాణకృతీశ్వరుం డజముఖాభీష్టార్థదుండాఢ్యుడు
శ్రీకళ్యాణసుఖంబు లిచ్చి మనుచు న్చేతోముదంబొప్పగా
నీ కావ్యంబు రవీందు తారకలతో నింపొందు భద్రంబుగన్. ౨౯౬

మ. ఇది రామానుజయోగి రాజ కథితాధీష్టార్థతత్త్వజ్ఞతా
పదవిభ్రాజితు యజ్ఞమూర్తిని మదిన్భావించి స్వీయాన్వయున్
ముదమొప్పారగ రాముతమ్మునికథ న్మ్రోచాఫలాభంబుగా
సదయుల్మెచ్చ వచించె నాల్గవది యాశ్వాసంబు రామప్రభో. ౨౯౭

గ ద్య

ఇది భగవద్రామానుజ కరుణాకటాక్షపాత్ర యజ్ఞార్యపవిత్ర వంశ్య
చతుస్సప్తతి పీఠాంతర్గత తదీయపీఠస్థిత భారద్వాజస గోత్ర
పవిత్ర తిరుమలై యచ్చాన్ కాండూరు రాఘవాచార్య
దేశిక వేంకటాంబా పుత్ర విబుధజనవినయ చర్య
వేంకట తిరుమలాచార్య ప్రణీతంబగు
భరతచరిత్రంబను మహాప్రబంధంబు
నందు చతుర్థాశ్వాసము
సంపూర్ణము.

శు భం భూ యా త్

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

---

శ్రీ రా మ శు భ మ స్తు

# భ ర త చ రి త్ర

## ప ం చ మా శ్వా స ము

క. శ్రీకర ! సుగుణాకర ! ముని
లోకప్రియ ! దానరక్ష ! లోకాధీశా !
భీకర దనుజాంతక ! సుర
లోకాధిపసేవ్యపాద ! లోకాధారా. ౧

క. పరిపూర్ణవిష్ణువిగ్రహా !
పరిరక్షితభానుపుత్ర ! భాస్కరవంశ్యా !
పరహితకార్యాచరణా !
పరిపాలితమానిబృంద ! పావనచరితా ! ౨

వ. అవధరింపుము. భరతరాజు శ్రీరామ పాదుకలను శ్రీరామచంద్రునిగ భావించి సర్వకాల సర్వావస్థోచిత సకలకైంకర్యంబుల నెఱపుచు తైలధారావచ్ఛిన్న శ్రీరామధ్యాన స్మృతిసంధాన సంధుక్షిత సకల వ్యవహారుండై వశిష్ట వాలఖిల్య వామదేవ జాబాలిప్రభృతి మహర్షి ప్రబోధిత హితవాక్యంబుల కలయుచు, హేయంబులగు వైషయిక సుఖంబుల నెల్ల విడిచి ప్రతిదినమును వన్యంబులగు నీర పర్ణ శాక ఫలముల రామపాదుకాయుగళ నివేదితావిశేషంబుల నత్యల్పంబులుగ నేకవారంబు భుజించుచు రామవనవాసపూర్తిని రామసందర్శనంబును కాంక్షించుచు రామనామానుసంధాన సతతస్ఫురితాధరుండై కౌశిక మహర్షి ప్రబోధిత రామశబ్దార్థ విశేషతత్వ నిధ్యానసన్నద్ధ సర్వావయవ పులకాంకితుండై భగవద్వశిష్టమహర్షి ప్రతిపాదిత భగవచ్ఛ్రీరామమహిత మహిమాభివర్ణనంబున కన్వహంబును సంతోషించుచు రామేతరంబెల్ల [illegible]

సీ. అఖిలభూతంబుల ననుజన్ములట్టుల దనమదిలోపల దలచువాడు
పరభామలనుగని భక్తిమై మాతృత్వభావంబుబఱగించు భక్తిపరుడు
విషయవాంఛలనెల్ల విడువనేర్చినవాడు సతతసద్భావిత సద్గుణుండు
జడలనారలగట్టి జడదారులనుగొల్చి జడుభంగి కాలంబు గడుపువాడు

గీ. సతత భావిత సద్ధర్మసరణివాడు
రామ రూపంబు గనులకురక్తిదోప
నన్యమేమియు గనకుండు హర్షవశత
పాదుకాన్యస్త భారుండు భరతరాజు. ౩

సీ. ఆకారవిద్యల నధికసంపదలను చెందియు గర్వంబు జెందబోడు
బహువిధవిషయసంబద్ధుడైయుండియు నింద్రియలోలత నెఱుగబోడు
కాంతయురాజ్యంబు గలిగినవాడయ్యు కాంక్షను లేశంబుగాంచబోడు
సకలార్థచయముల సంపూర్ణుడైయుండి తనమదినొకదాని దలపబోడు

గీ. వినును రాముని పలుకులు వీనులలర
గనును రాముని రూపంబు గన్నులెపుడు
మనసు రామునియందున మఱగియుండు
చేతు లెప్పుడు పాదుకాసేవ జేయు. ౪

గీ. సకల సద్గుణతతి యెల్ల సర్వవిభుని
జేరియుండెడి విధమున జేరి భరతు
వీడ నెప్పుడు వివిధార్థవిదులు మిగుల
బ్రస్తుతింతురు పరిపూర్ణ భక్తుడనుచు. ౫

సీ. శ్రీరామచంద్రుడు చేరినయట్లైన చెప్పెడిమనవులు చెవినిబడవు
ప్రియుడైనరాముడు పిలిచినయట్లైన ప్రియులనైనను ప్రేమబిలువబోడు
భాస్కరరాముడు భాషించినట్లైన పలుకడు పిలిచిన పరమమునులు.
కాకుత్స్థరాముని గనుగొన్నవిధమైన గనడన్యమేమియు గనులతోడ

గీ. రామపాదాబ్జ సంస్తుతి రక్తి దవిలి
నిత్యనిర్మల పరిపూర్ణ నిరుపమాన

హార్షవశమున సర్వంబు నఱయ మఱచు
భరతు డెప్పుడు రఘురామభక్తినుంట. ౬

గీ. వినయ భయ భక్తి విద్యా వివేక మహిత
పరమ హర్షానుసంభూత బాష్పసలిల
మిళిత పులకితదేహుఁడు మిత్రకులుఁడు
సతత భావిత కాకుత్థ్సనుతియుతుండు. ౭

వ. ఇట్లు పరమ భాగవతాగ్రేసరుడగు భరతుఁడు శ్రీరామచంద్ర చరణారవింద సేవాసమాసాదిత దివ్యజ్ఞానాన్వితుడై దన చిత్తం బన్యాయత్తంబుగానివ్వక స్వాయత్తంబు బొనరించుకొనుచు నప్రమత్తుడై సంసారసాగర నిమగ్నుడుగాక రామనిధాన దర్శనజనితానందవశమున నుబ్బితబ్బిబ్బులాడుచు బుధవరవిధేయుండును మహాభాగధేయుండును సతత రాముపాదుకాయుగళ విన్యస్త నయనయుగళుడై యనవరతంబు రామ రఘురామ శ్రీరామ సీతాపతే శ్రితజనావన తారకనామ దశరథరామ రామచంద్ర రామభద్ర యనుచు కాలంబు బుచ్చుచు మహాజనుల నొకదినంబున నీక్షించి

సీ. కాకుత్థ్సనర్చించు కరములుకరములు శ్రీరామునీక్షించు జిహ్వాజిహ్వ
సురనుడుగనుగొను చూడ్కులుచూడ్కులు శ్రీరామునకు మ్రొక్కు శిరముశిరము
విశ్వేశువినియెడి వీనులువీనులు మారాముదలచెడి మనసుమనసు
భాస్కరకులుజేరు పదములుపదములు పరమాత్మునెంచెడిప్రజ్ఞప్రజ్ఞ

గీ. దీనపోషకు చింతించు దినముదినము
సవితృవంశ్యుని దెలిపెడి చదువుచదువు
కోసలేశుని కోరెడి కోర్కెకోర్కె
దశరథాత్మజు డుండెడి ధరణిధరణి. ౮

సీ. కాకుత్థ్సగొలువని కాయంబుకాయమే క్రీడకై రబ్బరు కీలుబొమ్మ
శ్రీరామునతిలేని శీర్షంబుశీర్షమే పొగరుదిష్టికిబెట్టు బొమ్మశిరము

జగదీశుచేరని చరణంబుచరణమే చారువినిర్మిత చర్మ భస్త్రి
కమలాప్తవంశ్యుని గనలేనికనుగవ కఠినంపుగోడల గలుగుకలుగు

గీ. కరము లారాము పదసేవకములు గాక
తెడ్డబోలును విశ్వేశు దివ్యకథల
విననిపీనులు చెట్టుల వింతతొఱ్ఱ
లధిపు దెలియని మానస మంధతమము. ౯

సీ. మందారమకరంద మాధుర్య మధికమె రామపదామృతరసముకంటె
కామగవీక్షీర క్రమతయధికమే రామ పదామృత రసముకంటె
పుండ్రేక్షురస పరిపూర్ణత యధికమే రామపదామృత రసముకంటె
మాధ్వీకమృద్వీక మాధుర్యమెక్కుడె రామపదామృత రసముకంటె

గీ. జిహ్వ కింపగు రుచులచే జెలగుచున్న
నవ్య పరిపక్వ సహకార భవ్య నారి
కేళముఖఫలముల నెల్ల గేలిసేయ
దగిన దీరామనామంబు ధన్యులార. ౧౦

వ. అని భక్తిపరవశుడై పలుకుచు సభాసదుల నవలోకించి మహాత్ములార మీరందరును

సీ. సీతాపతేయని శ్రితవరదాయని పరమదయాసిధు పరమపురుష
భక్తప్రియాయని భవభయహరయని మానాథ లోకేశ మాననీయ
సకలరక్షకయని సత్యరక్షకయని లోకైకవీర భూలోకనాథ
సర్వాంతరావాస సర్వేశయనుచును సుజనరక్షణదక్ష సూరివినుత

గీ. రామ రఘురామ దశరథరామ యనుచు
కమలదళనేత్ర కాకుత్స్థ కమలనాభ !
మహిత మనుమార్గమహిమాఢ్య ! మాన్యచరిత !
యనుచు బ్రస్తుతిసేయుడీ యహరహంబు. ౧౧

గీ. జయము గాంచును జానకీజాని యెపుడు
జయము గాంచును రఘుకుల పాలకుండు

జయము గాంచును రఘురామచంద్రమనుడు
జయము గాంచుత రక్షిత సజ్జనుండు. ౧౨

గీ. శిరముతో మ్రొక్కి యాచింతు చేతులెత్తి
భవ్య భవదీయ రమణీయ పాదయుగము
భవభవంబుల మఱువక భక్తి గొలుచు
పదవి దయసేయుమో యయ్య భానువంశ్య. ౧౩

గీ. ద్వంద్వకముల గలుగు బాధల దఱుము మనుచు
జన్మశతకృత పాపోర్ధసకల నరక
బాధలన్నియు వేగమే బాపు మనుచు
నాగగోచర సంతోష వసతులైన. ౧౪

గీ. వనితలను పొంది సుఖపడవలయు ననుచు
వందన మొనర్ప నీ పదద్వంద్వమునకు
ఫలము లేశము గోరక భవభవముల
గొలుతు నిన్నెప్డు మనమున కోసలేశ. ౧౫

సీ. స్వర్గకవాటంబు జక్కగ దెఱచెడి ధర్మంబు జేయగ దలపు లేదు
సకలార్థచయముల సమకూర్చగాజాలు విత్తంబునకు నేను వేడ్కబడను
సంతోషములకెల్ల సన్నిధులైనట్టి యబలలఁబొందున కాసపడను
పూర్వపుజన్మల బూనికజేసిన కర్మార్హ ఫలములు గలుగుగాక

గీ. నాకమందైన భూమిని నరకమునను
వాసమబ్బిన నబ్జినీ వారిజాక్ష !
శారదాబ్జాభ ! తావక చరణ యుగము
మరణముననైన దలచెద మఱచిపోక. ౧౬

గీ. భవ్య భవదీయ పాదాబ్జ పంజరమున
నేడె మచ్చిత్తహంసంబు నిలచుగాక
కఫముఖాక్రాంతగళుడనై కష్టపడుచు
చచ్చునప్పుడు స్మరణంబు సాగుటెట్లు. ౧౭

గీ. సంతతము గొల్తు రాముని సత్యరతుని
దశరథాత్మజు మునినుతు ధర్మనిరతు
వికసితాంబుజవదనుని విశ్వవినుతు
పరమపదవాసు భవనుదు భవ్యగుణుని. ౧౮

సీ. కరచరణంబులుకమలంబులైయొప్పమహితనేత్రయుగమ్ము మత్స్యములుగ
అతిదీర్ఘబాహువు లలలుగాగనుగ్రాల మిక్కిలిలోతౌచు మెఱయుచున్న
రఘురామరూపంపు రమణీయసరసిని హాయినికాంక్షించి హర్షవశత
నవగాహనముజేసి నధిక తేజోమయ జలపానమునుజేసి చతురముగను

గీ. సృష్టిమొదలుగ జఱిగిన సృష్టధీయద
బహుళభవ మరుభూముల బాధపడిన
తృష్ణయంతయు శమియింప తృప్తినొంది
భద్రముల నేడు గనుగొంటి భాగ్యముననుు. ౧౯

క. సరసిజ నయనుని రాముని
వరపద వనజాతసుధను వదలక ద్రావన్
పరహిత సుఖములు కలుగును
వరకాంక్షను చిత్తభృంగ్రవాలు ముదానన్. ౨౦

గీ. చిత్తమా రాము పరమాత్మ చిత్రచరితు
మానసండగ గొలువుము మహితభక్తి
రామచింతన యనునట్టు రమ్యసుధయె
నిత్యసుఖముల సమకూర్చు నీకు నెపుడు. ౨౧

చ. భయమును బొందకే మనస భావిని గల్గెడి యామ్యయాతనల్
భయదముకా నటంచు నిను పాపములేమియు జేయలేవు నీ
భయమునుబాపు రాఘవుడు భక్తిని గొల్వుము లోకకోటిలోన్
సమముగ గావ నేర్పుగల నాథుడు గాచును నిన్ను సత్కృపన్. ౨౨

సీ. భవసాగరంబున బడియున్నవారికి ద్వంద్వవాతాహత ధ్వస్తులకును
జాయాసుతాదుల జక్కగబోషింప బాధలబడియెడి బాబులకును

విషమంబులైయున్న విషయతోయంబులమునిగిలేవగలేనిమూర్ఖులకును
దమరెట్టివారలో తమరెట్టులుండిరో తెలియగలేనట్టి దేబెలకును

గీ. గలుగగలదొకో కాంక్షిత కల్పతరువు
సకలభయముల వేగమె సాగదోలి
నిత్యసుఖముల నొసగంగ నిపుణతమము
రామపోతము బహువిశ్వరమ్యవహము. ౨౩

చ. మనమ! భవాబ్ధి దుస్తరము మానుగ దాటగలే నటంచు నీ
వనయము భీతినొంద దగ దంబుజనాభుని రామచంద్రుని
న్ఘనముగ భక్తిగొల్చి తది గట్టిగ జక్కని తెప్పయౌచు ని
న్ననువుగ దాటజేయు నిది యవ్యయమార్గము నమ్మువారికిన్. ౨౪

సీ. మదనవాతాహత మహితోద్ధితంబులై మోహోర్మిమాలికల్ మొనయుచుండ
తనవశంబుననుంచి దారుణగతిద్రిప్ప దారయె సుడియౌచుదనరుచుండ
తనయులు తమ్ములుతండ్రులుతల్లులు గ్రాహంబులైయొప్పి గ్రాలుచుండ
నాశామహాతోయహారియై యలరారు సంసారమను మహాసాగరమున

గీ. మునిగియున్నట్టి వీనికి ముదముతోడ
విమల భవదీయ పాదారవిందయుగ్మ
భక్తి యనునావ దయచేసి భద్రములను
తనరజేయుము దశరథ తనయ రామ ! ౨౫

సీ. కన్నెత్తికనలేను క్షణమైన సీతేశు పాదాబ్జములయందు భక్తిలేని
పాపాత్ములను, నేను బలుకరించగబోను రామయనగలేని రక్కసులను
వీనుల వినబోను వినదగు రఘురాము కథలులేశములేనికావ్యములను
దలపగజాలను దశరథాత్మజుదిట్టు దనుజాంశభవులైన ధరణిపతుల

గీ. సకల కళ్యాణ గుణగణ సహితు హేయ
గుణగణరహితు కంజాక్షు కువలయేశు
భూమిజాప్రాణనాయకు భూరితేజు
జన్మశతముల సత్పూజ సలుపగలను. ౨౬

సీ. ఓ జిహ్వ రామునియోపిక నీవెప్డు కొనియాడుచుండుము కోర్కెదీరు
ఓ చిత్తమా రామునోపికతో నీవు భజియించుచుండుము భద్రమబ్బు
ఓ పాణియుగ్మమ యోపికతో నీవు పూజించుచుండుము పుణ్యమొదవు
ఓఘ్రాణ మూర్కొను మోపికతో నీవు రాముని పాదాబ్జ రమ్యతులసి

గీ. నవ్యభక్తినిగాంచుము నయన రాము
రమ్యపాదమ నడువుము రాముదరికి
మూర్ధ మ్రొక్కుము రాముని ముదముగలుగు
శ్రోత రాముని చరితంపు సొంపువినుము. ౨౭

సీ. లోకులు మీరెల్ల లోలత విడనాడి వినుడుచెప్పెడిమాటవిసుగుకొనక
జనన మరణరోగశమనము దివ్యము మునికధనంబుల ముఖ్యతమము
లోపల వెలుగొందులోతు దెలియనేరమేకమమృతమునై యేపుమిగులు
రామాభిధానము రమ్యము శుద్ధము పరమౌషధంబిది భక్తిలభ్య

గీ. మన్యదుర్లభ మర్కాన్వయాకరంబు
నిత్యముక్తాది సేవ్యము నిరుపమాన
మవ్యయానందమోక్షద మఖిలహితము
పానమును జేయగడగుడు భవ్యులార ! ౨౮

సీ. జనులార హితమునుచయ్యనవినుడయ్య సంక్షేపముగ జెప్పజాలువాడ
వితధవిపక్షించి విస్తృత సంసార సాగర పతితులై చావ నేల
నఖిలవిధములైన యజ్ఞానములపేడి ప్రణవసంయుక్తమై ప్రబలుదాని
రామాయనమయనురమణీయమంత్రంబుమనసున నెప్పుడుమరువకుండ

గీ. జపముజేయుడు వేగమ జాగులేక
జన్మశతకృతదుష్పాప జాడ్యసమితి
సమసిపోవును సర్వార్థసంచయంబు
సహజకైంకర్యసిద్ధియు జాలగలుగు. ౨౯

సీ. అతివిశాలమగుమ నలరారు వసుమతి కనులకు గనిపించె కణముబోలి
సకలంబు గల్పగజాలిన యగ్నియు యల్పస్ఫులింగమోయనగనొప్పె

యేపున కొండల నెగురవేయగజాలువాయువు నిశ్వాసవాయువయ్యె
అతినీలమైయొప్పు నంబరమంతియు నతిసూక్ష్మరంధ్రమై యలరెగనుల

గీ. నజభవామరముఖ్యులౌ యఖిల సురలు
కీటకములౌచు గన్నుల గీలుకొనిరి
తావకంబైన మహిమంబు భావమందు
ప్రబలమైయున్న యప్పుడు రామచంద్ర ! 30

సీ. చేతులుజోడించి చేయగ నంజలి శిరము నతముగాగ జేయువినతి
కరచరణాదుల గలుగగ పులకలు కనుల బాష్పజలము గలుగుచుండ
వరతైలధారను వాసిగబోలుచు మనసున స్మృతితతి మసలుచుండ
గద్గదస్వరమున గళము రాజిలుచుండ భావత్కవర పదపద్మ సక్త

గీ. చింతనామృతతుందిల చిత్తభృంగ
వృత్తినుండగజేసి వృజినసమితి
బాయజేయగ నర్థింతు బరమభక్తి
జనకజా మానసాభీష్ట జనక రామ ! 31

గీ. రామ రఘురామ దశరథరామ రామ
భక్తలోకైకకల్పక భరతభాగ్య
దివ్యమునిసేవ్య భవనుత దివ్యనామ
సకలసద్గుణగణధేయ సత్యవాక్య. 32

గీ. రామనామంబు జపియించి రమ్యభక్తి
వాంఛితంబుల వాల్మీకి వడయలేదె
యటుల జేయగలేనైతి నందువలన
గర్భవాసాది దుఃఖముల్గలిగె నాకు. 33

సీ. నిజపాదసంశ్రిత నిస్తులచిత్తార్తి కాలభుజంగేంద్ర గరుడమణియు
సర్వలోకంబుల జక్కగపాలించు రమ్యరత్నామణి రాజరాజు
జనకజావిస్తృత చారులోచనయుగ్మ చాతకవరనీరజలదమణియు
వైరాగ్యసంయుక్త వరముని మోహాక నీలనీరదగాత్ర నీలమణియు

గీ. సకలకళ్యాణ గుణగణ సంయుతుండు
భరతపూజిత పాదుకా భాసురుండు
నవ్యపియుష్యాపరుచిర నామయుతుడు
భానువంశాబ్ధిసోముడు భద్రమూర్తి. 38

సీ. శత్రువిచ్ఛేదక సత్సామ్రాజ్యమంత్రంబు మంత్రగణంబుల మహితమంత్ర
మతివేల సంసారహర్షదమంత్రంబు మాన్యైశ్వర్యద మంత్రవరము
మహితతమస్సంఘ మారణమంత్రంబు కలుషభుజగజాల గరుడమంత్ర
ముచితమార్గదము సమున్నతపదదము సహజకైంకర్యప్రసాధకంబు

గీ. జన్మసాఫల్య సర్వార్థ సాధకంబు
రామనామమఖిల మంత్రరాజవరము
జపము జేయుము నాలుక జాగులేక
క్షణమునైనను విడువక సలుపు భజన.

సీ. వ్యామోహములనెల్ల వదిలింపగాజాలు నతిమహిమాఢ్యమా నౌషధంబు
విబుధమునివరుల విమలమనోవృత్తి నలరింపజాలు దివ్యౌషధంబు
దైత్యేంద్రకానన దావాగ్నిరూపమై యార్యసమ్మతిగన్న యౌషధంబు
త్రిభువన జీవన దివ్యౌషధంబని యధికకీర్తినిగన్న యౌషధంబు

గీ. భవభయముబాసి నిత్యంబు భక్తవరుల
కెప్పుడు హితవును గలిగించి యొప్పుమీరు
రామనామౌషధం బిది రక్తిదవిలి
శ్రేయమును మీరు పొందుడు చిత్తమలర 32

సీ. వేదంబులెల్లను వేసార్లు జదివిన నడవిరోదనమట్లు యౌనుగాదె
వేదవ్రతంబులు విడువగజేసిన ఫలమేమిగలిగెనో పలుకగలరె
నూతులు చెరువులు ప్రీతిశ్రోత్రవ్యనభసితహోమముకంటెభాగ్యమేమి
గంగాదినదులలో గడుభక్తిమునిగిన గజము నీటబడిన గతియెగాదె

గీ. రామ తావక చరణాబ్జ రమ్యచింత
లేక జేసినవన్నియు లేతబనులె

తావకంబైన దావశీలాంకంబె
రామనామంబునే నేనూ రక్తిదలతు. ౩౭

గీ. నాదుజన్మకు ఫలమిది నళిననేత్ర!
భృత్యభృత్యుని తద్భృత్యభృత్యభృత్య
భృత్యభృత్యుని సమముగా భృత్యునన్ను
పూర్ణకరుణను దలచుము పూర్ణతేజ! ౩౮

సీ. స్వాశ్రితజనులకు స్వపదంబు దయచేయు దైవతరాయడు ధర్మపరుడు
పురుషోత్తముండని బుధులుపిలిచెడివాడు చిత్రప్రసేవ్యుడు శ్రీయుతుండు
లోకత్రయంబుట లోలతలేకుండ నేకాధినాథుడై యేలువాడు
సురవరసేవ్యుడు శూరుడు ధీరుడు రామచంద్రుండను రాజరాజు

గీ. కలిగి యుండగ కతిపయగ్రామవిభుని
పురుషహీనుని దుష్కీర్తి బూను నీచు
నల్పధనుని గర్వితు నాశ్రయించ
జనెడిమూఢుడు గలుగునె జగమునందు! ౩౯

గీ. మదన! రఘురామ పదయుగ మందిరంబు
మామకంబైన చిత్తంబు మఱలిపొమ్మ
హరుని నేత్రాగ్నిలో బడి యణగినావు
మరల రాఘవ శరవహ్ని మడియనేల? ౪౦

క. పరమార్థ బోధకంబులు
పరహిత మధురుచిర దివ్యఫలసదృశంబుల్
వరరామ వాచకంబులు
పరభక్తి పఠింపు మనస పరవెడ సతులన్ ౪౧

గీ. పతనశీలంబు పరిణామపక్వ మరయ
సతతవిశ్లథశసంధి జర్ఝరంబు
తనుపుష్టతదుల నిలుపంగ తరముకాదు
సరవి గ్రహింపుము రామతోనాయనంబు, ౪౨

సీ. జనకరాజతనయ జానకి నీభార్య జనయిత్రి కౌసల్య చారుశీల
సర్వంసహాచక్ర సత్పాలకుండైన దశరథరారాజు తండ్రి నీకు
నిగమ మునిగణము నిను వినుతించును విబుధులెల్లరు నీకువినతభటులు
పరమప్రసాదంబు వరముక్తియై యొప్పె నఖిలజగజ్జాల మవ్యయమ్యో

గీ. యల వసిష్ఠర్షి కౌశిక లరయ గురులు
సహజాడాఢ్యుడు సౌమిత్రి సచివవరుడు
విభుడవైతివి మాకును విశ్వమునకు
రమ్యగుణధామ రఘురామ రామ రామ! ౮౩

సీ. రాఘవుడెప్పుడు రక్షించు దయతోడ రాముని సేవింతు రమ్యభక్తి
రాముడు రాక్షసరాజులదునుమాడు, రామాయనమయనురక్తినందు
రామునివలనను రహిబుట్టె జగములు రాముడె లోకాధిరాజరాజు
రామునిదాసుడ రామునిశిష్యుడ రాముడె లయమును రక్తిజేయు

గీ. సకల బాహ్యాంతరస్థుడు సత్యరూపి
నిత్యనిర్మల సద్రూపి నిగమవిదుడు
రామభూపతి సద్గుణ రాజితుండు
భక్తజనబృంద మందార భవ్యతరువు. ౮౪

క. భవసాగరపతితుని నను
భవదీయ కృపావిశేష భరితునిగా నీ
వవధారణ మొనరింపవె
యవనార్తుని దాసు భక్తు నాశ్రితుభృత్యున్. ౮౫

గీ. తలచెదను రామతత్త్వంబు దనివిదీఱ
నతులొనర్తును పదయుగ నళినములకు
చేసెదను పూలపూజను చేతులార
పలికెదను రామనామంబు పరమభక్తి. ౮౬

సీ. శ్రీరామ రఘురామ సీతామనోహర రాఘవ కాకుత్స్థరామచంద్ర
మార్తాండకులజాత మన్మథసుందర కౌశికవరశిష్య కమలనయన

దశరథవరసుత దానవనాశక తాపసవరసేవ్య ధరణినాథ
శివచాపభంజన సేవకమందార జనకనృపతివంద్య శక్రతుల్య

గీ. రామ బుధజనవరనుత రమ్యనామ
యనుచు బల్కఁగ జాలియు ననగఁబోరు
జనులువ్యసనాభిముఖ్యులు శమనవశులు
కాలమంతయు బుత్తురు కలుషగతుల. ౭౭

గీ. అవ్యయుని రాము నవ్యక్తు నచ్యుతాఖ్యు
నియతచిత్తుల పాలించు నిత్యురాము
ధన్యహృత్పద్మసంస్థితు దాశరథిని
గొలుతు నెప్పుడు కోర్కెలు కొమరుమిగుల. ౭౮

గీ. క్షీరసాగర వీచికాశీకరములు
తనువునందున ముత్యాలతతిని గూర్ప
శేషశయ్యను పవళించు శ్రీనివాసు
పరమపదవాసు దలచెద పరము రాము. ౭౯

సీ. సాధులసహవాస సందర్భవశమున సంసృతివైరాగ్య సరణిఁబొంది
సద్గురుకరుణను సర్వేశుదయగాంచి పరతత్త్వవిజ్ఞాన పటిమబొంది
ప్రారబ్ధ కర్మానుభవమును బొందుచు క్షీణకర్మాంతర స్థితినిదగిలి
సర్వభరన్యాస సర్వేశకరుణను నిర్యాణమాయుఁడై నియతహార్ద

గీ. దైవసంప్రాప్తహా మధ్యధమనినుండి
వెడలి వెలికిని ముక్తుఁడై వేగనపుడె
యర్చిరాదులు దనవెంట నఱుగుదెంచి
యాదరించుచు గొనిపోవ నటిగియటిగి. ౮౦

గీ. సీమకావలనున్నట్టి సింధువునను
గ్రుంకులిడి చేరి వైకుంఠగుప్తపురిని
పరమసాయుజ్యమును తుల్యభాగ్యమంది
వెలయు పురుషుడు సంతోషవివశుఁడగుచు. ౮౧

గీ. భరతు డిట్టుల సంపూర్ణ భక్తుడగుచు
రామపాదుక లర్చించి రమ్యభక్తి
పలుకులిట్టుల పలుకుచు బరమనిష్ఠ
బరమమునులను గొలుచుచు భవ్యగుణుడు. ౫౨

భరతరాజు జగంబంతయు రామమయంబని తలచి సంతత రామపాదుకాయుగళ విన్యస్తమనోనయనుడై రామకథాలాపంబులుదక్క నన్యంబెఱుంగక తన్మయుడై కాలంబు బుచ్చుచుండెను. మంత్రులు రాజ్యతంత్ర వ్యవహారంబుల శ్రీరామ పాదుకలకు విన్నవించుచు ప్రధాన పరిష్కారంబులకై వసిష్ఠానుమతిని భరతసమ్మతిని బడసి పరిష్కరించుచుండిరి. యాయ వ్యయంబుల వ్యయ మల్పముగ నాయ మధికముగ నుండునటుల జాగరూకులై శ్రద్ధతో కనిపెట్టుచుండిరి. అంత నొక దినంబున భరతరాజు గురువరు నవలోకించి పరతత్త్వయాథార్థ్య బోధచే నన్ను విదితత్త్వునొనరింపుమని కోరెను. వసిష్ఠ భగవానుడు భరతు నవలోకించి

## వసిష్ఠోపదేశము

గీ. వినుము చెప్పెద తత్త్వంబు విశదముగను
తత్త్వమెఱిగిన మనుజుడు ధన్యతముడు
సహజ తత్త్వానువర్తివి సాత్త్వికుడవు
జన్మతోడనె సద్వృత్తి సంభవించె. ౫౩

క. చిదచిత్తులు పరమాత్మయు
మదిదెలియగ దగిన మూడు మహితార్థంబుల్
మానసమున దెలియగ జనినవి
సదసుల నిత్యత్వసిద్ధసహితము లగుచున్. ౫౪

క. తనయుల దారల ధనముల
తనవని యని విడువలేక తద్యోగమునన్
తన కతిసౌఖ్యము కలదని
మనుజుడు మాయాప్రబంధ మధితుడగుమిత్రా. ౫౫

క. ప్రతిబంధ రహితపుకాటను
మతిమంతులు మోక్షమనుచు మహితాసక్తిన్
ప్రతిపాదన చేతురునూ
సతతముగా ముచిలిధాతు జనితంబగుటన్. ౫౬

సీ. తత్వములుమూడు దెలియుము తగినయటుల
క్రమముగాగను దెలిపెద గణనజేసి
బాల్యమందున భక్తిని బడసినావు
దానినెప్పుడు విడునక దవిలియుండు. ౫౭

క. ఈశుడు లేడని పలుకుచు
ధీశక్తిని యుక్తి శతము దెలిపెద రహహో
ఈశుడు లేడన జెల్లునె
ఈశుడు లేకున్న జగము లెట్టుల గలుగున్? ౫౮

క. ఈశేశితత్వభేదము
ఈశుడు జీవాళి కర్మహిత పటుగతిచే
ధీశక్తిగలుగజేసెన
ఈశుని తప్పేమి యచట నేర్పడ చెపుమా. ౫౯

క. నాస్తికు యుక్తులలోబడి
యాస్తికుడెవ్వాడుగాని హతుడగు సుమ్మీ
నాస్తికు చెంతకుచేరిన
నాస్తియె సిద్ధించు ఫలము నరనుత వినుమీ. ౬౦

క. వారల మాటలదగిలిన
వారలు పాపార్ణవమున బడుదురుసుమ్మీ
వారల జేరగవలువదు
వారలయుక్తి వ్రజంబు వదలగ వలయున్. ౬౧

సీ. కారణములేని కార్యంబు గలుగదెచట
సకలకారణరూపుడౌ జగదధీశు

డొకడు కలడని నమ్ముము యోర్పుతోడ
నతడె సర్వేశు డవ్యయు డాదివిభుడు. ౬౨

గీ. కారణములేని కార్యంబు గలుగదెచట
కార్యమొక్కటె సహజమై కలుగు ననుచు
యుక్తిహీనులు బలికెడి యుక్తులన్ని
యుచితములు గావు నమ్మకు ముచితవిదుడ! ౬౩

గీ. మనుజులందరు తుల్యులై మసలదగుట
గురువులక్కర లేదని గురుతుగాను
పలుకుచున్నారు తగదది బహుళ విధుల
బోధ కానివి కలుగుట బుధులవలన. ౬౪

గీ. సాంప్రదాయార్థమెల్లను చదువుచుండి
రదియుగాకను నరులంద రరసి చూడ
మంద్ర మధ్యమ తారార్థ మతులుసుమ్ము
తెలివి తేటల భేదంబు తేజరిల్లు. ౬౫

గీ. పూర్వకృత కర్మభేదంబు బూని నరుడు
భేదగతి నొందగలుగును భీమశౌర్య!
దాన తెలివికి భేదంబు దాపరించె
గాన తరతమభావంబుగలిగె మనసు ౬౬

గీ. తెలివికలదని గర్వించ తెలియగలడె
బుద్ధికందనివెన్నియో భువిని గలవు
గాన గురువులచెంతను గూఢగతుల
దెలియగలవాడె సర్వంబు దెలియ గాకు ౬౭

గీ. పుస్తకంబులజూచిన పూర్ణముగను
దెలియగలదన జెల్లదు ధీవిశాల!
బుద్ధిబలమున నర్థంబు బూనిచేయ
గలుగు విపరీతమార్గంబు కలుషగతిని. ౬౮

గీ. సకల తత్త్వజ్ఞుడైనట్టి సద్గురుండు
తథ్యమైనట్టి రీతిని తత్త్వమెల్ల
తెలియజెప్పను, శిష్యుడు తెలియగలడు
తండ్రిధనమును బొందిన తనయునట్లు. ౬౯

గీ. తెలియదగినది చాలగ దివిరియుంట
నాయువరయగ ననుక్షణ హానిగనుట
బుద్ధిమాంద్యంబు జనులకు బూర్ణమగుట
తగును గురుబోధ జనులకు తథ్యవిదుడ! ౭౦

గీ. పరమమునులెల్ల బటికించి పలికినట్టి
తత్త్వమిప్పుడు తెలిపెద దగినరీతి
తెలిసి బుద్ధిని నిలుపుము స్థిరముగాను
తత్త్వవేత్తలె మిక్కిలి ధన్యతములు. ౭౧

గీ. కలరు జీవులు పెక్కండ్రు గణనమించి
ప్రకృతియొక్కటి జీవుల ప్రబలశక్తి
గట్టిగాబట్టి సంసార గర్తమందు
త్రిప్పగా జాలియుండు సుస్థిరముగాను. ౭౨

## తత్త్వత్రయము

### జీవప్రకరణము

ముముక్షువులకు జ్ఞాతవ్యములు చిదచిదీశ్వరభేదమున మూడు నిత్యతత్త్వములు. అందు చిత్తనునది జీవుడు. ఆత్మాది శబ్దములచే పిలువబడును. జీవులనంతసంఖ్యలు. జీవుడు దేహముకంటెను ఇంద్రియముల కంటెను మనస్సుకంటెను ప్రాణములకంటెను బుద్ధికంటెను భిన్నుడు. జీవుడానందరూపుడు అణుస్వరూపుడు నిత్యుడు అవ్యక్తుడు నిర్వికారుడు జ్ఞాననిలయుడు అచింత్యుడు అవయవరహితుడు ఈశ్వర నియామ్యుడు భగవచ్ఛేషము ఈశ్వరశరీరము. దేహమే జీవుడనుట తగదు. దేహమనిత్యము, జీవుడు నిత్యుడు. దేహము పంచ భూతాత్మకము

జీవుడు నిర్వికారుడు. నా దేహము నాకాలు నాకన్ను అనుకొనుచున్నాము గాన జీవుడు దేహాభిన్నుడు. జీవుడు స్వయంప్రకాశ కలవాడు. అజడుడు విజ్ఞానపూర్ణుడు అణురూపుడు. అణువనగా, శ్లో॥ వాలాగ్రశతభాగస్య శతధాకల్పితస్యచ భాగోజీవస్స విజ్ఞేయః అనియును "త్రసరేణుప్రమాణాస్తే రశ్మికోటి విభూషితా" త్రసరేణువు అనగా ముప్పదిపరమాణువుల కొలగలది. పరమాణువు అనగా సూక్ష్మములకంటె సూక్ష్మమైన అణువు. అణువనగా అల్పములలో అల్పము, అనగా మిక్కిలి చిన్నరూపము అని భావము. ఒకవడ్లగింజయొక్క తోకను నూరుభాగములుజేసి యా నూరుభాగములలో నొకభాగమును తిరిగి నూరుభాగములు జేయగా నందొకభాగ మెంత యుండునో జీవప్రమాణమంత పరిమితము కలది. ఈ జీవుని దేహసంబంధమె జననము. దేహవియోగమె మరణము. దేహమనగా పంచీకృతపంచభూత సమిష్టిరూపము. జీవుడు ఈశ్వరుని వలెనే సర్వదా నిత్యుడు. జననమరణరహితుడు. జీవుడింత చిన్నరూపము కలవాడైనను గజదేహాది స్థూలదేహప్రవేశ సమయమునను, ఆశరీర మాపాదమస్తకపర్యంతముకల సుఖదుఃఖముల నెఱుగును. సూక్ష్మశరీర విషయముకూడ యింతే. శరీరమునకుగల సుఖదుఃఖములు జీవునకు సంక్రమించును. శరీరము జడముగాన కేవల శరీరమునకు సుఖదుఃఖములు లేవు. జీవవిశిష్టశరీరమునకె సుఖదుఃఖసంక్రమణము. మృతశరీరమునకు సుఖదుఃఖములు లేవు. శరీరమన 'శీర్యత ఇతి శరీరం' అనువ్యుత్పత్తిచేత శిథిలమగునది శరీరము. శరీరము క్రమముగ శిథిలమగును. దేహమన 'దహ్యత ఇతి దేహః' అనువ్యుత్పత్తిచే జీవహీనదేహము దహించబడును గాన దేహమన బడినది. జీవహీనశరీరము దహించబడియో పాతివేయబడి యో తరువాతపంచ భూతములలో చేరును. మఱియు దీపము తానున్న చోటనెయుండి యెట్లు ధర్మభూతజ్ఞానవ్యాప్త్యుపపత్తిచే తదితరస్థలముల ప్రకాశింపజేయునో అట్లనే జీవుడుకూడ ధర్మభూతజ్ఞానవ్యాప్తిచేత శరీరమునందంతటను గలుగు సుఖదుఃఖముల నెఱుగును. జీవుడు తన శక్తిని యోగవిద్యాబలమున పెంచి యేకకాలమున ననేక దేహములలో ప్రవేశించగలడు. సౌభర్యాదులిందుకు దృష్టాంతములు, పరకాయప్రవేశము

యోగబలమున నాకాశమార్గమున పిట్టలవలె యథేష్టప్రదేశమున కేగుట మొదలగునవి జీవసాధ్యములు. ముక్తులందరు తమ యిష్టానుసారము శరీరధారణాదికమును వహించగలరు. జీవుడవ్యక్తుడన నింద్రియవశుడుకాడని తెలియవలెను. జీవు డచింత్యుడన జీవు డిట్టివాడని మనస్సు తెలియలేదని యర్థము. అచిద్భవములగు కరచరణాదులు లేనివాడుగాన అవ్యక్తుడని భావము. నిర్వికారుడన ఎల్లప్పుడు ఏకరూపమున నుండువాడు, జ్ఞాననిలయుడన జ్ఞానమున కునికిపట్టగువాడు. ఈశ్వరనియామ్యుడన ఈశ్వరాధీనముగ సర్వవ్యాపారములు కలవాడు. ఈశ్వరధార్యుడన భగవత్స్వరూప సంకల్పముల విడిచినప్పుడు తన సత్తాలేకుండిన ట్లుండువాడు. భగవచ్ఛేషమన భగవానునికి చందన తాంబూలాదులవలె యథేష్ట వినియోగార్హుడు. ఈశ్వరశరీరమన ప్రకృతి జీవున కెట్లు శరీరమో ఈశ్వరునకు జీవుడట్లనే శరీరము. నీరంధ్రమగు జీవునియం దీశ్వరున కెట్లు ప్రవేశము కలదనిన సర్వము సాంతరమె ఈశ్వర ప్రవేశార్హమధ్యప్రదేశము కలదియై గాన ఈశ్వరుడు జీవాంతరప్రవేశమున కడ్డు లేదు గనుకనె ఈశ్వరుడు జీవునిలో ప్రవేశించి జీవుడు శరీరముగా గలవాడగును. జీవాంతర్వర్తిగాన ఈశ్వరుడు జీవశరీరుడు. ఈశ్వరుడు మాత్రము నిరంతరుడు అనగా ఈశ్వరసంకల్పములేనిది ఈశ్వరునియందేజీవుడును ప్రవేశించజాలడు. అయితే ఈశ్వరుడు సర్వమును తనలో నిముడ్చుకొన దలచినచో సర్వమును తనలో నిముడ్చుకొనగలడు. సర్వశక్తియుక్తుడు గాన 'అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్యనారాయణస్థితః' అని శ్రుతి. జీవునకు విభుత్వములేదు. విభుత్వము లేనిచో నదృష్టజనిత దేశాంతరఫలోపలబ్ధి యెట్లనిన నది జీవుని సంబంధము లేకున్నను అదృష్ట వశమున కలుగును. అదృష్టమన భగవత్ప్రీతిజనక జీవకర్తృక కర్మ విశేషజన్య జ్ఞాన విశేషము. అది విశేషముగ భగవత్సంకల్పమె. పూర్వానుభూతార్థప్రతిసంధానమున జీవుడు నిత్యుడు. ఏకపరిమాణములగు ననేక ఘటములలో నొక ఘటమువలెను ధాన్యరాశిలో నొక వడ్లగింజవలెను అనేకజీవులలో నొక జీవుడని వ్యవహారము. జీవుడు ప్రతి శరీరభిన్నుడు. శరీరమున కొకొక్క జీవు డుండునని భావము.

గనుకనే యనేక జీవులని తెలియవలెను. జ్ఞానైకాకారతచేత నేకత్వవ్యవహారముగాని స్వరూపైక్యముచేత నేకత్వవ్యవహారము లేదు. జీవుడు స్వయముగ సుఖి. ఉపాదివశమున దుఃఖిసంసారి జీవుడు కర్త భోక్త, శరీరము శరీరి. ప్రకృత్యపేక్షచేత శరీరి ఈశ్వరాపేక్షచేత శరీరము. జీవుడు నిత్యుడు, ముక్తుడు, బద్ధుడు అని మూడు విధములు. అందు బద్ధులు అనువృత్తసంసారులు. చతుర్దశ భువనములయందును సకలాండ కటాహముల యందును నివసించు బ్రహ్మాది పిపీలికాంతచేతన విశేష జీవులు. నారాయణుని నాభికమలోద్భవుడు బ్రహ్మ. బ్రహ్మ పుత్రులు రుద్ర సనక సనందన సనత్కుమార నారదులు. వసిష్ఠుడనగు నేను పులస్త్య మరీచి దక్ష కశ్యప ప్రజాపతులు కలిగిరి. ప్రజాపతుల వలన దేవతలు దిక్పాలురు, చతుర్దశేంద్రులు, చతుర్దశమనువులు, పితరులు, సిద్ధులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, విద్యాధరులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, అశ్వినులు, అసురులు, దానవులు, దైత్యులు, యక్షులు, రాక్షసులు, పిశాచములు, గుహ్యకాదులు, బ్రాహ్మణాది భేదములుగల సర్వమానవులు, పశు, పక్షి, మృగ, సరీసృపపతంగ కీటకాది భేదభిన్నులగు తిర్యగ్జంతువులు, వృక్షలతాగుల్మ వీరు త్తృణాది భేదమున బహువిధభేదభిన్న స్థావరములు, శిలలు, గుట్టలు, పర్వతములు, కులగిరులు, నదులు, సాగరములు, జలజంతువులు కలిగినవి. మనుజులకువలె తిర్యగ్జంతువులకును, జ్ఞానవిశేషము కలదు. స్థావరములకును జలాహారణాద్యుపయుక్తకించి జ్ఞానముకలదు. వీరందరును బద్ధజీవులు. స్వస్వకృతకర్మభేదమున నిట్టి భేదములు ఈశ్వరసంకల్పమున కలిగినవి. ఇందు జరాయుజోద్భిజ్జస్వేదజ భేదములును కలవు. దేవమనుష్యాదులు జరాయుజములు. అందు బ్రహ్మాదులు సనకాదులు సీతా ద్రౌపదీ ప్రభృతులు భూతభేతాళాదులు అయోనిజులు. తదన్యులు యోనిజులు. తిర్యగాదులు జరాయుజములు. పక్ష్యాదు లండజములు. మరియు స్వేదజములు, స్థావరములు, ఉద్భిజ్జములు కలవు. బద్ధులా బీజాంకుర న్యాయమున విషమ ప్రవాహముగాన నాదికాలప్రవృత్తా విద్యా కర్మ వాసనారుచి ప్రకృతి సంబంధము చక్రవత్పరివర్తమానులై

గర్భజన్మ బాల్య యౌవ్వన జాగర స్వప్న సుషుప్తి మూర్ఛా జరా మరణా స్వర్గనరకాదులయందు వివిధ విచిత్రావస్థలదగిలి యనాద్యంద ప్రకారాది దుస్సహతాపత్రయాభితప్తులై స్వతఃప్రాప్త భగవదనుభవ విచ్ఛేద రహితులైనవారు బద్ధులు. వీరు కైవల్యపరులు, మోక్షపరులు అని రెండు విధములు. కైవల్యపరు లర్చిరాది మార్గమున పరమపదమునకు బోవు మార్గమున నొకమూల భగవదనుభవ వ్యతిరిక్త కేవల స్వాత్మానుభవులై యుందురు. వీరు కేవలు లనబడుదురు. మోక్షపరులు ద్వివిధముగ నున్నవారు. భక్తులు, ప్రపన్నులు. అందు భక్తులధీతసాంగస శిరస్క వేదవిదులై పూర్వోత్తర మీమాంసాపరిచయమున చిదచిద్విలక్షణ పరమేశ్వర సాంగభక్తిని స్వీకరించి నేరాక్షమును పొందు కోరికగలవారు. దీనియందు స్త్రీశూద్రుల కధికారములేదు. ద్విజులకు మాత్రమే యధికారము కలదు. భక్తియన యమ నియమాసనప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధి రూపాష్టాంగయుక్తతైలధారావచ్ఛిన్నస్మృతి సంతాన రూపవివేక విమోకాది సాధనసక్తకాది యుక్తముభక్తి. దీనినిసవిస్తరముగ నెరుంగవలెను. ప్రపత్తికీ న్యాసవిద్యాశరణ తరణము శరణాగతియని పేరులు. అకించిన్యానన్యగతకత్వ ధర్మవిశిష్టుడు భగవన్యస్త స్వసర్వభారుడు ప్రపన్నుడు

శ్లో॥ అనన్యసాధ్యే స్వాభీష్టే మహావిశ్వాస కోర్వకం తదేకోపాయతా
యాచ్నాప్రపత్తి శ్శరణాగతిః ఆనుకూల్యస్యసంకల్పః ప్రాతికూల్య
విసర్జనం రక్షిస్యతీత విశ్వాసః గోప్తృత్వవరణం తదా ఆత్మనిక్షేప
కార్పణ్యామంగ పంచక మీరితం॥

భగవదనుకూల సంకల్పము 1. ప్రతికూల విసర్జనము, 2. తనను భగవంతుడు తప్పక రక్షించునని దృఢముగ నమ్మియుండుట, 3. రక్షకుడైన నారాయణుని యాశ్రయించుట, 4. తన రక్షణభారమంతయు భగవంతునియందే విడచి యుండుట, 5. సాత్వంతకము శ్లో॥ ఆనుకూల్యస్య సంకల్పఃప్రాతికూల్య విసర్జనం, రక్షిష్యతీతివిశ్వాసః గోప్తృత్వవరణంతథా ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతి॥ ఇందు, కార్పణ్యమనునది మాత్ర మధికము. కార్పణ్యమనగా అశక్తత. ఇది ప్రపత్తికి నారవ

యుంగము. నేను మిక్కిలి అశక్తుడనని భగవంతునకు విన్నవించుకొనుట. ప్రపత్తియన శరణాగతియె. భక్తియోగ మహంకార గర్భము. ప్రపత్తి మోక్షసాధనములలో నెల్ల మిక్కిలిసులభము. ఈ శరణాగతిని వేదమిట్లు బోధించుచున్నది. శ్రు॥ బ్రహ్మాణోత్వా మహాంజుహోమి॥ ముముక్షుర్వైశరణ మహంప్రపద్యే॥ ప్రపత్తి యీ దేహాంతమున నే మోక్షము నొసగును. యాంతేమతిస్సాగతిః యను నంతిమప్రత్యయ మిందనవసరము. ప్రపత్తియనకృత్కర్తవ్యము. జ్ఞానవిశేషము గురుముఖ మున సాంప్రదాయానుసారముగ లభించదగినది. ప్రపత్తినిష్ఠులు ప్రపన్నులు. వీరు రెండు విధములు. త్రైవర్గికపరులు, మోక్షపరులు, ధర్మార్థకామమోక్షములను నాలుగు వర్ణములలోను త్రైవర్గికపరులు మోక్షముతోపాటు ధర్మార్థ కామములనుకూడా భగవంతుని వలననే కోరువారు. మోక్షపరులన సంసారమున విరక్తులైపూర్వకర్మానుసారము ప్రారబ్ధానుభవముతప్పదను దృఢజ్ఞానమున ధర్మార్థకామములనపేక్షించక కేవల మోక్షమునే భగవంతునినుండి కోరువారు. సద్గురూపదేశమున విరాగియై నిత్యానిత్య పరాపరవివేకము నార్జించి మోక్షార్థియై తత్సిద్ధికై సద్గురువు నాశ్రయించి తత్కృపాసంప్రాప్త సకలహితోపదిష్టుడై సాంప్ర దాయానుసారముగ మంత్ర మంత్రార్థముల నెఱిగి మోక్షముతప్ప తదన్యమును శ్రియఃపతివలన కోరనివాడు ప్రపత్తినిష్ఠప్రపన్నుడు. ప్రపన్నుడగువాడు భక్త్యాద్యుపాయము పూర్తిగ వర్జించి కేవల ప్రపత్తి నిష్ఠుడై యుండును. ప్రపత్త్యుపదేశమునకు మానవమాత్రుల కందరికి నధికారము కలదు. మనుజులలో నెవడయినను ప్రపత్త్యుపదేశమును పొందవచ్చును. ఈ ప్రపన్నుడు ఏకాంతియనియు పరమైకాంతియనియు రెండు వి..ములు. ఎవడు మోక్షమును తనితరఫలములనుకూడ నారాయ ణుని కోరునో వాడేకాంతి. ఎవడు మోక్షముతప్ప తదన్యమును నారాయ ణునివలనకూడ కోరడో వాడః పరమైకాంతి. వీరిద్దరు దేవతాంతర శూన్యులు. నారాయణకృపావిశిష్టులు. ఏకాంతి రెండువిధములు అవశ్యా నుభోక్తవ్యములగు ప్రారబ్ధకర్మల ననుభవించుచు నీ శరీరావసానముననే మోక్షమును కోరువాడు దృప్తుడు. మండుచున్న యగ్నిమధ్య నున్నటుల

నీసంసారమున నుండుట దుస్సహమని తలచుచు ప్రపత్త్యుత్తర క్షణము ననే మోక్షమును కోరువాడు ఆర్తుడు. ఇట్టివానికి భగవదనుగ్రహమున విధిగ మోక్షము కలుగును. ముక్తుడనగా ప్రపత్త్యుపాయ పరిగ్రహా నంతరమున నిత్యనైమిత్తికాది భగవదాజ్ఞలను భగవదారాధనా రూప ముగ జేయుచు ఫలమును కోరక భగవద్భాగవతాపచారముల వర్జించి దేహావసానమున సుకృత దుష్కృతములను మిత్రామిత్రుల కర్పించి హార్దమున గల పరమాత్మయందు విశ్రమించి ముక్తిద్వారభూతమగు సుషుమ్నా నాడినుండి వెడలి బ్రహ్మరంధ్ర మార్గమున పైకిబోయి హార్ద పురుషునితో కలసి సూర్యకిరణములద్వారా అగ్నిలోకమునకు చేరి దిన పూర్వపక్షో త్తరాయణ సంవత్సరాద్యభిమానదేవతలు వాయువరుణులు సన్మానించుచుండ సూర్యమండలమును భేదించి సూర్యలోకమునుచేరి చంద్ర విద్యుద్వరుణేంద్ర ప్రజాపతులు మార్గదర్శకులై కూడవచ్చుచుండ నాతివాహకగణముతో నాయా యీలోకముల నుపచారముల నందుచు ప్రకృతివైకుంఠసీమాపరిచ్ఛేదికయగు విరజానదిని దాటి సూక్ష్మశరీరము విడిచి యమానవ కరస్పర్శమున నప్రాకృత దివ్యమంగళవిగ్రహమును ధరించి చతుర్భుజుడును బ్రహ్మాలంకారాన్వితుడును అయి యింద్రప్రజా పతీనామక నగరపాలకానుమతిని పొంది శ్రీవైకుంఠ దివ్యనగరమును ప్రవేశించి పతాకాలంకృత దివ్యమహితగోపురములను దాటి యైరమ్మద మను అమృతసరస్సును సోమసదనమను నశ్వత్థ వృక్షమును చూచి పంచశత దివ్యాప్సరోవనితలచే బ్రహ్మ గంధాదుల నలంకృతుడై యట నుండు అనంతగరుడ విష్వక్సేనాదులకు వందనమర్పించి వారిచే సన్మా నితుడై మహామణి మంటపమును చేరి పర్యంకసమీపమున నివసించి యున్న స్వాచార్యులకు నమస్కరించి యట ధర్మాదులు పాదములుగా నున్న దివ్యరమ్య పీఠోపరి కమలమున శేషశయ్యయందు విమలాదులు చామరముల వీచుచుండ శ్రీభూనీళాసమన్వితుడై శంఖచక్రాది దివ్యా యుధోపేతుడై జాజ్వల్యమాన కిరీటమకుట చూడావతంస మకరకుండల గ్రైవేయక హార కేయూర కటక శ్రీవత్స కౌస్తుభ ముక్తాదామోదర బంధన పీతాంబర కాంచీగుణ నూపురాద్యపరిమిత దివ్యభూషణ భూషి

తుడై యపరిమితోదార కళ్యాణగుణ సాగరుడైన భగవంతు నవలోకించి తత్పాదారవిందయుగళమునకు శిరస్సుతో నమస్కరించి పాదభాగమునుండి పర్యంకము నెక్కి - పరవాసుదేవునిచే స్వాంకమున నుపవేశితుడై 'త్వంకోసి' యని యడగబడి బ్రహ్మప్రకారోస్మియని ప్రత్యుత్తరమిచ్చి శ్రీవైకుంఠ నాథుని దయాతరంగిత కటాక్ష వీక్షితుడై తదనుభవజనిత ప్రహర్షవశ మున సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత సర్వకైంకర్యరతియు నావిర్భా తగుణాష్టకయుతయు నుత్తరావధి రహిత బ్రహ్మానుభవసంక్రాంతియు కలవాడై యుండును. ఇతడే ముక్తపురుషుడు. ముక్తపురుషునకు బహు విధశరీరధారణము సర్వలోకసంచారము మొదలగు ననేకశక్తులు కలు గును. ముక్తుడు నిత్యునివలె సర్వశక్తియుతుడు భగవత్సంకల్పాయత్తుడు స్వేచ్ఛాసంచారుడు భవదనభిమతాచారుడు అనంత గరుడ విష్వక్సేన ప్రముఖ మహానుభావాంతర్గతుడు. నిత్యున కనాదినుండియు భగవ దిచ్ఛానుసారముకలిగిన యధికారవిశేషములుకలవు. ఇది చిత్ప్రకరణము.

—♦ ఇ క న చి త్ప్ర క ర ణ ము ♦—

భరతరాజా ! వినుము.

క. అచిదనునది వినదగినది
వచియించెద తెలియదగును వరలినదగుటన్
రుచిరము మాయావాచ్యము
ప్రచలితమిది పరుడు గనగ బహుశక్తంబున్.

క. అతిచిత్రశక్తి యుక్తము
మతిమంతులు తెలియలేరు మహితంబగుటన్
సతతముజీవుల బట్టును
పతితులపాలింటి పరమబంధముసుమ్మా.

సీ. సకలశాస్త్రంబుల జక్కగజదివిన సార్వభౌమత్వంబు జాలగనిన
వివిధయజ్ఞంబుల విడువక జేసిన బ్రహ్మర్షియై యొప్పి ప్రబలియున్న
శస్త్రంబు జేపట్టి శత్రుబలమునిమిన దేవత్వమునుబొంది తేజరిలిన
దేవేంద్రపదవిని తేటగ గాంచిన బ్రహ్మత్వ రుద్రత్వ పదవిగనిన

గీ. ప్రకృతి త్రిప్పుల బడుచుండు బద్ధుడెపుడు
ప్రకృతి బంధంబు గనకుండ ప్రబలువాడు
నిత్యుడొక్కడె గలడునూ నియతముగను
విష్ణుడొక్కడె మనకెల్ల విభుడు సుమ్ము.

సీ. నిత్యులు ముక్తులు నిజవశంబుననుంచి ప్రకృతిని గెలిచిరి ప్రబలముగను
వారికి హరికృప వరలుచుండుటచేత ప్రకృతికావల వారుప్రబలియుండ
వారిజోలికి బోవ వశము కాదనియెంచి వారికి నతిజేయు వాసినదియె
ప్రకృతి మండలమున ప్రబలులై వారలు సంచరించగలరు సర్వగతుల

గీ. బ్రహ్మమొదలగు బద్ధులు ప్రబలు లయ్యు
ప్రకృతి బద్ధు లగుదురు ప్రజల యట్ల
దాని త్రిప్పుల బడకుండ దలతురేని
శరణ వరణము జేయుడు సర్వవిభుని.

వ. అచిత్ ప్రకృతి ద్రవ్యము కాదు. సత్వరజస్తమోన్వితము. సత్వరజస్తమస్సులతోడను శబ్ద స్పర్శ రూప రసగంధముల తోడను సంయోగశక్తి తోడను కూడియున్నది. ప్రకాశగతి లాఘువాన్వితము. అతీంద్రియము. శక్త్యాద్వ్యతిరిక్తముమాయ. ప్రకృతిప్రధానము మొదలగు శబ్దములచే బిలువబడును. ప్రకృతి, శుద్ధ సత్వమిశ్రసత్వభేదమున ద్వివిధము. శుద్ధసత్వమునిత్యవిభూతిగతము. మిశ్రసత్వములీలావిభూతిగతము. ప్రకృతి జీవులకు శరీరాదులుగ పరిణమించి జీవుల సహజజ్ఞానమును మందగింపజేయును. లీలావిభూతియందు 1 మిశ్రప్రకృతి 2 కాలము 3 శుద్ధసత్వము 4 ధర్మభూతజ్ఞానము 5 జీవుడు 6 ఈశ్వరుడు. ప్రకృతిని కాలమును జడములందురు. ప్రకృతిభగవత్సంకల్పవశమున వైషమ్యమును పొంది కార్యోన్ముఖమగును. దాని నవ్యక్తమని పిలుతురు. దానినుండి మహత్తు పుట్టినది. అది సాత్విక రాజస తామసభేదమున త్రివిధము. అనగా స్వాతికాహంకారము రాజసాహంకారము తామసాహంకారము అని తెలియవలెను. సాత్వికాహంకారమునకు వైకారికము రాజసాహంకారమునకు తైజసము తామసాహంకారమునకు భూతాది యని

పేరులు. వైకారిక తైజసరాజస సాత్వికాహంకారములవలన పదునొకం డింద్రియంబులు బుట్టినవి. త్వక్ చక్షుస్సుశ్రోత్ర జిహ్వా ఘ్రాణములు వాక్ పాణి పాద పాయు ఉపస్థ మనస్సు యివి పదునొకండు యింద్రియ ములు. త్వక్చక్షుశ్రోత్రజిహ్వాఘ్రాణములు జ్ఞానేంద్రియములు, వాక్పాణి పాదపాయూపస్థలు కర్మేంద్రియములు. మనస్సు హృదయవర్తి బంధ మోక్ష హేతువు. శబ్దమాత్ర గ్రహణమగు శ్రోత్రేంద్రియము మను ష్యాదులకు శ్రవణకుహరవర్తి సర్పములకు నయనవర్తి రూపగ్రహణ శక్తమగు చాక్షుషేంద్రియము నయనవర్తి. గంధగ్రహణమాత్ర శక్త మగు ఘ్రాణేంద్రియము నాసాగ్రవర్తి. ఇది గజాదులకు దొండమున నుండును. రసమాత్ర గ్రహణశక్తమగు జిహ్వేంద్రియము జిహ్వాగ్రమున నుండును. స్పర్శమాత్ర గ్రహణ శక్తమగు త్వగింద్రియము సర్వశరీరమున నుండును. నఖకేశాదులకు ప్రాణమాంద్యమున, స్పర్శజ్ఞానము లేదు. వర్ణోచ్చారణ కరణశక్తమగు వాగింద్రియము హృత్కంఠ జిహ్వామూల తాలు దంతోష్ఠ నాసామూర్ధస్థానాష్టకవర్తి. మూక మృగాదుల కదృష్ట హీనమున వాక్పాటవము లేదు. శిల్పకరణశక్తమగు పాణీంద్రియముమను ష్యాదులకంగుళ్యగ్రవర్తి. గజాదులకు నాసాగ్రవర్తి. సంచారకరణమాత్ర శక్తమగు పాదేంద్రియముపాదద్వయవర్తి. ఇది మనుష్యాదులకుచరణవర్తి సర్పములకురోవర్తి. పక్షులకు పక్షవర్తి. మలాదిత్యాగకరణ శక్తమగు పాయ్వింద్రియము తత్తదవయవవర్తి ఆనందవిశేషకరణ శక్తమగు ఉప స్థేంద్రియము మేహనాదివర్తి. ఇంద్రియము లణువులు. పరకాయప్రవేశ లోకాంతరగమనము మొదలగువాటియందు జీవునితోడ నింద్రియములు పోవును. ముక్తిదశయందు కరణవిరహుల నాశ్రయించును లేక ఈలోకముననే యుండును. రాజసాహంకారముతో కూడిన భూతాది యను తామసాహంకారమువలన శబ్దాది తన్మాత్రలు పుట్టినవి. ఇవి శబ్ద స్పర్శ రూప రస గంధతన్మాత్రలు కలిగినవి. భూతములు పృథివ్యప్తే జోవాయురాకాశము లయిదు. తామసాహంకారాకాశమధ్యమావస్థా విశిష్టద్రవ్యము తన్మాత్రము. క్షీరదధ్యంతరాళ పరిణామమువలె తన్మాత్ర ముండును. దానివలన నాకాశముపుట్టినది. సూర్యస్పందరూపాకాశము

నకే ప్రాగాదివ్యవహారము. ఆకాశవాయు మధ్యమావస్థావిశిష్టద్రవ్యము స్పర్శతన్మాత్రము. దానివలన వాయువు పుట్టినది. ఫలకుసుమాది యోగమున శీతోష్ణసౌరభాదులుగలుగును దీనివలన త్వగింద్రియాప్యాయకత్వము శబ్దస్పర్శములు గుణములు. శరీరధారణాది హేతువగు వాయువిశేషము ప్రాణముప్రాణాపానవ్యానోదానసమానభేదమున ప్రాణము ఐదువిధములు హృదయమున ప్రాణము గుదమున నపానము సర్వశరీరమున వ్యానము కంఠమున నుదానము నాభినిసమానము ఈ నియమము జంగమములకే స్థావరములకు ప్రాణసంబంధము స్వల్పము. వాయుతేజోమధ్యమావస్థా విశిష్టద్రవ్యము రూపతన్మాత్రము. దాన తేజస్సు పుట్టినది. ఉష్ణస్పర్శత్వ భాసురత్వములు తేజోగుణకములు. బహిఃపచన హేతువువహ్నిసూర్యాది భేదమున నుండును. గర్భమున వైశ్వానరరూపమున నుండును. ఇదియె జాఠరాగ్ని. దివాభీతాది వ్యతిరిక్తముగ సర్వభూతముల కవలోక్యము. ఈ యగ్ని నాలుగు విధములు. 1 భౌమము 2 దివ్యము 3 ఆకరజము 4 ఔదర్యము. పార్థివేంధన రూపము భౌమము. దీపాది జలమాత్రేంధన రూపము దివ్యము. సూర్యాది జలపార్థివేంధనరూపము ఔదర్యము. జాఠరాది నిరింధన మాకరజము. సువర్ణాది తేజస్సలిలమధ్యమావస్థా విశిష్ట ద్రవ్యము రసతన్మాత్రము. దీనివలన నుదకము పుట్టినది. ఇది చల్లని స్పర్శకలది. సముద్రాది భేదమున బహువిధము మధురరసము కలది. శుక్లమధురశీత స్వభావము. దీనికి శబ్దస్పర్శరూపరసగంధములు కలవు. పచన పిండీకరణ హేతువు అప్పృథివీ మధ్యమావస్థా విశిష్ట ద్రవ్యము గంధతన్మాత్రము. దీనివలన పృథివి పుట్టినది. ఇది సురభి మధురము, కృష్ణస్వరూపము అనుష్ణశీతస్పర్శవతి పాకభేదమున బహు విచిత్ర రూప గంధవతి మనోఘ్రాణాప్యాయకత్వమున బహురూపకారి. మృత్పాషాణా న్నౌషధాది బహురూపము శీతస్పర్శ రూపగంధ రస గుణకము ధారణహేతువు. తమస్సనునది పృథివ్యంతర్భావము భూచ్ఛాయయె చీకటని కొందరనుచున్నారు. పరమేశ్వరుడు పంచీకరణముజేసి పృథివ్యాదులను పుట్టించెను. పంచీకరణమున పంచభూత విభాగ సంయోగము, అదిట్లు చేయబడినది. భూతమునగా నొక

రూపాయయని లాఘవార్థ మనుకొందము. భూతముల నన్నింటిని ప్రత్యేక ప్రత్యేకముగ నైదేసి విభాగములనుజేసి యనగా ఒక రూపాయను రెండు విభాగములను జేసెను. మొదటి విభాగము నొక చోట నుంచి రెండవ విభాగమును నాలుగు భాగములు జేసెను. విభాగము ఒక్కంటికి బేడ వచ్చినది. మొదటి విభాగము అర్ధరూపాయి. అవి నాలుగు బేడలు. మొత్తము అయిదు విభాగము లయినవి. యిట్లనే యన్ని భూతములను విభజించెను. తదనంతరము అభీష్టభూతముయొక్క మొదటి విభాగమగు నర్ధరూపాయ స్వభాగము. దానియందు తక్కిన భూతములయొక్క నాలుగు విభాగములను క్రమముగ జేర్చెను. అట్లు చేర్చిన స్వభాగ మెనిమిది యణాలు. పరభాగములు నాలుగు జేరి యెనిమిది యణాలు కలిసి రూపాయయైనది. ఇదియే పంచీకృత భూతము. స్వభాగ మధికమగుట స్వనామధేయము కలిగినది. ఉదాహరణము: పృథివి యొకరూపాయ యనుకొందము. దానిని రెండు విభాగములు జేసిన భాగము ఒక్కంటికి యర్ధరూపాయవచ్చినది. అనగా రెండర్ధములు యేర్పడినవి. మొదటి యర్ధరూపాయ పృథివీభాగము. రెండవయర్ధభాగమును నాలుగుచే భాగింపగా విభాగము ఒక్కంటికి రెండణాలు వచ్చినవి. ఇట్లనే తక్కిన భూతములన్నిటిని విభజించి యొకచో నుంచుకొని మొదట పృథివీభాగమగు అర్ధరూపాయలో అబ్విభాగమగు బేడను తేజోవిభాగమగు బేడను వాయువిభాగమగు బేడను ఆకాశవిభాగమగు బేడను అనగా నాలుగు భూతములయొక్క నాలుగుబేడలను పృథివీ విభాగమగు అర్ధరూపాయలో చేర్చగా రూపాయయైనది. ఇందు పృథివీ విభాగము సగమగుటచేత స్వభాగమధికమై పృథివీభూతమైనది. ఇట్లనే భూతములన్నియు నేర్పడినవి. ఈ భూతపంచకము కార్యోన్ముఖమయినది. జీవులకు ప్రకృతి శరీరములుగ పరిణమించినది. జీవులు (ప్రాణులు) పృథివ్యాదులయందు వర్తించిరి. ప్రాణులు జంగమ స్థావరోద్భిజ్జస్వేదజ జరాయుజాండజాదులు మనుష్యతిర్యగాదులు జంగమములు. వృక్షగుల్మలతాదులు స్థావరములు. వేణ్వాదులుద్భిజ్జములు. పక్ష్యాదులండజములు. బ్రహ్మాండోత్పత్తికి పూర్వసృష్టి సమిష్టిసృష్టి బ్రహ్మాండోత్పత్త్యనంతర

సృష్టి వ్యష్టిసృష్టి ప్రకృతి మహదహంకారైకాదశేంద్రియ పంచతన్మాత్ర పంచభూత జీవేశ్వర భేదమున నిరువదియారు తత్వములు.

సీ. సత్వరజస్తమ స్సామ్యంబుగలిగిన ప్రకృతి యనగనొప్పె ప్రకటముగను
సత్వరజస్తమ స్సంసిద్ధి భేదించి మహదాదులయ్యెను మహితముగను
నిత్యవిభూతినా నియమితమైయుండె విరజ కావలనున్న విశ్వమెల్ల
విరజ కీవలనుండు విశ్వంబు లీలావిభూతిగా బఱగెను భూరితేజ!

గీ. ప్రకృతిబద్ధులు బ్రహ్మాదిబద్ధులెల్ల
ప్రకృతిబంధంబు విడిపోయి ప్రబలులౌట
ముక్తులనువారు హరికృప ముదితులైరి
యపునరావృత్తి వారికి యలరియుండె

సీ. జలబుద్బుదమునకు సమములౌ బ్రహ్మాండ జాలంబులెల్లను చక్రపాణి
సంకల్పవశమున సమకాలమందున యుగపదుద్భితములు యోగవిదుడ
బ్రహ్మాండమందున పదునాల్గులోకముల్బహువిధజంతువుల్బరగుచుండె
కర్మయె వారికి గతులను సమకూర్చు జనన మరణచక్ర చలితులైరి

గీ వారలకునెల్ల హితముల వరలజేయ
గోరి విష్ణుడు బోధించె గూఢముగను
శాస్త్రతతులను గావున శాస్త్రవిధుల
దాటవలువదు శక్తులు ధర్మపరులు.

సీ. కనులగాంచగలేని కమలాక్షుమహిమల వర్ణింపనేఱికి వశముగాదు
కనులగాంచగగల్గుకమనీయమాయను తెలివితేటలబెంచి తెలియవలయు
దానిని దెలియగదగినసాధనములు కలిగియున్నవిసుమ్మ కలితయశుడ
కావున భూలోకగతములౌ వస్తుల గనవలె వినవలెఘనులజేరి

దానగలుగునుసుజ్ఞానతతియుమిగులదానదెలియునుసృష్టిసంధానమహిమ
దానకర్తనుదెలిసెడి దారిదొఱకు దానినెఱిగినవాడెపోధన్యతముడు

గీ. ప్రకృతిగతవస్తు సంయోగబలమువలన
చిత్రశక్తులు పొడమును చిత్రముగను

బుద్ధిబలమున వస్తులబూన్కి-గూర్చ
నవనవంబులు గలుగును నాణెముగను

సీ॥ బుద్ధిమంతులు చాలగ బుద్ధి బెంచ
వస్తుసంయోగ పాకంబు వాసిజేయ
నిప్పు నీరును బుట్టును నిజముగాను
దాన ముంపగ గాల్పగదగును సుమ్ము॥

ఇది యచిత్ప్రకరణము

—♦ ఇక నీశ్వర ప్రకరణము ♦—

కం॥ భగవత్తత్త్వము దెలిపెద
సుగుణాకర! భరత! వినుము సువ్రతమహిపా!
నిగమంబు లెట్లుబలికెను
తగనట్టుల బలుకువాడ తథ్యము సుమ్మీ॥

వ॥ సర్వేశ్వరత్వము సర్వశేషిత్వము సర్వకర్మ సమారాధ్యత్వము సర్వకర్మఫలప్రదత్వము సర్వాధారత్వము సర్వకార్యోత్పాదకత్వము సర్వశబ్ద వాచ్యత్వము సర్వజ్ఞానవిషయత్వము స్వేతరసమస్త వస్తు శరీరత్వము మొదలగునవి ఈశ్వర లక్షణములు. నారాయణోపనిషత్సు బాలోపనిషన్మైత్రాయణీయ పురుషసూక్త నారాయణాను నాకాంత ర్యామి బ్రాహ్మణాదులు నారాయణునకు పరమకారుణికత్వ సర్వశబ్ద వాచ్య మోక్షప్రదత్వ సర్వజగచ్ఛరీరకత్వాదులు కలవని చెప్పుచున్నవి. ఇట్టి నారాయణుడు పరవ్యూహ విభవాంతర్యామ్యర్చా భేదంబున నైదు విధములుగ నున్నవాడు. పరుడనగా నిత్యవిభూతియందు అనంత గరుడ విష్వక్సేనాది నిత్యశూరులతో గూడి దివ్యమందిరమున శేష పర్యంకమున శ్రీభూనీళాదులు పరిచర్యలొనర్చుచుండ నిత్యముక్తులు ఏకధాద్విధా బహుధాశరీరధారులై కైంకర్యంబులొనర్చుచుండ వేంచేసి యుండు మూర్తి విశేషము. వ్యూహమన వాసుదేవ ప్రద్యుమ్నానిరుద్ధ సంకర్షణ భేదముననుండు మూర్తి విశేషము. విభవమన రామకృష్ణా ద్యవతార రూపమున భూభార హరణార్థ మవతరించిన మూర్తి

విశేషము. అంతర్యామియన పిపీలికాది బ్రహ్మపర్యంతము సకలాండ కటాహములయందు గల సకల పదార్థములయం దంతర్బహిర్వ్యాప్తి రూపవిశేషము. అర్చారూపమన శ్రీరంగాది సకల దివ్యక్షేత్రముల యందు, అర్చకపరాధీన సర్వావస్థుడైయుండు మూర్తివిశేషము. ఇట్లు భక్తసౌకర్యార్థ మయిదు విధముల భగవంతు డున్నవాడు. వేయేల? శ్రీమన్నారాయణుడె మనభాగ్యవిశేషమున భవద్భ్రాతయగు శ్రీరామ చంద్రభగవానుడు, ఆ శ్రీమహాలక్ష్మియే యీ సీతామహాదేవి. మనకు మిన్నిధులవలె మన చర్మచక్షువుల కగుపించుచున్నవారు. నీవు సహజముగ బాల్యమునుండియు రామభద్రు నాశ్రయించితివి. మేమును మాన సికధ్యాననిష్ఠ రాముని సర్వదా కొలుచుచుందుము. రామపదము భగవత్పదములలో నెల్ల సత్యోత్తమము. వేదవేదాంత బోధితము. ఈ తత్త్వమెఱిసియె మీ యగ్రజునకు రామనామమును నామకరణమహో త్సవసమయమున నిర్ణయించబడినది. రాముడన చిదచిద్విశిష్ట పరమాత్మ యని పరమోత్తమార్థము.

గీ. సర్వకారణభూతుడు సర్వవిభుడు
చిదచిదంతర వర్తియు శేషియతడు
వరవిబోధిత సద్బ్రహ్మపదము లెల్ల
వరలు నారాయణాఖ్యలై వాస్తవముగ.

గీ. నామరూపాదికములేని నవ్యదశను
సూక్ష్మ చిదచిదంతరమున సూక్ష్మముగను
నిలచియుండియు పిమ్మట నిరుపమాన
నామరూపంబులనుగూర్చె నాణెముగను.

గీ. ఆదియందున చిత్తులు (జీవులు) హాయిగాను
ప్రకృతియందున నిలచెను ప్రబలముగను
నామరూపంబు లప్పుడు నాస్తి యయ్యె
సూక్ష్మదశ యది తెలియుము సూరివినుత!

గీ. చిదచిదంతరమందున చిత్రముగను
సిలచియుండును పరమాత్మ నియతముగను
తలచె సృష్టిసి జేయుగ తగినరీతి
స్థూలదశయందు రక్షాని సుష్ఠుగాను

క. గతకల్ప కర్మ శేషము
జితవిషయా జీవతతికి చెందుటచేతన్
గతజాతివర్ణగుణములు
ప్రతిజీవున కుచితవృత్తి ప్రబలుచునుండెన్.

వ. భరతరాజా! తత్త్వముల మాటెని వినిపించితిగాన తత్త్వవేత్త వగు నీవు సర్వదా మఱువక భగవంతునాశ్రయించుము. భగవదాశ్రితు లెప్పుడును భగవత్కటాక్షమున సర్వశ్రేయస్సులను పొందుదురు. నీకు సహజముగ గలిగిన రామాశ్రయణము నెప్పుడు విడువక తదనుగ్రహ పాత్రుడవుగమ్మ అని పలికెను. ఇది యీశ్వర ప్రకరణము.

—♦ జాబాలి యుపదేశము ♦—

గీ. వినుము నామాట భరతుడ! విశ్వసించి
తత్త్వమెల్లను దెలిపెద తగినయటుల
రామభక్తిని తగిలిన ధన్యమతివి
రామశబ్దార్థమును విను రమ్యముగను

వ. రామ యను పదము క్రీడాయామను ధాతునిష్పన్నము. రామయన 'రమయతీతి రామ' యను వ్యుత్పత్తిచేత క్రీడించువాడని యర్థము. అనగా ప్రకృతిపురుషులతో లీలావిలాసములతో నాటలాడుచుండు వాడని యర్థము. లేదా మునుల హృదయములయందు క్రీడించువాడని యైన యర్థము. ప్రకృతిపురుషులతో నాటలాడువాడన చిదచిద్విశిష్టు డని భావము. ఇందువలన నీ రామపదము తత్త్వత్రయబోధకము. పరమే శ్వరుడు సర్వబహిరంతర్వర్తియైయుండి జీవకర్తృక సర్వవ్యాపారములను చూచుచు మంచిపనులయందు సంతోషమును చెడుపనులయం దుపేక్షను

పొందును. సకలబ్రహ్మాండములను సకలజీవులను తన క్రీడాపరికరములుగ భావించును. సృష్టిస్థితిలయాదులే యాటలు. రాముడనగా శరీరసౌంద ర్యముచేత విరాగులగు యోగిజనులనుకూడ సరాగుల నొనర్చి చిత్త వికారమున తన శరీరము నాలింగముజేయు కోర్కెలు గలవారలుగ నొనర్చువాడని యర్థము. పురుషులకు మోహమును గలిగించు శరీరము కలవాడని భావము.

క. రాముడె నారాయణుడని
నీ మనమున నమ్ము మెపుడు నియతాత్ముడవై
రాముని గొలిచినవారలు
కామాదులనెల్ల గెలిచి కాంతురు పరమున్.

వ. కావున నీవు నీసోదరులు రామభగవానునియం దగ్రజరూప పరమాత్మయను భావనచేతను లోకమాతయగు మన సీతామహాదేవి భర్తృరూపపరమాత్మభావనచేతను మునులమగు మేమందరము రామ రూపపరమాత్మభావనచేతను ప్రజలందరు రాజరూపపరమాత్మభావన చేతను భావించి మనమందరము రాముని కొలుచుచుండుటచేత మన మందరము కృతార్థులము కాగలము. దృఢభావన యెన్నడును వ్యర్థము కాదు. నిశ్చయముగ మనమందరమును సిద్ధిని పొందగలము. మనకందరికిని భావనాభేదమున్నను లక్ష్యమొకటియే. యోగి హృదయగమ్యుడగు రాముని యోగదృష్టి నవలోకించు మాకంటె సంతతరామనామాను సంధానతత్పరమతివై యన్యచింత లేకుండు నీవే ధన్యుడవు. ఈ విచిత్ర జగన్నాటకమున జీవులందరు పాత్రలు. ఈ విచిత్ర జగన్నాటకమున సూత్రధారి భగవానుడు. ప్రతిపాత్రయు విచిత్రముగ దన చరిత్రము నభినయించును. కారణములేని కార్యముండదు గాన నీ ప్రపంచ కార్యమునకు కర్త యొకడుండితీరును. సర్వప్రాణుల కాహార నిద్రా భయ మైథునాదులు తుల్యములు. పశువులకంటె మనుష్యులకు జ్ఞాన మొకటి యధికముగనున్నది. కనుక తనకుగల జ్ఞానమును సద్గురూప దేశమున విస్తరింపజేసికొని వివేచనాశక్తిని బెంచి దానిని పరతత్త్వవిషయ

మున నుపయోగించి గురుకృప విజ్ఞాతతత్త్వుడై పరమాత్మానుగ్రహము నార్జించి దాన నిత్యసుఖానుభవమును పొందవలెను. కలియుగమున మానవాయుఃకాలము నూటయిరువది సంవత్సరముల నైదురాత్రము లని శాస్త్రములు చెప్పుచున్నవి. కాని యది ప్రతిమనుష్యునకు కాదు. ఒకానొకనికిమాత్రమె చెల్లును. పూర్వజన్మకర్మవిశేషమున నీజన్మమున జీవించుకాలము నిర్ణయించబడియుండును. మృత్యువు యేక్షణమున గలుగునో తెలిసికొనుట కెవరికిని శక్యముకాదు. కనుక ప్రతిమనుజుడును చిరకాలము బ్రతుకుదునని గర్వించక మృత్యువాసన్నముగ నుండునని తలచుకొని కాలమును వ్యర్థమొనర్చక సర్వరక్షకుడగు పరమాత్మ యొకడున్నాడని దృఢముగ నిశ్చయించుకొని పరమాత్మానుగ్రహమున తాను పరమపదమును చేరు మార్గము నరయవలెను. అది సద్గురూప దేశలభ్యము. పరమాత్మ మన కగుపించుటలేదే, పరమాత్మ యున్నా డని నమ్ముట యెట్లనిన నారాయణు డతీంద్రియుడు. మన చర్మ చక్షుస్సులకు గోచరించువాడు కాడు. కనిపించనివాడు లేడనకూడదా యన నట్లనకూడదు. మన నేత్రముల కతీంద్రియవస్తువులను కనుగొను శక్తి లేదు. జ్ఞానచక్షుస్సున కవి గోచరములు. జ్ఞానచక్షుస్సు యోగ లభ్యము. యోగము చిరప్రయత్నలభ్యము. సామాన్యులకు లభించునది కాదు. ఇక నతీంద్రియవస్తుజ్ఞాన మెట్లనిన దేనినైన దెలిసికొనుటకు ప్రత్య క్షానుమానశాబ్దములు ప్రమాణములు, భగవంతు నెఱుగుటకు ప్రత్యక్ష ప్రమాణము పనికిరాదు. కనులకు కనిపించువాడు కాడు గనుక నిక ననుమానప్రమాణమువలన దెలియవలెను. లోకములో కర్తలేనికార్య మెచటను లేదు గనుక నీ ప్రపంచకార్యమునకుకూడా కర్త యొకడుండి తీరవలెనని యనుమాన ప్రమాణము బోధించుచున్నది గనుక భగవంతు డున్నాడని నమ్మవలెను. మఱియు శబ్ద ప్రమాణమును బట్టియు విచారింతము. శబ్దమన వేదము. స్మృతులు పురాణములు. వాటిని తెలిపెదను. శ్వేతాశ్వతరోపనిషత్ "తస్మాన్మాయీసృజతేవిశ్వమే తత్తస్మిన్నాన్యోమాయయాసంప్రవిష్టః" ఈ శృతి ప్రకృతి, యీశ్వరుడు, జీవుడు భిన్నులనియు భగవంతుడు విశ్వమును సృజించుచున్నాడనియు

చెప్పుచున్నది. శ్రు॥ క్షరంప్రధానమమృతాక్షరంహరః॥ క్షరాత్మానావీశతేదేవఏకః॥ ఈ శ్రుతి చిదచిదీశ్వరులు భిన్నులని చెప్పుచున్నది. శ్రు॥ వ్యక్తావ్యక్తంభరతేవిశ్వమీశః॥ ఈ శ్రుతియు ప్రకృతి జీవులు ఈశ్వరుడుభిన్నులని చెప్పుచున్నది. శ్రు॥సకారణాధిపాధిపః॥ నచాస్యకశ్చిజ్జనితానచేశ్వరః॥ పరమేశ్వరుడు సమస్తకారణుడు. అతనికంటె యధికుడు లేడు. పుట్టుక లేదు. ఈ శ్రుతి పరమేశ్వరుడున్నాడని స్పష్టముగ తెలుపుచున్నది శ్రు॥ ప్రధానక్షేత్రజ్ఞపతిర్గుణేశః॥ భగవంతుడు ప్రకృతికి జీవులకు అధిపతి. సమస్తకళ్యాణగుణములు కలవాడు. శ్రు॥ పతింవిశ్వస్యాత్మేశ్వరం శివమచ్యుతం॥ పరమేశ్వరుడు విశ్వమున కధిపతి జీవుల కధిపతి సత్యముగనుండువాడు మంగళప్రదుడు నిత్యుడు. శ్రు॥ జ్ఞాజ్ఞౌద్వావజావీశానీశౌ॥ ఈశ్వరుడు సర్వజ్ఞుడు జీవుడు స్వల్పజ్ఞుడు. ఇరువురుపుట్టుక లేనివారు. ఈశ్వరుడు ప్రభువు జీవుడు దాసుడు। శ్రు॥ నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానాం ఏకోబహూనాంయోవిదధాతికామాన్। ఈశ్వరుడు నిత్యులలో నిత్యుడు. చేతనులలో చేతనుడు. ఒక్కడగు పరమేశ్వరుడు బహుజీవుల కోరికల నిచ్చును. శ్రు॥ భోక్తాభోగ్యంప్రేరితారంచమత్వా॥ భోగ్యము ప్రకృతి భోక్తజీవుడు. ప్రేరితపరమేశ్వరుడు. శ్రు। పృథగాత్మానంప్రేరితారంచమత్వాజుష్టస్తతస్తేనామృతత్వమేతి॥ జీవులు భగవానుఁబు భిన్నులని తెలిసికొని మోక్షమును పొందుచున్నాడు. శ్రు॥తయోరన్యఃపిప్పలంస్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి॥ జీవేశ్వరులలో జీవుడు రుచిగల కర్మఫలము ననుభవించును. పరమేశ్వరుడు కర్మఫలానుభవము లేనివాడై ప్రకాశించుచుండును. శ్రు। అజామేకాంలోహిత శుక్లకృష్ణాం బహ్వీఃప్రజాః జనయంతీంసరూపాఃఅజోహ్యేకో జుషమాణోఽనుశేతే। జహాత్యేనాంభుక్తభోగామజోఽన్యః॥ ఈశ్రుతియు జీవేశ్వర ప్రకృతుల నిత్యత్వమును బోధించుచున్నది. శ్రు॥సమానే వృక్షేపురుషోనిమగ్నః అనీశయాశోచతిముహ్యమానః జుష్టంయదాపశ్యత్యన్యమీశమస్యమహిమానమితిశోకః॥ ప్రకృతి యను వృక్షమున జీవేశ్వరులు నివసింతురు. అందు జీవుడు తాను ఈశుడు కానందున మోహితుడై శోకించును. పరమాత్మ నవలోకించి పరమేశ్వరమహిమను తెలిసికొని దుఃఖమును విడచినవాడైయుండును.

భగవద్గీత। భూమిరాపోऽనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ అహంకారఇతీయం మేభిన్నా ప్రకృతిరష్టధా । (నా ప్రకృతి) భూమి జలములు వహ్ని యు వాయువును ఆకాశము మనస్సు బుద్ధి అహంకారమును భేదమున ననిమిదివిధములు. శ్లో. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం జీవభూతాంమహాబాహోయయేదంధార్యతేజగత్ ॥ దీనికంటె యన్యమైన జీవప్రకృతియు కలదు. శ్లో. సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాంతిమామికాం । కల్పక్షయేపునస్తాని కల్పాదౌవిసృజామ్యహం కల్పాంతమున సర్వభూతములు నాప్రకృతిలో నిలుచును. వాటిని కల్పాదియందు విడుచుదును. శ్లో॥ ప్రకృతింస్వామవష్టభ్యవిసృజామిపునఃపునః భూతగ్రామమిమంకృత్స్నమవశంప్రకృతేర్వశాత్ ॥ యీ భూత సముదాయమంతయు కల్పాంతమున ప్రకృతిలో ప్రవేశింపజేసి కల్పాది యందువిడుచుచుందును శ్లో॥ మయాధ్యక్షేణప్రకృతిఃసూయతేసచరాచరం మమయోనిర్మహద్బ్రహ్మతస్మిన్గర్భందధామ్యహం॥ నేను పైన నధికారిగా యుందును. ప్రకృతి చరాచర జగత్తును కనుచున్నది. ప్రకృతి మదీయ యోని. దానియందు గర్భమును నేనుంచుదును. సంభవస్సర్వభూతానాంతతోభవతిభారత॥ సర్వభూతములు దానివలన పుట్టును. ఈభగవద్గీతా వచనములు జీవేశ్వరప్రకృతుల భేదభావమును స్పష్టముగ తెలుపు చున్నవి. బృహదారణ్యకోపనిషదంతర్యామి బ్రాహ్మణమున. శ్రు॥ యఃపృథివ్యాంతిష్ఠన్, అని ప్రారంభించి యఆత్మనితిష్ఠన్నాత్మనోంతరోయఆత్మానవేదయస్యాత్మాశరీరంయ ఆత్మానమంతరోయ మయత్యేంతరోయమయత్యేంతర్యామ్యమృతః॥ సుబాలోపనిషత్తుశ్రు॥ "యఃపృథివీమంతరేసంచరన్ యస్యపృథివీశరీరం యంపృథివీంనవేద"యని ఆరంభించి యోక్షరమంతరే సంచరన్ యస్యాక్షరం శరీరంయమక్షరంనవేద యోమృత్యుమంతరేసంచరన్ యస్యమృత్యుశ్శరీరం యంమృత్యుర్న వేద ఏషసర్వభూతాంతరాత్మా అపహతపాప్మాదివ్యోదేవఏకోనారాయణః తైత్తిరీయమునఅంతఃప్రవిష్టశ్శాస్తాజనానాగం॥ ఈశ్రుతులన్నియు సర్వావస్థలయందును చిద చిత్తులు పరమపురుషునకు శరీరములని తెలుపు చున్నవి. ఇట్టి శ్రుతిస్మృతీతిహాసపురాణమ్ము లనేకములు కలవు. కనుక నే

పరమపురుషుడు స్థూలసూక్ష్మచిదచిద్వస్తుశరీరుడు కార్యావస్థయందును కారణావస్థయందునుకూడ నుండును. కారణము కంటె కార్యము వేరు కానందున కారణము నెరిగిన కార్యము తెలియును. ఏకవిజ్ఞానమున సర్వవిజ్ఞానము కలుగును. కార్యకారణములు స్థూల సూక్ష్మ చిదచిద్విశిష్టబ్రహ్మాత్మకమైనందున ప్రపంచమునకు బ్రహ్మకారణము. ఆ బ్రహ్మ చిదచిద్విశిష్టమైనందున చిదచిద్బ్రహ్మసంఘాతము ఉపాదానము. కేవల బ్రహ్మ ముపాదానకారణము కాదు, గనుక చిదచిత్తులకును, బ్రహ్మమునకును స్వభావసాంకర్యము లభించదు. అదియెట్లనిన తెలుపు, నలుపు, యెరుపు రంగులు తంతువ్రలయందే యుండునుగాని సాంకర్యము నొందవు. చిదచిదీశ్వరసంఘాతము జగత్తున కుపాదానకారణమైనను కార్యదశయందుకూడ భోక్తృత్వ భోగ్యత్వ నియామ్యత్వములు వ్యవస్థితములై యుండునుగాని సంకీర్ణములు గావు. చిదచిత్తులు సర్వదా పరమాత్మకు శరీరములేకాని వేరుగనుండవు. చిదచిచ్ఛరీరకుడైన పరమాత్మ సర్వావస్థలయందును సర్వశబ్దవాచ్యుడై యుండును. పరబ్రహ్మము కార్యావస్థయందు ప్రవేశించినను తత్ స్వరూపము మార్చుకొనదు. శృతులు తెలిపెడి నిర్వికారత్వము యుక్తమగును. స్థూలదశయందు నామరూపవిభాగము కల్గి చిదచిద్వస్తువుల కాత్మయగుట పరమాత్మకు స్వభావము. బ్రహ్మనిర్వికారియన ప్రకృతివలె బ్రహ్మస్వరూపము మారదని భావము. చిదచిత్తులు సర్వదా బ్రహ్మశరీరములగుట సిద్ధము. బ్రహ్మమునకు చిదచిదాత్మకము సిద్ధము. బ్రహ్మకు శరీరములగు చిదచిత్తులకు కారణదశయందునామరూపవిభాగానర్హమును సూక్ష్మదశాపత్తియు కార్యదశయందు నామరూప విభాగయోగ్యస్థూలదశాపత్తియని, శృతులు తెలుపుచున్నవి. శృ॥ నిత్యోనిత్యానాం అనుశ్రుతి జీవుడు ఈశ్వరునివలెనే నిత్యుడని తెలుపుచున్నది. కావున జగదుత్పత్తిలయకారకు డఖిలహేయప్రత్యనీక కల్యాణగుణసాగరుడు నారాయణశబ్దవాచ్యుడు పరబ్రహ్మముఅగు శ్రియఃపతిసర్వదాధ్యేయుడు.

సీ. దేవుడునరుడును దేహంబుజంతువు స్థావరమింద్రియ చయము బుద్ధి
ప్రాణముమనసును ప్రకృతివికారియు జడమును తెలివియుజగమునరయ

నాత్మయనగ చెల్లదనువగు నీయాత్మ ప్రతిదేహభిన్నమై ప్రబలుచుండు
నిత్యనిర్మలమును నిత్యైకరూపంబు తనకుతాను వెలయుతగినయదియు

గీ. వ్యాప్తి శీలంబుచేత నవ్యక్తి దనరు
జ్ఞానరూపంబు నానందసంయుతంబు
జ్ఞాతకర్తయు భోక్తయు సహజముగను
సర్వశేషికి శేషంబు సత్యముగను.

క. నేననుచు బలుకుచుండెడి
జానగు నహమర్థరూప చతురతగలయా
మానితరూపము మహితులు
మానుగ జీవాత్మయనుచు మతి నెంతురనూ

క. జీవాత్మయు పరమాత్మయు
భావాతికమైన మాయ పరికింపంగా
నా వేదవేద్య నిత్యత
నీవస్తుత్రితయమందు నేర్పరియుండెన్.

గీ. ఆత్మ జీవుడు పరమాత్మయనగ నీశు
డాత్మలెన్నగ పెక్కండ్రు హరియొకండు
ప్రకృతి యొక్కటి జీవులు ప్రకృతిచేత
బద్ధులగువారు బద్ధులు భవ్యచరిత

గీ. ప్రకృతిబంధంబు విడనాడి ప్రకృతిదాటి
ముక్తికేగినవారలు ముక్తులైరి
ప్రకృతిసంబంధ మెరుగక ప్రబలుకతన
నిత్యులనిపిల్వబడువారు నియతితోడ.

సీ. అదియిదియనుచును ననగశక్యముగాని ప్రతికల్పకృతజీవ భయదకర్మ
వశమున బుట్టెడి పరపుణ్యపాపంబు లచలంబులనుబోలి యలరుచుండ
నెన్నిజన్మములైన నెత్తి యనుభవించ నారానులందంబు నందబోవు
ప్రతిజన్మకృతకర్మఫలమందునను జేరి పెరుగుచుండునుగాని తఱుగ వెప్పుడు

గీ. కర్మపరిపక్వఫలములు కాలవశత
నాకనరకసంస్థితి జేర్చు నరవితతికి
నాకవాసంబు సుఖమును నరకమధిక
కష్టతతులను సతతంబు గలుగజేయు.

గీ. జన్మతోడను గలుగును జంతుతతికి
కష్టసుఖలాభనష్టేష్టకలన మిగుల
చక్రమునుబోలి మృతిజన్మ సంగతియును
దిరుగుచుండును విధి నెవ్వ దిద్దగలరు ?

గీ. కాలవశులైరి శంకర కమలభవులు
దివ్యమునులను కాలంబు దిద్దగలిగె
కాలమునగల్గు శక్తిని గాంచగలమె?
కాలమనునది విష్ణువె కలితయశుడ !

—♦ భాస్కర చరితము ♦—

సీ. అవనీశ! వినవయ్య యద్భుతచరితంబు భరతఖండమునందు భవ్యమైన
కళ్యాణపురమునగలడొక విప్రుడు భాస్కరుడను పేర బరగువాడు
బహుభారసంసారబహుళార్తియుక్తుడువయసు చెల్లినవాడువళితతనుడు
తాపత్రయాభీలదావాగ్ని సందగ్ధ సకలేంద్రియాభీల సంయుతుండు

గీ. విత్తలోలుడు మూర్ఖుడు విబుధవైరి
సతత దుష్కృతకార్యుడు చలితబుద్ధి
విస్మృతాత్మస్వరూపుడు వీరమాని
గర్వి కార్పణ్యయుక్తుడు కలహపరుడు.

వ. అట్టివాని గృహంబునకు నేనును కశ్యపుడను నొక మునియు కాలవశమున పెనువానతాకునకు తడిసి డస్సి గడగడవడంకుచు శీత వాతంబుల కాగలేక యొకదినంబున చేరితిమి. అతడు మముచూచి "యయ్యలార ! మీరు మాయింటికి నేగుదెంచితిరి. ఇటకు వచ్చిన వారికి డబ్బువెచ్చించిన సకల సదుపాయంబులును జరుగును. మిమ్ము

చూడ డబ్బులేనివారివలె నగుపించుచుంటిరి. డబ్బులేనివారి కిచట
నేమియు లభించదు. ఆ కనపడు గొప్ప సౌధంబునందుండు వేంకట
సోమయాజులు దేశమంతయు దిరిగి క్రతువొనర్తునని యాచించి యధిక
ధన మార్జించి సోమయాజియనిపించుకొని యా సౌధమును నిర్మించి
యందున్న వాడు. అన్న దాతనని పలుకుచుండును. మీరచ్చటకు పొండు.
భోజనము దొరకు"ననియె. నే నతని నవలోకించి "నీవు గృహస్థుడవు,
మేము పాంథులము. ఇది రాత్రిసమయము. ఇటనుండి మే మచ్చటికిని
పోజాలము. మాదగ్గర గుడ్డిగవ్వయైనను లేదు. కరుణించి తావొసగి
మా కోగిర మొసగుము. నీకు పుణ్యము కలుగును. నీవు వృద్ధుడవు.
ఇట్టి కష్టము లనేకము లనుభవించి యుందువు. మమ్మాకలి మిగుల
బాధించుచున్నది. సత్వరంబుగ కరుణించు" మంటిని. నా మాటలనువిని
యాతడాగ్రహావేశమున "చాలు చాలు. ఇట్టి మాటలు కట్టిపెట్టుము.
మీవంటివార నేకులు రాగలరు. మీరును నావలెనే ఏదేని వృత్తి
నవలంబించి జీవించరాదా? ఈబిచ్చపువేషమేల? ఒడళ్లు బలిష్ఠముగనే
యున్నవి. పాటుపడుటకు శక్తియున్నది" అని పలుకుచు కవాటంబు
బంధించి లోనికిజనియె. మే మిరువుర మచటనుండి యెటకును పోలేదు.
గాఢాంధకారంబును ధారాపాతవర్షంబును నధికమగు చుండెను.
మేమా గృహబహిర్వేదికయందుండి బట్టల నారబెట్టుకొనుచుంటిమి.
ఆకలి మిగుల బాధించుటచేత నాగేస్తును బహువిధంబుల మేమిర్వురమును
బిలచితిమి. అతడతికఠినహృదయుడగుట మా మాటల గణనచేయలేదు.
నేనంతట సాహసించి రెండుచేతులతోడను తలుపులను తట్టుచు నాగృహ
స్వామిని బిలచితిని. కొంతసేపటికతడు తలుపు తెరచుకొనివచ్చి కఠినముగ
పరుషోక్తులాడెను. నేను మూర్ఖు నారాధించుటకు తగిన స్తుతివాక్కులను
ప్రియవాక్కులను పలుకుచు మాకుగల క్షుద్బాధను శీతబాధను చెవుల
కెక్కించితిని. కొంతసేపటికతడు నామాటలనువిని మమ్మిరువురను లోనికి
గొనిపోయి శుష్కవస్త్రంబుల నొసగి యన్నంబిడి రెండుకటంబులనిచ్చి
శయనించుటకు తావొసగెను. మే మిరువురమచ్చట విశ్రమించి కృత
జ్ఞులమగుట నాగృహస్వామి కేదేని యుపకార మొనర్ప దలచి బహు

సారులు అతనిని బిలచితిని. అతడు మావైపునకు దృష్టినైన పరపలేదు. అపుడు కశ్యపుడు శిష్యుడుగను నేను గురువుగనుండి శ్రీమదష్టాక్షర మహామంత్రమను మంత్రరత్నమును చరమమును సక్రమముగ సార్థకముగ నుచ్చైస్స్వరంబున నేనుచ్చరించితిని. కశ్యపుడు బహు సారులు నేనుచ్చరించిన దాని ననూచ్చరించెను. భాస్కరుడప్పుడు మా చెంత నిలచి వినియెను. రాత్రి చాలగనగుట యీ భాస్కరుడను వానిని రక్షించుమని భగవచ్ఛరణాగతిని చేసితిని. పిదప నిద్రా వశులమైతిమి. భార్గవోదయకాలమునలేచి కాల్యకృత్యంబుల నొనర్చి మా వస్త్రంబులధరించి యీ గృహపతివస్త్రంబుల కటంబుల నర్పించి ప్రయాణోన్ముఖులమైతిమి. ఆ గృహపతియు రాత్రివలెగాక భగవదను గ్రహముననో మంత్రశ్రవణమహిమనో వినయంబుగ మేము జనువరకు మమ్మనుసరించియే యుండెను. అట్టి ప్రచండచిత్తునకిట్టి వినయంబెట్లు కలిగెనోయని మేమద్భుతపడితిమి. అపుడు నేనునుదయాసాగరుడగు శ్రియః పతి యితనిని రక్షించుగాత యని భగవచ్ఛరణాగతినిచేసి యథేచ్ఛగ బోతిని. అంతచిరకాలమునకు నైమిశారణ్యప్రాంతమున యోగబలమున నే నాకాశమార్గమున బోవుచుండ నొక దివ్యవిమానము నా త్రోవ కడ్డపడి నిలచినది. అందుండు పురుషుడు దివ్యతేజోవిరాజితుండు. అతడు ననుగాంచి అతివినయంబున వందనమాచరించి మహానుభావా! చిర కాలమునకు పూర్వము కల్యాణపురమున భవద్దర్శనము లభించినది. నా గృహమునకు మీరును మీ మిత్రుడును దయచేసి మదీయదోషం బుల పరకించక నామేలు నాకాంక్షించి యనేక హితవాక్యంబుల నుపన్య సించి మంత్రరాజంబుల సార్థకంబుగా సవివరణంబుగా నాచెవుల బ్రవేశింప జేయ బ్రయత్నించితిరి. నా పాపాధిక్యంబున పూర్తిగా నా చెవులలో పడినవికావుగాని భవదనుగ్రహవిశేషంబున కొంతకొంత నా కర్ణములో పడినదానిని మాత్రము విస్మృతిని బొందక నిలచియున్నవి. తరువాత నామనస్సున కొకవిధమైన పరితాప మేర్పడినది. నా నడతనిందితమైన దని విచారించితిని. ప్రతిదానియందునను వైరాగ్య మేర్పడినది. ధారా పుత్రాదులయందు ధనుర్భాగము పోయినది.

కం॥ ఎరుగను నే నాశ్రయమును
బరువడి విపరీతబుద్ధి బరగెనుసుమ్మీ
యురుదగు రాగద్వేషము
లఱిమఱిలేకుండ నన్ను నలజడిబెట్టెన్.

గీ. సహజ సంస్థితి నెరుగక జడుడనగుచు
కర్మపాశంబు గట్టక కదలలేక
మందమతినౌచునుంటిని, మాటలేల?
కఠినచిత్తుడ పాపుడ కపటమతిని.

కం. చేయగరానిది చేసితి
మాయలచే బొందతగని మగువలనెల్లన్
కాయజవశమున బొందితి
పాయక తినరానివన్ని బలముగ దింటిన్.

కం. ఉరులవలె నింద్రియంబులు
బరువడి బంధింప వలలబడు పులుగువలెన్
తిరిగితి తుదమొదలిడియని
బరికింపగలేక తృష్ణపరుడనునైతిన్.

గీ. మంచిదానిని చెడ్డగ మదిని దలతు
చెడ్డదానిని మంచిగ చెలగియెంతు
యిట్టి విపరీతబుద్ధిని యిహము బరము
తెలియలేకుంటి సడలెను దేహబలము.

గీ. అటుల నింద్రియగోచరమైనరీతి
విషయతృష్ణకు వశుడనై వితథముగను
సంచరించితి గలిగెను జరయుమిగుల
కరణశైథిల్య మొదవెను కాంక్షహెచ్చె.

గీ. కరణశైథిల్య మొదవుట కార్యకరణ
పాటవములేక వర్తించ బడగు దేహ

భరము మోయగలేకను కరమునందు
కఱ్ఱబట్టుకు తిరిగితి గమన వేళ.

గీ॥ తినిన నరుగదు తినకున్న తిరుగలేను
చేయి కాలును కదలింప చేతగాదు
ఆశలన్నిట హెచ్చెబో యధిక కోప
వశత దిట్టుదు నందర వరుసబెట్టి

సీ॥ నామాటవినుచుండు నాతియెననుచూచి మెటికలవిరుచుచు మెలగసాగె
నామాటవినుచుండిననుగొల్చుపుత్రులే నాతికివశులౌచు నవ్వుచుండ్రు
బంధులమనికూడి పరచినవారలే ప్రార్థించి పిలచిన బలుకబోరు
మిత్రులమని పేలు మిగుల బొందినవారె దరిజేరగారారు దయనువీడి

గీ. కనులు వీనులు గనలేవు వినగలేవు
మాటదడబడె మితిమీరె మమతనాకు
నొడలు ముడుతలుబడియుండె నోర్వదొలగ
కాలు కదలదు కోర్కెలు కొమరుమిగిలె.

సీ॥ పుత్రులుదినుటయేపురుషార్థమనియెంచిభుజియింపలేనైతిభోజ్యములను
వడతిసంతోషంబెబహుభాగ్యమనియెంచి పడరాని పాట్లనుబడితిమిగుల
ధనమునార్జించుటతగుజన్మఫలమని తగనిమార్గము వెంట ధనముగొంటి
పరులబాధించుటే పరమార్థమనియెంచి పరమపూజ్యులబాధబరపినాడ

గీ॥ కాలమంతయు నీరీతి గడచిపోయె
ఫలము లేదయ్యె లేశంబు పరమపదము
చేరుమార్గము నెరుగక చెనటినైతి
రెంటచెడినట్టి రేవడి రీతినుంటి.

గీ. అల్పలాభంబు గోరుచు నధికమైన
కష్టములకోర్చి తిరిగితి కలుషమతిని
కాంత పుత్రులు కనకంబు క్రమగృహము
కలిగె నాకేమియున్నుకొంటి కష్టమొదవె.

గీ. తృష్ణ హెచ్చుట నింద్రియతృప్తి లేదు
భోగలాభంబు గలుగదు బోధలేదు
కరణపాటవ మిసుమంత కలుగబోదు
దుస్సహంబైన దుఃఖంబు దొలగదెపుడు.

గీ. ఆధు లధికంబుగాగల్గి యధికమైన
బాధనొందెను చిత్తంబు బలములైన
వ్యాధులొదవెను కాలంబు వ్యర్థమయ్యె
నర్థములయందు గోరిక లతిశయించె.

గీ. కాలశేషంబు గడచెను కర్మబంధ
వశత దేహంబు విడువగవలయునట్టి
సమయమేర్పడె సమవర్తి సమయమెఱిగి
దూతలను బంపె చూచితి దూతగమిని.

క. కాలుని దూతల జూచితి
చాలగ భయమంది డాగ చతురత లేకన్
చాలక గెలువగ వారల
కూలితిబో చావచుట్ట కూలినభంగిన్.

క. పాశంబుల బంధించిరి
లేశము కరుణారసంబు లేకనె వారల్
కేశముల బట్టి లాగిరి
యాశల నే విడువలేక యలసితి మిగులన్.

క. దారాపుత్రుల ధనముల
సారార్థచయంబుగలుగు సదనపశువులన్
గారాబు తమ్ముకుర్రల
పేరాశల విడువలేక పెనుదుఃఖమునన్.

గీ. ఒత్తుకొనివచ్చు యమభటోద్వృత్తి జూచి
మనసుబోయెను భీతిని మఱుగుచోటి

కుండెనేనియు గనపడఁ డగలదె?
యుద్ధతులగాంచి భీతిల్లకుండ వశమె?

సీ. బ్రతిమాలుచామన్న పలుకరు బిలచిన కఠినచిత్తులువారు కరుణలేదు
లంచమ్ముబట్టరు కంచమక్కరలేదు భయముకల్గింతు రభయమునిడరు
మాటలబనిలేదు మాయలబడిపోరు మర్యాదదలపరు మంచిలేదు
పెద్దలజూడరు పేదలదలపరు యుపకారమునుచేయు నూహలేదు

గీ. నీలనీరదగాత్రులు నీలకేశు
లర్కనిభ తేజు లరుణాక్షు లధికబలుఁలు
భవ్యతరదీర్ఘబాహులు పాశధరులు
దండధరదూత లేతెంచి దండనిలువ.

ఉ. కాయమునందునుండి పటుకాయులు వేరుగజేసి యాతనా
కాయమునందుజేర్చి పలుగాకులు పాశము లంటగట్టి వా
రాయత దుష్టమార్గమున నంచితకంటకశర్కరాదుల
న్గాయము నొవ్వలాగుచును కష్టముగూర్చుచు కాలుప్రోలికిన్

ఉ. చేరిచి రాజమార్గమున జెచ్చెర కాలునిముందు నిల్పగా
చేరిరి చిత్రగుప్తులట జీవచరిత్రల చెప్పులెక్క ల
వ్వారిగ దెచ్చి యందుగల వక్రపు నాదుచరిత్ర జూపగా
కాలుడు జూచి సాక్షులది సత్యమటంచన క్రోధమూర్తియై.

కం. దురితములు చేయునప్పుడు
దొరవలె నుండంగవచ్చు దోసగుల ఫలమున్
పరిపరివిధములు వాటిని
కరమరుదుగ బొందునపుడు కష్టము దోచున్.

వ. అనివలికి నన్నుచూచి నీవు మిక్కిలి క్రూరకృత్యము లొనర్చితివి. నీ చరిత్రయంతయు యీ లెక్కలలో వ్రాయబడియున్నది. అందుగల ముఖ్యాంశముల వినుము.

గీ. మహితు లెవ్వరు నినుచూచి మనమునందు
సంతసించగ దగినట్టి సాధుగుణము

యొక్కటియులేదు పినవయ్య యోర్పుతోడ
నరక బాధల నొందుము నవ్యశరణి.

సీ॥ ఉభయసంధ్యలలోన నుచితంబులనువీడి నిర్వైరబోదువు నీతిలేక
పాత్రులునీయంటబడయరుమెతుకైనవరభామలనుబొందభయము లేదు
గురువుల నెదిరించి కూతలగూతువు పరమపావనులను బాధపెడుదు
వన్నవిక్రయవృత్తి కలవాటుపడినావు మద్యపానముజేయ మరగినావు

గీ॥ విహితకర్మలజేయుట విడిచినావు
విప్రవిత్తాపహారణంబు వివిధగతుల
నసృత వాదంబు సలిపెద వధికముగను
గనుక నరకంబు లన్నియు గనుము వేగ.

కం॥ అనినను గనుగొని శమనుడు
తన నిర్ణయ మంతదెల్పి తాదృశఫణితిన్
ఘనపూర్వజన్మసంస్మృతి
గనుగొందువు కారణంబు కల్గుటచేతన్.

వ. అని శమనుడు పలికి నన్ను తన దూతల కప్పగించి తన నిర్ణయమంతయు దెల్పి తాను కార్యాంతరనిమగ్నుడయ్యె. యమ దూతలు నన్ను ఏక వింశంతిసంఖ్యాక నరకముల ద్రిప్పి, యందు నారకుడు బొందు చున్న బాధలుజూపించివర్ణించి చెప్పి తుదకునన్ను విడిచిపోయిరి. తరువాత నాకు కొన్నిజన్మములు కల్గినవి. తుదకు నేను విప్రుడనై పుట్టితిని. మాతా పిత్రాదులు నాబాల్యముననే మృతిబొందిరి. ఎనిమిదవ సంవత్సరమున నా మేనమామ నా కుపనయనమును జరిపినవాడు. ప్రతిజన్మమునందును నీమూర్తి విశేషము భవదుపదిష్ట మంత్రఖండములుమాత్రము హృదయ సీమ నలరారు చున్నవి. ఏజన్మమునను దారాపుత్ర ధనాగారాదులు హృదయాకర్షకములు కాలేదు. వైరాగ్యము మిగుల పెరిగినది. తిరిగి గర్భదుఃఖ మనుభవించక తప్పదని భయము కల్గినది. కల్యాణపురమున భవదుపదిష్టమూల సదా స్మరించుచుంటిని.

క. పావుడ నగుటను చెవులకు
ప్రాపించకపోయెనపుడు పలుహితఫణితుల్
పావము తొలచె మహాత్ముని
ఏపగు సద్వాక్యఫణితి నేమనవచ్చున్.

క. కలిగిన తెలివిని విడువక
ఫలమందెడుదాక భక్తిభావనచేతన్
పలికెద మనమున నెప్పుడు
జలజాక్షుని మంత్రములను సార్థముగాగన్.

వ. అనితలచి హృదయముద్రితమైయున్న భవన్మూర్తిని లక్ష్యముగనుంచుకొని తిరుమంత్రద్వయచరమశ్లోకమును తదర్థవిశేషములను ప్రతిక్షణ మనుసంధించుచు త్వదర్చనవందనాదులను క్షణకాలమునను వ్యర్థముగా బోనివ్వక తదేకధ్యాననిమగ్నుడనై,

గీ. ఇష్టమృష్టాన్నమబ్బిన నింపుగనను
ఆకులలములు శుష్కామ్లమైనగాని
యెద్ది దొరకిన జిహ్వకు హితవుగాను
దలచి తినుచుందు వస్తున్నదలపబోను.

సీ. ప్రణిపాతవందన ప్రముఖసపర్యల నర్పింతు నిన్నెప్పు డార్యవర్య !
చరరూపివైయె సర్వసాక్షియె నీ రూపుదాల్చినవాడవి దలతుమదిని
భవదుక్తపావన భవ్యమంత్రంబుల వఠియింతు సార్థంబు పరమనిష్ఠ
తత్త్వస్వరూపంబు దవరెను భవదీయకరుణచే కంజాక్షు కమలనాభు

గీ. శ్రీశు రక్షకకారణు శేషిశబ్ద
కథితు నారాయణు పరు నకారవాచ్యు
నీశు వరదుని సర్వేశు నిత్యు నిరతి
శయుని దలతును నిష్ఠను సంతసమున.

గీ. సహజకైంకర్యవిధులను జాఱవిడిచి
అదియిదియనంగ నెవరికి నలవిగాని

కాలవశమున కడగళ్ళ గాంచినాడ
ప్రకృతి దాటించు భవ్యుని భక్తిగొలుతు.

కం. గతమునకు వెఱువ నెవ్వడు
సతతము హరిపాదభజన సలుపుచునుండున్
స్తుతమతి గురువరు గొల్చెద
నతులితవైకుంఠపదవి యతడొనగూర్చున్.

కం. పరమేశ్వరార్పణంబుగ
వఱపెద నాజన్మవృత్తి పరహితబుద్ధిన్
పరమేశ్వరార్పణంబులు
పరికింపవె పరమపదము ప్రాభవశక్తిన్.

వ. అని మనంబున దృఢంబుగ దలచి నిశ్చలచిత్తుండనై నిరంతర భగవన్నామ సంస్మరణ పరాయణుండనై.

గీ. నిముసమైనను వ్యర్థమై నిర్గమించి
పోవనివ్వక సేవింతు భోగతృష్ణ
బొందకుండుదు ద్వయమును బుద్ధినిల్పి
మననమును జేయుచుంటిని మహితధిషణ !

వ. సంతతము తదేకనిష్ఠనుండ నదేమిచిత్రమో భవదుపదిష్ట రహస్యత్రయములు యథాయోగ్యముగ పూరితములైనవి. అర్థస్మృతియు సవిస్తరముగ కలిగినది. దానిని భవత్సన్నిధిని వినిపించి కృతార్థుడనయ్యెద. విననవధరించుమని ప్రార్థించి వినిపించసాగెను. మంత్రములు మూడు. మొదటిది అష్టాక్షరమహామంత్రము. రెండవయది ద్వయము. మూడవ యది చరమము. ఈమూడును రహస్యత్రయములు. అష్టాక్షరము సకల వేదబోధితము. ఎనిమిది అక్షరములు కలది. ఆదిని ప్రణవము, మధ్యను నమస్సు, చివర నారాయణపదము కలిగియున్నది. శిష్టజనశ్రుతము, ముముక్షుజన కల్పకము. ప్రణవమన అకార ఉకార మకారము లను మూటియోగమున నైనది. అ అనగా అయయని గ్రహించవలెను. ఇది అకారమునకు చతుర్థీవిభక్త్యంతము. అకారమునకు విష్ణువని అర్థము.

ఆయయన సర్వజగదుత్పత్తి రక్షా విలయ కారకుడగు నారాయణుని కొరకు అని అర్థము. మకారవాచకుడు జీవుడు. ఇతడు ఆయ అకార వాచ్యుడగు నారాయణునికొరకు దాసుడు ఉ నిశ్చయము. దాసభూతా స్స్వతస్సర్వేహ్యాత్మానః అనురీతిని ఆత్మలు (జీవులు) పరమాత్మనః నారాయణునకు స్వతః సహజముగ దాసభూతాః దాసులు. అనగా బద్ధ ముక్త నిత్యులను త్రివిధజీవులు విష్ణువునకు శేషభూతులు దాసులు. ఈ శేషి శేషభావ మనన్యార్హము. ఇది ప్రణవార్థము. ఇక నమశ్శబ్దార్థ ము నమః ఇది సఖండము అఖండము అని రెండు విధములు. సఖండమన నమః అను విభాగముకలది. నమః యిది యఖండము. ఈనమః పదము కాకాక్షిన్యాయమున ప్రణవగతాకారముతోడను నారాయణపదము తోడను స్వస్థానమున నమస్సుతోడను అన్వయించును. అదియెట్లనిన ఆయ విష్ణవే విష్ణువు కొరకు నమః నమస్కారము. సకలవిధకైంకర్యము లను చేయుచున్నాను. ఇది మొదటియన్వయము మహామమ అనగా జీవుడనగు నాకొరకు న ఏవిధమగు కైంకర్యమును చేయను. భగవంతుడే నాకు రక్షకుడని తలచి నా రక్షణకొరకు నేను ఏవిధమువైన ప్రయత్నము లను చేయను. భగవత్కైంకర్యపరుడనై కాలమును పుచ్చెదను. భగవం తుడే నన్ను రక్షించునని నిశ్చయించుకొంటిని. నా రక్షణ నావల్లనుగాని యన్యులవలనగాని కానేరదు. ఇది ద్వితీయాన్వయము. తృతీయాన్వయ మెట్లనిన నారాయణాయనమః నారాయణాయ నారాయణునికొరకు నమః నమస్కారము. అనగా నేను సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత సహజసకలవిధకైంకర్యములను చేయుచున్నాను. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు సర్వస్వతంత్రుడు సర్వాంతర్యామి నారాయణశబ్దవాచ్యుడు అట్టివానికై సకలవిధ కైంకర్యములను చేయుచున్నాను. ఇది తృతీయాన్వయము.

## —♦ నారాయణ శబ్దార్థము ♦—

సకలశబ్దములు ముఖ్యవృత్తిచే నారాయణపరములు. నారా యణుడు సర్వాంతర్యామియగుటయే ఇందుకు కారణము. అది యెటుల యనిన నారాయణుడు బ్రహ్మాంతర్యామియై సృష్టినిచేయును. రుద్రాంత

ర్వ్యాప్తియై లయమునుచేయును. విష్ణ్వంతర్వ్యాప్తియై రక్షణమునుచేయును. సర్వభూతాంతర్వ్యాప్తియై సర్వప్రపంచవ్యాపారములను చేయును. కనుకనే సర్వారాధ్యుడు సర్వాంతర్వ్యాప్తి సర్వబహిర్వ్యాప్తియు నారాయణుడేయని తెలియవలెను. అకారవాచ్యుడగు నారాయణునకు నేను సొత్తును, శేషభూతుడను. నేను స్వతంత్రుడనుకాను. ఈశ్వరుడు శేషి పరమాత్ముడగు నారాయణునికొరకు నేను శేషభూతుడను. 'రీజ్' అను ధాతువువలన నరశబ్దముపుట్టినది. "రీజ్ క్షయే" రీజ్ ధాతువునకు క్షయము అర్థము. క్షయమనగా నాశము. రాః క్షయించు స్వభావము కలవారు నభవంతి కారుగనుక నరాః నరులు అనిపించుకొనిరి. నరులన జీవులు. వీరు ఎప్పటికిని నాశనములేనివారు కనుకనే జీవులు నిత్యులు. నరాణాం సమూహః నారాః నారములనగా నిత్యపదార్థములని అర్థము. నిత్యపదార్థములన జ్ఞానానందామలత్వాదులు జ్ఞానశక్త్యాదులు వాత్సల్యసౌశీల్యాదులు దివ్యాత్మగుణములు దివ్యమంగళవిగ్రహములు కాంతిసౌకుమార్యాదులు దివ్యమంగళవిగ్రహములు దివ్యభూషణములు దివ్యాయుధములు దివ్యమహిషులు నిత్యసూరులు ఛత్రచామరాది భగవత్పరిచరణాది సాధనములు ద్వారపాలకులు గణాధిపతులు ముక్తులు పరమాకాశము మూలప్రకృతి బద్ధాత్ములు కాలము మహదాదివికారములు అండములు అండాంతర్గత దేవాదిభేదరూపములు నారములని చెప్పబడును. ఇట్టి నారమునకు అనగా నిత్యపదార్థములకు అయనం యినుగతావను ధాతువు వలన అయనశబ్దము పుట్టినది. అయనశబ్దమునకు ప్రాప్యము ప్రాపకము ఆధారము అర్థములు. నారాయణశబ్దార్థము నారాయణాః అయనం నారాయణః. ఇది షష్ఠీతత్పురుషం నారాణాం నిత్యపదార్థములకు అయనం ప్రాప్యముకాగా నా నారాయణఃఅనగా నిత్యపదార్థములన్నియుతమకుప్రాప్యుడగు (పొందదగిన) నారాయణుని పొందియుండును. నారాణాతిః నిత్యపదార్థములకు అయనం ప్రాపకుడు అనగా నిత్యపదార్థములను తనయందు ప్రవేశింపచేసికొనును. నారాణాం నిత్యపదార్థములకు అయనం ఆధారమగువాడు అనగా నిత్యపదార్థములకన్నింటికి ఆధారమగువాడు, అనగా నిత్యపదార్థములకు ప్రాప్యుడుప్రాపకుడు ఆధారుడు

అనియర్థము. నారాయణుడె పరమపురుషుడని ఫలితము. బహువ్రీహి సమాసమువలన మరియొక అర్థమేర్పడుచున్నది. అది యెట్లనిన నారం అయనం యస్యసః నారాయణః నారము ఉదకము, అయనం నివాసము ఎవనికో వాడు నారాయణుడు. ఉదకములు నివాసముగాగలవాడు. క్షీరార్ణవనికేతనుడు అనిఅర్థము. నారాః అయనంయస్యసః నారాయణః నారాః నిత్యపదార్థములు అయనం ఆధారము యస్య ఎవనికో సః వాడు నారాయణుడు. నార పదార్థములయందునివసించియుండువాడు,సర్వాంతర్యామియని యర్థము. ప్రణవమున శేషత్వము నమశ్శబ్దమున పారతంత్ర్యము నారాయణపదమువలన కైంకర్యము ప్రతిపాదించబడినది. ఇది నారాయణశబ్దార్థము.

సీ. మహితమకారార్థమాధుర్య మెరిగితి భగవత్పదద్వంద్వ భక్తినుంటి
పరమేశదాసుడ పరులగొల్వగబోను సర్వేశకైంకర్యసరణినుంటి
నాత్మార్థమేమియునాచరించుటలేదు శరణంబుజొచ్చెదచక్రహస్తు
నారాయణునినేనునతులొనర్చుచునుందుమంత్రార్థమెన్నడుమరువబోను

గీ. దాసరూపము నెఱిగితి ధన్యమైన
జీవనోపాయ మిటులనే జేయుచుందు
నిట్టులాత్మానుసంధాన మెటులనైన
విడువకుండగ జేయుదు వేడ్కతోడ

ఇది యష్టాక్షర మంత్రార్థము.

## —♦ ద్వయమంత్రార్థము ♦—

సీ. శ్రీశుని సర్వేశు శ్రీదేవిసతతంబు సేవలజేయుచు చేరియుండు
ఘటకభావముచేత కరుణించి యాశ్రితచేతనవర్గంబు చేర్చుచుండు
శ్రీశునిరొమ్మున శ్రీదేవియుండుట కరుణించునెప్పుడు కంధిశాయి
సర్వలోకేశుడు సర్వస్వతంత్రుడు బుధులపాలిటి దివ్యభూరుహంబు

గీ. సర్వచిదచిదంతరవర్తి సర్వవిభుడు
సర్వరక్షణాఫలదుడును సాధునుతుడు

కారణాత్మకు ఫలదుడు క్రమగుణుడు
నిత్యకళ్యాణనిలయుడు నిగమనుతుడు.

## — శ్రీ శబ్దార్థము —

శ్రీఞుసేవాయామను ధాతువునకు సేవ యర్థము.

1. శ్రీయతే చేతనైరితిశ్రీః సాపరాధచేతనులచే నాశ్రయింపబడినది వాత్సల్యగుణముకలది సాపరాధ చేతనుల గాంచని భగవానునకు దయపుట్టించి రక్షింపచేయునది.

2. శ్రీయతే భగవంతమితిశ్రీః భగవంతునాశ్రయించునుగాన శ్రీః స్వతంత్రుడగు స్వామిని యావర్జించుటకు తగిన వాల్లభ్యము కలిగి నిత్యముగ నాశ్రయించి యుండునది.

3. శ్రుఞ్ శ్రవణే శ్రు ధాతువునకు వినుట యర్థము. శ్రుణోతీయాశ్రిత విజ్ఞాపనమితిశ్రీః ఆశ్రితుల మనవుల వినునది.

4. శ్రుఞ్ శ్రవణే శ్రావయతివిముఖాన్ హితమితిశ్రీః విముఖచేతనులకు హితబోధను చేసి వారిని వినువారినిగ జేయునది.

5. శౄహింసాయాం శౄ ధాతువునకు హింసయర్థము. శౄణాతి వానస్తి యాశ్రితదోషానిశ్రీః ఆశ్రితులదోషములను పోగొట్టునది. ఆశ్రితుల దోషములయందు గుణారోపణమును చేసి తనభర్తకు దయకలుగునట్లు చెప్పి దయను కలిగించి రక్షింపచేయును. ఆశ్రితులకు హితబోధచేసి దిద్ది సన్మార్గవర్తుల జేయును.

6. శ్రీఞవిస్తారే శ్రీఞ అనుధాతువునకు విస్తరింపచేయుట యర్థము. శ్రీణాతివిస్తారయతి గుణైరాశ్రితానితిశ్రీః ఆశ్రితులయందుగల గుణములను విస్తరింపచేయునదిగాన శ్రీః యనబడును.

ఇటుల శ్రీశబ్దమున కారువిధముల యర్థములు కలవు. శ్రీదేవి తనభర్తయగు సర్వేశ్వరుని రొమ్మున నుండి చేతనుల దోషముల గనుగొని క్షిపామి నక్షమామి చిమ్మివేసెద, క్షమించను అని పలుకు తన భర్తను మంచిమాటలచేత శాంతునొనర్చి ప్రబలిపూలి నకశ్చిన్నా

పిరాధ్యతి తప్పులేనివారెవరు? మీరే కోపించిన దాసులను రక్షించువారెవరు? మన దాసులను మీరనుగ్రహించి రక్షించవలెనని ప్రార్థించి మనవి చేసి దాసులను రక్షింపజేయును. స్వామిహృదయమున కోపలేశమైన లేకుండజేయును. మాతృత్వప్రేమను వహించును. శ్లో॥ మాతాచ కమలాదేవీ పితాచైవ రమాపతిః యని శాస్త్రము చెప్పుచున్నది. గనుక లక్ష్మీనారాయణులు సర్వచేతనులకు తలిదండ్రులు. ఆశ్రయణ సౌకర్యాపాదకాశ్రితకార్యాపాదకవాత్సల్యసౌశీల్యస్వామిత్వసౌలభ్యజ్ఞాన శక్తిపూర్తిప్రాప్త్యాదిగుణశాలియైన శ్రీమన్నారాయణుని చరణములను రెంటిని యుపాయముగ నుపేయముగ దృఢముగ నమ్మి యాశ్రయించుచున్నాడను. ఇదిద్వయమంత్రమున పూర్వఖండార్థము. ద్వయమంత్రము రెండుఖండము లారుపదములుకలది. ద్వయమంత్రోత్తరార్థము శ్రీమతే. శరణవరణకాలమున పురుషకారభూతురాలగు లక్ష్మీదేవితోడ నిత్యసంశ్లిష్టుడు సర్వశేషి. సర్వస్వతంత్రుడు సర్వాంతర్యామియైన నారాయణాయ నారాయణునికొరకు నారాయణ శబ్దార్థము తత్పురుష బహువ్రీహి సమాసములతోడ చెప్పబడియున్నది. అట్టి నారాయణునికొరకు అహం స్వీకృత సిద్ధోపాయుడనగు నేను సంసారివిలక్షణుడ నహంకార మమకారరహితుడనై నమః సకలవిధకైంకర్యములను చేయుచున్నాను. మః నాకు ఏవిధమైన రక్షణప్రయత్నమును చేయను. సర్వేశ్వరుడు మాతల్లియగు శ్రీమహాలక్ష్మిచే బోధితుడై నన్ను రక్షించును. నేను సర్వకాలసర్వావస్థలయందు యెడతెరపి లేకుండ మత్స్వామిశ్రీవిశిష్టుడగు నారాయణుని పాదారవిందములను సర్వదా యాశ్రయించియుందును. సర్వము భగవంతునిదేగాని నాదేమియులేదు.

గీ. శ్రీశు నారాయణుని దేవు శ్రీపదంబు
లాశ్రయించెద శరణంబు లలితముగను
శ్రీసమన్వితుడైయున్న శ్రీశునకును
నతులొనర్చెద నారాయణాహ్వయునకు.

—♦ ప్ర ప త్తి ♦—

సీ. స్వామి కనుకూలమగు పని జఱుపగలను
స్వామి కప్రియమగుపని జరుప నెపుడు
స్వామి రక్షించునని నమ్మి సంశ్రయింతు
స్వామికర్పింతు నాదగు సర్వభరము.

గీ. స్వామియొక్కఁడె రక్షణ సలుపగలడు
స్వామి సాధ్యంబు నాకోర్కె సరసముగను
నన్యదుర్లభమగుటను హరిని భక్తి
నాశ్రయించెద విశ్వాసహార్దయుక్తి.

ఇది ద్వయార్థము

—♦ ఇక చరమార్థము ♦—

వ. మోక్షసాధనభూతసాంగ సకలధర్మములను (కర్మయోగ జ్ఞాన యోగాంగక భక్తియోగమును) లెస్సగా విడిచి (రుచివాసనాదులతో కూడా తిరిగి పుట్టకుండునటుల విడిచి) ఫలత్యాగముచేసి (యిక్కడ తెలియదగిన విషయమొకటి కల దది యేదియనిన సర్వధర్మత్యాగమన సర్వధర్మానుష్ఠాన పరిత్యాగము కాదు. భగవదాజ్ఞాకైంకర్యరూపముగ కర్మజ్ఞానానుష్ఠానమును యథాశక్తిగా నాచరించి ఫలమును కోరకుండ నుండవలయును. ఈకర్మాద్యనుష్ఠానము తనకు మోక్షము కలిగించుటకు సాధనమని చిత్తమున తలచకూడదు అని తత్వవేత్తల సిద్ధాంతము. అటులుకర్మాద్యనుష్టానము చేయక అలసుడై శరణవరణ మొనర్చె నేని భగవదాజ్ఞావిరుద్ధమగుట సర్వసంకరదోషము కలిగి భ్రష్టుడగును. మాం సర్వప్రపన్నసులభం మామేకమేవ. సర్వప్రపన్నజనసులభుడనగు నన్నొ కనినే శరణం ఉపాయమనితలచి రక్షకుడనని నిశ్చయించుకొని వ్రజ ఆశ్రయింపుము. శరణవరణము నొనర్పుము. సర్వజ్ఞుడను సర్వశక్తుడను సర్వస్వతంత్రుడను సర్వాంతర్యామిని యైన నేను అజ్ఞుడవు అశక్తుడవు భగవదాశ్రయణము లేనివాడవు నన్నే యుపాయ(రక్షకునిగ) మాటగా సంశ్రయించినవాడవు అయిన నిన్ను అవిద్యాకర్మవాసనా రుచిప్రకృతి

సంబంధములచేతను తదనుబంధివిశేషము చేత దేహాద్యభిమాన తదను బంధిమమకారములచేతను సంచితానభ్యుపగతప్రారబ్ధపుణ్యాపాపపూర్వాఘములచేతను పుణ్యాపాపరూపప్రామాదికోత్తరాఘములచేతను అనాది వాసనాకృతతృణచ్ఛేదకలదూయనాదులచేతనులోకాపవాదభీతిని కరుణను కాలుష్యమునను కృతములగుపుణ్యాపాపములచేతను. ఇట తెలియదగినది యొకటి కలదు. అవిద్యయన నజ్ఞానము తత్వజ్ఞానములేకుండుట యన్యథాజ్ఞానము విపరీతజ్ఞానము అను నీత్రివిధాకారముగనుండిన యజ్ఞానము అవిద్యయనబడును. పుణ్యాకర్మ, పాపకర్మయని కర్మద్వివిధము. పూర్వాఘము ఉత్తరాఘము అని రెండువిధములు పూర్వాఘమన నర్థపంచకజ్ఞానము కలుగక పూర్వము చేసినపుణ్యాపాపములు, ఉత్తరాఘమన నర్థపంచకజ్ఞానము కలిగినతరువాత చేసిన పుణ్యా పాపములు. అందు పూర్వాఘముసంచితముప్రారబ్ధము అనిద్వివిధము. సంచితమనగా ప్రబలమైన కర్మాంతర ప్రతిబంధముచేత ననుభవరూపమైన ఫలానుభవము నకురాని కర్మము. ఇది ప్రకృతమున రాక ముందెప్పుడో రాగలదు. ప్రారబ్ధ మనగా అనుభవమునకు నున్ముఖమైనకర్మ. ఈ ప్రారబ్ధము ద్వివిధము. 1అభ్యుపగతము 2అనభ్యుపగతము. అభ్యుపగతమనగా ఇప్పుడున్న దేహముతోడనే యనుభవించదగిన కర్మవిశేషము. అనభ్యుపగతమన యీ దేహానంతరము రాబోవు దేహముతో ననుభవించదగిన కర్మవిశేషము. ఈ ప్రారబ్ధము వెంటనే ఫలమునిచ్చుట కున్ముఖమై యుండును. ఉత్తరాఘము ప్రామాదికము బుద్ధిపూర్వకమని ద్వివిధము. అందు ప్రామాదికోత్తరాఘము జ్ఞానికి సంబంధించదు. బుద్ధిపూర్వోత్తరాఘము ప్రాయశ్చిత్తాదులచే నశించును. ప్రాయశ్చిత్తము ధర్మశాస్త్రములయందు చెప్పబడియున్నది. యకృతప్రాయశ్చిత్తున కనుభవైకవినాశ్యము మఱియు భక్తియోగ (సాధనాంతర) నిష్ఠుడగు ముముక్షువునకు అభ్యుపగతానభ్యుపగతరూప సమస్తప్రారబ్ధమున్ను ప్రాయశ్చిత్తముచే నశించని బుద్ధిపూర్వోత్తరాఘమున్ను అనుభవించిననే నశించును. మిగిలిన సంచితము భక్తిరూపమగు జ్ఞానముచే నశించును. ప్రామాదికోత్తరాఘము జ్ఞాని కంటదు. ఈచెప్పినదంతయు భక్తియోగ

నిష్ఠుని విషయము. ఇక ప్రపన్నుని విషయము. ప్రపన్నులు దృప్తులు ఆర్తులు అని రెండు విధములు. దృప్తుడు యీ దేహానంతరమున మోక్షమునుగోరువాడు. ఆర్తుడు ప్రపత్త్యుత్తర క్షణముననే దేహవియోగమును పరమపదమును గోరువాడు. అందు దృప్తునకు అభ్యుపగతప్రారబ్ధమున్ను, ప్రాయశ్చిత్తములేని బుద్ధిపూర్వోత్తరాఘమున్ను అనుభవించి తీరవలెను. ఆర్తప్రపన్నునకు (అనగా ఉపాయోపేయములు సర్వేశ్వరుడే యని యధ్యవసించి మోక్షప్రాప్తికొరకు త్వరపడువానికి) సర్వము ఉభయ విధప్రారబ్ధము తదితరముకూడ స్వయముగ నశించును. ఈ యధికారి జ్ఞానోత్పత్త్యనంతరము దేహమును ధరించవలెనను కోరిక యుండనివాడు గనుక వీనికి యుత్తరాఘములేదు. వీనిని సర్వేశ్వరుడు యావత్పాప్మ్యా పాపములనుండియు విముక్తుని జేయును. ఇది సిద్ధోపాయమని తెలియవలెను.

వ. వాసన యనగా పూర్వజన్మ సంస్కారవశమున సంకల్పము లేకనే తనంతట తాను కలుగుచుండునది వాసన యనబడును. ఇది త్రివిధము. 1. అజ్ఞానవాసన, 2. కర్మవాసన, 3. ప్రకృతివాసన.

వ. రుచియన స్వబుద్ధిపూర్వకముగ ప్రవర్తించుటకు కారణమైన పూర్వజన్మ సహాకృత కర్మారంభమునందలి యిచ్ఛ. ఇది విషయభేదమున బహువిధములు. విషయమనగా యభీష్టవస్తువులనేకములు గనుక రుచులనేకములు. మోక్షమునుకోరువానికి పుణ్యపాపములు రెండును ప్రతిబంధకములే. పాపమువలన నరకప్రాప్తి పుణ్యమువలన స్వర్గాదిసుఖము కలుగును. కనుక పుణ్యపాపములు రెండును పాపశబ్దవాచ్యములే. ప్రపత్తినిష్ఠునకు ధర్మపరిత్యాగము చెప్పబడినది. ధర్మమను స్వాశ్రమోచిత కర్మానుష్ఠానము అనగా స్నానసంధ్యావందన పంచమహాయజ్ఞశ్రాద్ధాదికము. సకలశ్రౌతస్మార్తకర్మలుకదా ః వీటినన్నిటిని విడువవలెనా యని శంకపొడముచున్నది. అది యజ్ఞానమహిమావిజృంభణము ప్రపన్నుడును భగవదాజ్ఞారూపములు భగవత్కైంకర్యరూపములు అగు కర్మలన్నిటిని యథాశక్తిగ చేయవలెను. స్వరూపత్యాగముకాదు. ఫలత్యాగము. త్యాగశబ్దార్థము స్వరూపత్యాగమర్థముకాదు. కర్మానుష్ఠానము

చేయుచు ఫలమును వాంఛించకూడదు. అవియె మోక్షోపాయము లను కొనకూడదు. స్వరూపత్యాగ మొసర్చిన భగవదాజ్ఞావ్యతిరిక్తమార్గ ప్రవర్తకులై భగవదాగ్రహపాత్రు లగుదురు. కనుక ధర్మానుష్ఠానమే మోక్షప్రదమనుకొనక భగవదాజ్ఞారూపమని యాచరించి ఫలమును కోరకుండనుండవలెను. సర్వేశ్వరు డొకడె యుపాయమని నమ్మవలెను.

అష్టాక్షరమంత్రఫలితార్థము

వ. విష్ణువునకు జీవుడు దాసుడు. జీవుడు స్వతంత్రుడు కాడు. భగవంతుడే జీవులకు రక్షకుడు. తనను తానురక్షించుకొనుశక్తి జీవునకు లేదు. జీవుడనగు నేను సర్వశేషియగు నారాయణునకు సర్వవిధకైంకర్యములను సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును చేయుచుందును. నారక్షణకొరకు నేనేమియు నాచరించను. నాభారమంతయు సర్వేశ్వరుని యందేవిడిచితిని. నిర్భరుడనునిశ్చింతుడనునైయుంటిని. నేనువిష్ణుపరతంత్రుడను. భగవద్వ్యతిరిక్తులెవరును నాకు రక్షకులుకారు. ఇది తిరుమంత్రఫలితార్థము.

—♦ ఇక ద్వయమంత్రఫలితార్థము. ♦—

పురుషకారభూతురాలగు లోకజనని శ్రీదేవితో నిత్యసంశ్లిష్టుడగు కళ్యాణగుణశాలి భగవంతుడగు నారాయణుని దివ్యపాదారవిందములను రక్షకములుగ పొందుచున్నాను. శ్రియఃపతియగు నారాయణునకు సకలవిధకైంకర్యములను చేయుచుందును. సర్వేశ్వరుడు నన్ను రక్షించునని నమ్మియుంటిని. నాకు సర్వేశ్వరుడె రక్షకుడు. అన్యులెవరును రక్షకులులేరు. సర్వకాల సర్వావస్థలయందును శ్రీమన్నారాయణుని దివ్యచరణారవిందములను శరణముగను పొందుచున్నాను. ఇది ద్వయమంత్రఫలితార్థము.

—♦ ఇక చరమఫలితార్థము ♦—

వ. భగవత్ప్రాప్తికి సాధనములను బుద్ధిలేకుండా శ్రుతిస్మృత్యాకతసిత్యనైమిత్తికాదిరూపశ్రౌతస్మార్త కర్మజ్ఞానభక్తియోగ జ్ఞానయోగములను యథాశక్తి నాచరించి తదాచరణమువలన కలుగు ఫల

మును రుచివాసనాదులతో కూడ తిరిగి యెన్నటికిని కోరిక కలుగకుండా పరిత్యజించి యాశ్రయణ సౌకర్యాపాదక వాత్సల్యాదిగుణశాలియగు భగవంతుడనగు నన్ను ఉపాయముగ (రక్షకునిగ) నిశ్చయించు కొనుము. ఆశ్రితకార్యాపాదకజ్ఞానశక్తి పూర్తిప్రాప్తిగుణశాలిని భగవంతుడనునగు నన్నుపాయముగ నాశ్రయించినట్టియు అజ్ఞుడవైనట్టియు అశక్తుడవైనట్టియు భగవత్ప్రాప్తిలేని నిన్ను నన్నుపొందుటకు ప్రతిబంధకములైన సర్వవిధపుణ్యాపాపములనుండియు తొలగించుచున్నాను. నీవిక శోకమును పొందకుము. నిర్భీతుడవై స్థిరముగ నన్ను నమ్మియుండుము అని భగవంతుడు బోధించెను. కాన నేనట్లనె వర్తించెదను. ఇది చరమ ఫలితార్థము.

గీ॥ జ్ఞానభక్తుల కర్మల జరుపగాను
కాలధైర్యంబుగలుగను గాన శరణ
వరణమును జేయదలచితి వాస్తవముగ
వాసుదేవుడు రక్షించు వరదుడగుట.

గీ॥ ధర్మముల వీడి సర్వేశు దనుజహారుని
శరణవరణంబు జేసితి సదయు గొలువ
నిశ్చయంబుగ నన్నేలు నిఖిలవిభుడు
నమ్మి కొలిచితి నారాయణాభిధాను.

గీ॥ శ్రీశు కరుణకు పాత్రునిచేర గలవె
పాతకంబులు? వేగమె పారిపోవు
భయమునందగ పని లేదు భద్రమగును
తరణి యుదయింప నిలుచునే తమము భువిని!

గీ॥ జ్ఞానకర్మల నొనరింప జాలననుచు
జ్ఞాన కర్మల జరిపిన జాలగాను
ఫలము సిద్ధింప నాలస్య పడునటంచు
శోకమ్మును బొందుచుంటిని సూరిభిన్నుత!

గీ॥ పరమపదవాసు సద్గుణపటలములను
తలచి భయమును వీడితి ధైర్యగరిమ
మనసు నిశ్చలమయ్యెను మమతలేదు
పరమపదమున కైంకర్యపరుఁడనౌదు.

గీ॥ కాయమందున మమతను గలచివైచి
త్వద్గుణానుభవాస్వాదతత్త్వవిదుల
యందు ప్రీతిని గలిగించు మాదిదేవ!
ద్వయము తెలిపెడి యర్థంబు దలతు నిటుల

గీ. మంత్రరత్నానుసంధాన మహితధిషణ
తాపములనుండి తొలగించు తండ్రివీవ
యీశరీరము పడుదాక యిటులనుండి
ప్రపదనంబున నినుజేరి ప్రబలువాఁడ.

గీ. త్యక్త సర్వేతరేచ్ఛుఁడ త్వత్పరుండ
ననుచునుండెద నన్వహామధికనియతి
సర్వశేషిని జూచెద సత్వరముగ
ననుచు దలచితి పరిపూర్ణహర్షవశత

క. కతిపయ దినములు గడువగ
నతిశయవైరాగ్యవృత్తి యలవడె మేనన్
సతతము పులకలు వొడమెను
పతితాఖిలవిషయభారబంధుడనైతిన్

క. వైరాగ్యశిఖర మెక్కితి
పోరాడితి విషయవీరభూరిగణముతోన్
కారణము దెలసినాడను
నారాయణ కరుణగోరి నటనము చేతున్

సీ. పంచమహాభూత పరిణామభూత మాంసాస్థిమయచర్మమజ్జయుతము
మూత్రపురీషాదిపాత్రము తుచ్ఛము రక్తరేతోముఖ్యరాజితంబు

బహురోగయుక్తముపతితోన్ముఖంబునుసతతబాధకవిషయసంచయంబు
మఃఖార్తియుతమగు దుష్టశరీరంబు మఱలగలుగకుండమట్టుపెట్టు

గీ. భారమంతయు హరియందు భద్రపరిచి
మధ్యధమనిని వెడలితి మహితముగను
ముక్తపదవిని బొందితి ముదితవైద్య
పురుషు డొనరించు యుపకృతి బూనినేను

సీ వహ్ని యుపగలును వరశుక్లపక్షంబుసౌమ్యాయనంబునుసమమువిూగుల
వరచంద్రవైద్యుతవరుణేంద్రులునుగూడి వరసగబూజించివైభవముగ
సాగనంపుచునుండజక్కగజనిచని సూర్యునిలోనుండి సుష్టుగాను
బ్రహ్మాండమునుదాటిపదియావరణాలను ప్రకృతిమండలమునుపటిమ
దాటి

గీ॥ దివ్యతేజముతోడను తేజరిల్లి
విమలవిజ్ఞానమును బొంది విశదముగను
శమదమాదులతోగూడి శాంతిదగిలి
చిత్తశుద్ధిని వెలసితి శ్రీశుకృపను.

గీ॥ అమృతజలమయవిరజను హర్షవశత
గ్రుంకి సూక్ష్మశరీరంబు గూల్చివేసి
ప్రాకృతేంద్రియములవీడి ప్రబలముగను
మహితవిషయంబులను గొంటి మహిపమాన్య!

సీ॥ మొదటినుండియునన్ను మొనసివచ్చినవాడు వైద్యుతపురుషుడు
వైశముగను
విరజనుదాటించెవిశ్వాసవశమున మనసుతోకూడను మహిమతోడ
అపుడమానవుతోడి హర్షాతిశయమున నిత్యవిభూతివి నియతిజేరి
జ్ఞానాదిగుణములుస్వాభావికాకారములగుచునాయందు మొదటకలిగె

గీ॥ శుద్ధసత్త్వప్రకాశక శుభద దివ్య
విగ్రహప్రాప్తి నానందవితతిజెంది

దివ్యతేజమునొందితి దివ్యతేజ!
స్వస్వరూపము హరికృప సంభవించె.

సీ॥ ఆరముహ్యాదమను యలరు తటాకము నశ్వద్ధవృక్షము నలరుచోట
పంచశతాప్సరోభామలు నను జేరి శఠధృతివేషంబు జరపినారు
గొనిపోవను వేగ గోరివచ్చినసిత్యసూరులునను గొనిసాంపు గాను
పురవీధిజనలాజపుష్పంబులను పౌరజనులెల్ల చల్లిరి చారుగతిని

గీ॥ కనకగోపురముల నేను గాంచినాడ
వందనము జేసి లోపలి వైభవయుత
దివ్యధామము గనుగొంటి దివ్యమైన
మంటపముగంటి మాణిక్యమయముదాని.

సీ. మంటపరత్నంబు మాణిక్యఖచితమహాస్తంభసహస్రికసంయుతంబు
బహునూరివరులందు భాసిల్లుచుండిరి తన్మధ్యమును జేరి తగినయటుల
కృతకృత్యతనుబొందికృతసూరివేషంబువరమమోదము నేనుబడసినాను
ఆధారశక్త్యాదిహరి ధర్మాదులు పాదంబులగుచును బరగునట్టి.

గీ. నిర్మలనవరత్నసహిత నిరుపమాన
సుందరాస్తరణాస్తృతి శోభితమ్ము
తప్తచామీకరాభమై దనరునట్టి
పద్మపీఠము వెలయును భద్రగతిని.

సీ. తత్కర్ణికోపరితలమున శేషాహిపర్యంకమందున పరగుచున్న
కనకాంబరావృత కమనీయరూపంబు మణిమయభూషణమండితుండు
కరధృతవర చక్రకార్ముకగదుడును దివ్యతేజోదీప్తదిగ్గణుండు
శ్రీవత్సవక్షుడు శ్రితసత్యవరదుడు కళ్యాణగుణగణ కలితవిభుడు

గీ. రమయు భూమియు నీళయు రమ్యసరణి
నిత్యసేవల జేయుచు నిలచియుండ
గరుడు డాకచెంత వినతుడై కార్యకరణ
పటుతరవ్యగ్రచిత్తుడై పరగనుండ.

వ. అప్పుడు నేను వినయవినమితుండనై కరములు రెండును భయభక్తియుక్తిని మోడ్చి సాష్టాంగనమస్కారము లొనర్చి నిలువబడి పరమసంతోషాతిశయంబున.

గీ॥ సచ్చిదానందశాంతాది సర్వగుణుని
మహితవేషుని మంగళమహితకాము
నిత్యముక్తాభిగమ్యుని నిరుపమాను
విశ్వపాలకు విశ్వాత్ము విశ్వరూపు.

గీ॥ మకుటభూషణభూషిత మహితవేషు
నీలకుటిలాలకలలితు నిత్యరూపు
నీలనీరదగాత్రుని నిఖిలగమ్యు
కనుల కనుగొంటి కడువేడ్క కఅవుదీర

సీ॥ చక్కఁగదిద్దినసరళోర్ధ్వపుండ్రంబు ఫాలభాగమునందు పరిఢవిల్ల
కర్ణాంచితంబులైకమలసన్నిభములుకనులు మిక్కిలికాంతిగలిగియుండ
తిలపుష్పమునుబోలితీరైననాసిక చూచువారికినెల్లసొంపుగూర్ప
కౌస్తుభమాణిక్యకలితహారావళి పరమసంతోషంబు పరపుచుండ

గీ॥ పల్లవాధరకాంతియు పరమమైన
చంద్రికాస్మితదంతాచ్ఛచవియుగలిగి
పరిమళంతరమంతయు భాసురముగ
వెలయుచుండుట గనుగొంటి వేడ్కతోడ

సీ॥ గండస్థలాంచితకర్ణాభరణయుతు దేదీప్యమానాఢ్యదివ్యదేహు
చంద్రాబ్జపీయూషసంస్పర్ధిసన్ముఖు సకలబుధానందసంప్రదాను
భ్రూత్క్షేపవీక్షితభువనాళినెల్లను సంతోషమునముంచ జాలువాని
గ్రైవేయభూషిత కమనీయశంఖాభకలితలక్షణయుక్తకంధరాఢ్యు

గీ॥ పీవరోరు చతుర్బాహు పనవక్షు
హారకేయూరకటకముఖాభరణుని
సర్వసాక్షిని సర్వేశు సత్యరూపు
కనుల గనుగొంటి కడువేడ్క కరవుదీర

సీ. జానువుసందునచాచినభుజమును పర్యంకవిన్యస్తబాహుతయును
హరిమధ్యనిభమైనహరిమధ్యంబును కాంచీవిభూషితకటితటంబు
సకలజగత్తతిసంపూరితంబౌచు మోదంబుగూర్చుదామోదరంబు
గంభీరనాభినికలిగిన కమనీయ కంజజనూతి కాకమలజంబు

గీ. రక్తవస్త్రవిభూషితరమ్యతనువు
రంభకరభేదకరముఖ రమ్యమైన
యూరుయుగళంబు సంతస ముత్కటముగ
కనుల గనుగొంటి కడు వేడ్క కఱవుదీర

గీ. కనులజూడగ శక్యంబు గాకయుండె
వినగ వీనుల సుఖశబ్దవితతికలిగె
తనువు పులకలనిండెను తగిన యటుల
మనసు సంతోషమునమించె మహితముగను

సీ. సేనానిశేషాహిసేవితవరపాదు చండాదిపరిజనసంఘయుక్తు
ముక్తులు నిత్యులు ముదమునగొల్వగ ముక్తిభోగప్రదుమురవినాశు
హరికృపగలిగినయాచార్యవర్యులు సరసపరాంకుశసాధుతతులు
సద్భక్తి సేవల సలుపుచునుండగ సర్వరక్షణ చేయజాలువాని

గీ. లబ్ధకాముని సంతోషలాభయుక్తు
నిగమవేద్యుని నిత్యుని నిర్మలాత్ము
శ్రీశు వైకుంఠనాథుని చిదచిదాత్ము
కనుల గనుగొంటి కన్నుల కఱవుదీర

సీ. బలయుక్తవృషభేంద్రభవ్యకకుత్తుల్య భుజమాంసలత్వంబుబూను వాని
మంజులమాణిక్యమహనీయనూపురసుందరజంఘాతిశోభమాను
శారదపద్మాభచరణుభాసురరూపు శరణనువారల సాకువాని
ధర్మార్థకామాదిదాతృత్వగుణశాలి నిగమాగమనిచయనిలయునిత్యు

గీ. భక్తవత్సలు దుష్ప్రాపు భక్తిగమ్యు
గాంచి ధన్యతనందితి కాంక్షదీర

పొంగిపొరలెను సంతోషపూర్ణవార్ధి
సర్వకాలంబు కైంకర్యసరణినుండు.

వ. అని సంకల్పించుకొని యున్న నన్ను సకలలోకేశ్వరుడగు పరమదయానిధి.

సీ. శ్రీశుడునను జూచి శ్రీకరకరుణను బాహుయుగ్మముతోడ భద్రముగను
ననుబట్టితనతోడ సత్యాదరంబున నివసింపజేసెను నిపుణముగను
శిరమును మూర్కొని స్నేహార్ద్రదృష్టిని తియ్యనిమాటల దేర్చినన్ను
కరుణించి విడచిన కంజాక్షుపరమేశు ప్రణతుడనైయుండి ప్రస్తుతించి

గీ. భక్తిరూపప్రబోధంబు బడసి నేను
సర్వవిభునకు సర్వత్ర సకలవిధుల
ప్రీతికారిత కైంకర్య వితతిజేసి
ధన్యతను బొందినాడను తగినయటుల.

వ. అంత నేను పాదప్రదేశమునుండి వినయంబున భగవత్పర్యంకంబును నిపుణంబుగ దిగి పురతః పార్శ్వతః పృష్టతః ప్రణతుండనై సర్వవిభూతులతోడవిరాజిలుచుండు దివ్యమంగళవిగ్రహు నవలోకించుచు సర్వత్రప్రసృతాహ్లాదహాతాత్కాలిత త్వరమాణ సకలవిధసహజకైంకర్యంబుల నేకధా దశధాసహస్రధానంతధాసంకల్పాది కింకర విగ్రహుడనై తృప్తినొందక పరిచర్యలచేయుచుండితి. మరియు సకల దివ్యలోకములను భగవద్దయాశ్రితుడనై యథేష్టానుసారము తిరిగితిని. తత్తల్లోకానందముల ననుభవించితిని. కామరూపుడనై సతతదూర నిక్షిప్తదుఃఖుడనై భగవద్గుణానుభవజనితప్రీతిని భగవంతునికి నశేషదాస్యమొనర్చుచుందును.

గీ. శేషగరుడాదినిత్యులు జెందినట్టి
శ్రీశుకరుణకు పాత్రత చెందినాను
నీకు నాయందుకలిగిన నిరుపమాన
కరుణయిట్టుల నను జేయగలిగెనుమ్మ.

గీ. ఆత్మరూపుని యంతరాత్మానురూపు
నములు సర్వేశు సర్వాత్ము నాత్మయందు

నిలిపియుండెద నెచ్చట నిలచియున్న
స్వేచ్ఛదిరిగెద తద్దయు సేకరించి.

సీ॥ సర్వేశు నెప్పుడు సాగి (మొక్కుచునుందు కమలాక్షురూపంబు
గాంచుచుందు
సర్వేశుసన్నిధిజక్కగనిలిచెద పరమాత్మునకుగానపరుగులిడుదు
సంతోషవశిమునసరసన్నృత్యము జేతుబహునామములబిల్చిపలుకరింతు
హరిపల్కుపల్కులుహాయిగవినుచునుందుచేతులదాస్యంబుచేయుచుందు

గీ॥ (ప్రణయవృద్ధత నెప్పుడు ప్రస్తుతింతు
భక్తిపరతను పాటల పాడుచుందు
మంత్రరాజంబు జపియింతు మఱచిపోక
నిగమసంస్తుతి జేసెద నిపుణముగను

గీ॥ నిత్యసూరులు నేనును నిత్యనియతి
సామగానంబు చేయుచు సంతతంబు
పరమపదమున నివసింతు భవ్యనవ్య
దివ్యహార్షాబ్ధి మునుగుచు దేలగలను.

గీ॥ బహువిధానంతరూపాళి బడసినేను
తలపుకలిగిన నెటకేని తరలగలను
దివ్యలోకంబులెల్లను దిరుగగలను
శ్రీశుదయకేను పాత్రత చెందినాడ

క॥ అని పలికి చనియె నాతడు
మనమతిహార్షాబ్ధి మునిగి మహితంబయ్యేన్
మునినై గన లేకుండిన
ఘనుగనుగొనె నతడు సర్వకారణు నీశున్.

వ. ఇదియ తర్కితోపపన్నము. ఈచేతనుని యలనాడు కళ్యాణ పురమున లీలానటనల మేము కనుగొని సర్వేశ్వర ప్రపత్తి చేసితిమి. ఆ ప్రపత్తియె యిటుల ఫలించినది. మమ్ము చలిబాధించినదా? ఆకలి బాధించినదా? ఆతడెవడు? మేమెవరము? ఇది కేవలము లీలకాదా?

మదుపదిష్టముల వినుటకైనను నితనికవు డిచ్ఛకలుగకుండె నట్టి బలవత్ప్రతిబంధ మెటుల సడలిపోయెనో యెవరెరుగుదురు? సర్వేశ్వరునకే తెలియవలెను. సర్వశబ్దవాచ్యుడు సర్వస్వతంత్రుడగు సర్వేశ్వరునివలె నేతద్వాచక శబ్దములలో నారాయణ శబ్దము సర్వోత్కృష్టము సకల నిగమప్రతిపాదితము సర్వోత్తమోపనిషత్తాత్పర్యభూమి సర్వార్థవిదగ్రేసరపరమధనము చేతనోజ్జీవనార్థము సర్వేశ్వరప్రతిపాదితము సదుపదిష్ట సద్గురు పరంపరాప్రాప్తరహస్యత్రయము. చేతనుని రక్షించుటకు రక్షక సాధనములలో ముఖ్యతమ మట్టి స్థితిలో నిపుడు యీచేతనునికి సదుపదిష్టము సద్గురుపరంపరాప్రాప్తముకాక నక్రమముగ నారహస్యత్రయావయవములు ఖండఖండములుగ కర్ణాకర్ణిగా శ్రద్ధలేక భక్తిలేక వినతలంపు లేక యెటులనో బలవంతముగకర్ణతాడితములైనమాత్రముననేనీతడిట్టివాడయ్యెనిది నిర్హేతుకజాయమానసర్వేశ్వరకటాక్షప్రభావమో యీచేతనుని పూర్వపుణ్యవిభవమో అనిర్వచనీయమహిమావిరాజిత మంత్రశక్తియో వర్ణింప నెవరితరము? అక్రమశ్రవణమాత్రముననె యిట్లు సంభవించె. సక్రమప్రాప్తమై సర్వేశ్వరశ్రీపాదన్యస్తసమస్తనిస్తులాస్తోకస్వసర్వభారమై తైలధారావచ్ఛిన్నస్మృతి సంధానమై యలరారు చేతనునికి యెట్టిపదవి గలుగునో! ఎట్టి యోగసిద్ధుడైనను నిట్టిపదవిని బొందుట దుర్లభము. పర్వేశ్వరుడు చేతనులకు కరణకళేబరముల నిచ్చునపుడు కర్తృత్వశక్తినికూడ నిచ్చినవాడు. తద్దత్తశక్తిని పురుషుడు జ్ఞానచికీర్షాప్రయత్నముల జేయ ప్రారంభించును. తన్మూలకములె చేతనుని సుకృతదుష్కృత కర్మవిశేషములు. సర్వేశ్వరుడు చేతనుని సుకృతకరణమునందనుమంతృత్వమును దుష్కృతకరణమున నిగ్రహమును బూనును గనుకనే చేతనుడు స్వకృతకర్మఫలముల ననుభవించుచు నీచోచ్ఛగతుల నొందును. కర్మఫలానుభవమును నిరాకరించుటకును బలవత్ప్రతిబంధ విమోచనమునకును సర్వేశ్వరాశ్రయణమొకటియె సర్వశ్రేయోదాయకమదియె ప్రపత్తిశబ్దవాచ్యము. ఈప్రపత్తి దృష్టార్థభేదమునద్వివిధము. ఆర్తప్రపత్తి ముఖ్యము, దృప్తప్రపత్తిగౌణము,

గీ. మాంసమయమైన దేహంబు మహితమైన
ఖైదుకొట్టుగ భావించి కాలపక్వ
ఫలమువలె వేగ శ్రీశుని పాదయుగళి
పడుటయే యార్త్రపపదన భావమగును.

కం. విడిచితివి సర్వకాంక్షల
దుడిచితివైశ్వర్య గర్వదురితము లెల్లన్
గడపితి సంసృతిబంధము
పడవేసితి వాత్మరామ పదయుగమందున్.

కం. రాముని వీడుట నరకము
రామునితో కూడియుంట రహి నాకమగున్
రాముడె సర్వము నీకిల
రామానుజ భవ్యహృదయ! రాజితచరితా!

కం. ఆపదలు బాపు రాముని
శ్రీపాదములట్లు మనకు చేరకయున్నన్
చేపలు నీటను బాసిన
నేపగిదిని బ్రతుకలేవొ యేర్పడుదుమటుల్.

కం. చేవ పొరలినమాత్రాన నావయోధి
కలతనొందని విధమున కమలనాభ
భక్త హృదయంబు భ్రాంతిస బడయబోదు
సర్వలోకాధిపత్యంబు సవిధనిడిన.

కం. లక్ష్యమె దైవంబగునుమి
లక్ష్యము జూపించునట్టి లలితుడు గురుడౌ
లక్ష్యమె సర్వార్థముగద
లక్ష్యార్థమె సర్వయోగలక్ష్యమునుమిమ్మా.

క. సీతాపతి పదసేవయె
చేతమునకు నిత్యమూర్తి సిరులను గూర్చున్

చేతమునందున నితరము
నేతీరునన్నైన విడిచి యేపుగ నిలువిరా.

క. రాముని కరుణకు పూర్వము
ధీమంతులు తీర్థయాత్ర దిరుగగవలయున్
రాముని కరుణయె గలిగిన
ధీమంతుల కొందువలన్ని తీరునుసుమ్మా.

గీ॥ సర్వశేషికి శేషులు సత్వగరిమ
సర్వవిషయాభిలాషల నంటబోదు
పరమపదకాంక్షగందురు పరమనిష్ఠ
నాకవిభవంబు వారికి నరకసమము

క॥ శ్రీరాముని పదసేవను
పేరాశను విడువలేక పేర్మిని భక్తిన్
సారాచారార్చనలను
ధారాళక్రమము వీడ తప్పొదవదునూ.

గీ॥ ఇష్టములనిచ్చి కష్టంబు లెల్ల దుడిచి
భక్తవరులను గాచెడి భద్రమూర్తి
పరమపదమందు నుండుట భరము తోచి
భక్తహృదయంబునందుండు భవ్యకృపను.

గీ॥ రామచంద్రుని పాదుకారాజయుగళి
భక్తిపూజల సేయని భ్రష్టమతుల
మనసునందున కంటకమండలమున
నుండునట్టుల నివసించు నుత్తముండు.

గీ॥ రామచంద్రుని పాదాబ్జరమ్యభక్తి
తప్ప నన్యంబు కోరని తత్వవిదులు
ప్రీతికారిత కైంకర్యరీతి విడిన
వస్తువణువైన మేరువు పదధునక్షున్న

గీ. రామచంద్రుని పాదాబ్జ రమ్యభక్తి
హీను డిడినట్టి హేమాద్రి హేయమగును
భక్తియొక్కటె భవబంధభరము బాప
జాలు చాలును చేతనజాలమునకు.

గీ. సహజముగ జీవులెల్లరు సర్వవిభుని
దాసులని యాత్మదలచిన ధన్యతములు
ప్రబల దేహాభిమానైకపటిమగలుగు
శాస్త్రవేత్తల సహవాససరణి జనరు.

గీ. జాతిభేదాదిగర్వంబు చాలగలిగి
చేయునది యేమియును లేదు చేతనులకు
సర్వవిభు పాదుకాయుగ్మ సరసిజములె
సకలజీవుల రక్షింపజాలియుండు.

కం. సాగరపతిత సరిత్తతి
వేగమె తమపోల్కి మార్చి వెలసినయట్లే
సాగరశయనుని భక్తులు
వేగమె కులగర్వమెల్ల విడుతురుసుమ్మా.

గీ. మంత్రరత్నమె వసుధను మహితమనుచు
మంత్రమందున మంత్రదమాన్యునందు
మంత్రతత్త్వార్థబోధక మహితునందు
భక్తియుంచిన పరిపూర్ణ ఫలము కలుగు.

గీ. ఐహికాముష్మికంబుల నధికముగను
గూర్చు నష్టాక్షరీప్రద గురువరుండె
యనుచు తెలియని మూఢుల ననుసరింప
వలదు వలదని మాన్యులు పలుకుచుంద్రు.

గీ. సర్వవిభు పాదయుగళమె శరణమనెడి
విద్యదెలిపిన గురువరు విమలపాద

సరసిజంబులె శరణంబు సత్వగుణుల
కనుచు దెలుపును నిగమంబు నార్యవినుత

సీ. మంత్రప్రదుండైన మహితగురుని పైని మనుజబుద్ధినిచేసి మసలువాడు
మంత్రమునందలిమహిమను తెలియక శబ్దమాత్రమెయనుశబరసముడు
విబుధుః పూజించు విగ్రహామునుజూచి బొమ్మయేయనిపల్కు-
బుద్ధిహీను
డాత్మయుబరమాత్మనరయగసములని తనమదిదలచెడిదనుజసముడు

గీ. పరమపావనులైనట్టి భాగవతుల
వేదమంత్రార్చితంబైన విశ్వవిభుని
పాదతీర్థంబు జలమని పలుకు జడుడు
నిరయుబాధలగాంతురు నియతముగను.

గీ. కనుల కగుపించు గురువును కాదటంచు
కనులకందని దైవంబు గరముభక్తి
గొలుచువాంఛ ఘటాంబుల గూలదన్ని
ఘనజలంబును కాంక్షించు కరణికాదె ?

గీ. కనుల కగుపించు గురువును కాదటంచు
కనులుకాంచని దైవంబు గాంక్షచేత
కరగతంబైన ధనమును కాలదన్ని
పాతు గనుగొన యత్నించు పగిదిగాదె?

గీ. నీటబాసిన కమలంబు తేటలేక
భానుకరతప్త మగునట్లు పరమగురుని
బాసియున్నట్టి శిష్యుని బహువిధముల
విడిచి బాధించు విష్ణుడు విశ్వవినుత!

గీ. న్యాసవిద్యను చెప్పిన న్యాసగురుడె
పరమహితకాంక్ష శిష్యుని బంపగలడు
శేషపాన్పున బండెడి శేషికడకు
నిత్యముక్తులతోగూడి నిలచియుండ.

గీ. జాతిభేదంబు లేదని సాహసించి
ధర్మవిధులను చెడగొట్ట తగదు సుమ్ము
నియతముల నెప్డు దాటుట నీతిగాదు
సర్వసంకరదోషంబు సంభవించు.

గీ. భిన్నభిన్నంబులై యొప్పు భేదవితతి
విహితమగుటనె నియమించె విశ్వవిభుడు
దాని చెడగొట్టదలచుట తగదు మనకు
సర్వకల్యాణమును గోర సరసమగును.

గీ. వర్ణమనునది జన్మతో వచ్చుగాని
కల్పితంబన జెల్లదు కారణజ్ఞ!
సహజమని తెల్పు బాలుర సహజచేష్ట
లరసి నమ్మెదు జనులెల్ల హాయిగాను

గీ. సకలవిజ్ఞానమునుదెల్పు జాతి యొకటి
సర్వరక్షణ మొనరించు జాతి యొకటి
సర్వవస్తుల నిచ్చెడి జాతి యొకటి
సర్వకార్యంబు లొనరించు జాతి యొకటి.

గీ. కల్గి నాలుగుజాతులై గణనకెక్కె
నదియె జగమును నడిపించు నధికముగను
ఈర్ష్యయనునది లేకుండ నిలను గావ
సమరసంబున వర్తింప చాలమేలు.

గీ పూర్వమర్యాద దాటగ బూనవలదు
దాన చెడుగేమి లేదని తలచవలయు
నదియె ముక్తిని కలిగించి ముదమొసంగు
దాన గలుగును సద్గతి తథ్యముగను.

గీ. వర్ణధర్మంబు విడువక వాసిగాను
పరమపురుషుని మదినమ్మి భక్తిదవిలి

యుండువానిని విడువక నుదధిశాయి
మేలు కలిగించుచుండును మేటిగాను

గీ. తల్లి యగ్గినిబడబోవు తనయు నెటుల
పడకనుండగ రక్షించు పగిదిగాను
శ్రీశు డెప్పుడు భక్తుల సేమమెరిగి
యహిత పథమున బడకుండ నరయగలడు.

గీ. తనయు తనువున బొడమిన దారుణంపు
వ్రణము శస్త్రాస్త్రకర్మల బాపునట్లు
కష్టములనిచ్చి భక్తుల కర్మబంధ
మెల్లబాపును సర్వేశు డింపుగాను.

గీ. స్వాత్మనాత్మయె పరమాత్మసామి యనుచు
నాత్మ పరమాత్మభేదంబు నరయువాడు
సేవ్యసేవకభేదంబు చిత్తమందు
నిలిపి పుట్టుకగాంచడు సితివిదుడ!

గీ. పరమకారుణికుడై వట్టి పద్మనాభు
పాదయుగ్మంబె శరణంబు భక్తవరుల
కనుచు దలచిన పాపంబు లరులవలెను
భీతి బొందింపనేరవు భీమబలుడ!

కం. అపచారపరంపరలనె
యుపచారములంచు నెంచి యుచితపురీతిన్
నెపమేమి లేక రఘుపతి
కృపగాచును భక్తవరుల కృతహితపరుడై.

కం. ప్రసవించిన యావెట్టుల
విసవిస తన దూడయొడల వెలసిన మలముల్
గసిమసిగా దినుచుండునో
పొసగును హరి భక్తవరుల మేలగు దోసగుల్.

క. పరమాచార్యుని కృపచే
పరమాత్ముని పాదయుగము ప్రాప్యం బనుచున్
పరిపక్వనిష్ఠ నమ్మిన
వరభక్తులు సిద్ధినొంది వరలుదు రెప్పుడున్.

సీ. సంసారసాగరసంతరణోపాయ నిష్ఠావిహీనులు నీచమతులు
తెలిసినవారల తెంపునసేవించి తెలివినార్జించని దేబెజనులు
సర్వేశ్వరప్రోక్తచరమార్థమల్లను విశ్వసించగలేని వెకిలిజనులు
పరమేశకైంకర్యభాగ్యప్రపూర్ణము పరమార్థయుక్తము పరమపదము
గీ. జెందనేరరు దుఃఖాబ్ధి చెందగలరు
ప్రకృతిదృఢబంధబద్ధులై పరగుచుంద్రు
జన్మమృతిచక్రవర్తులై చచ్చిపుట్టి
సహజసంసిద్ధి బొందగా జాలరెపుడు.

సీ సంశయమందినసంసిద్ధిగలుగదు నమ్మినరక్షించునాణెముగను
శ్రీశప్రపత్తియెసిరులనుగూర్చును విశ్వాసముంచుడువిశ్వజనులు
గజమునమ్మనుగానగనుగొనెసద్గతి బద్ధులునమ్మకబడుగులైరి
యితరములన్నియు హేయంబులనినీడి శ్రీశప్రపత్తినిజేయవలయు
గీ. సాధనాంతరరహితులు సలిపినట్టి
సకృదుపచరితమైయొప్పు సత్ప్రపత్తి
సర్వకాంక్షలసమకూర్చు జాలియుండు
శ్రమయు తక్కువ, ఫలమెంచ చాలహెచ్చు.

క. తనకుగల సర్వధనములు
తన దేహం బసుచయంబు తనయులు బంధుల్
తన గురువులె యను శిష్యుని
మనమున నివసించి కాచు మాధవు డెప్పుడున్.

క. చేతనతతులకు గలిగిన
పాతకముల పాదదోలు పద్మాపతియే

చేతోమోదములోడుత
భూతలమున గురుఁడుగాఁగ బుట్టెనుసుమ్మీ.

క. భగవద్భక్తుని వచనము
భగవంతుని వచనమట్ల భావించవలెన్
భగవద్భక్తుని నడవడి
నిగమోక్తము వానిదృష్టి నిరయముబాపున్.

వ. ఇట్లుపదేశించిన జాబాలివాక్యంబుల విని వసిష్ఠు నవలోకించి మహాత్మా ! గురువర !

—♦ భరత సంభాషణము ♦—

ఉ. తల్లియు తండ్రియు న్గురుడు దాతయు మిత్రుడు బంధువర్గము
న్గొల్లగనుండు విత్తమును కోరినసౌఖ్యము దేవదేవుడా
చల్లని రామచంద్రుడని చక్కదలంచితి కాంక్షలన్నియున్
పొల్లున బోవకుండ నను బ్రోచెను పాదుకలిచ్చి సత్కృపన్.

శా. సీతానాథుని పాదుకాద్వయము నేసేవింతుతాదృక్షుగా
చేతోమోదముగూర్చు నాకెపుడు సంచిన్నాత్మసందేహినై
వీతాహంకృతిగొల్తు నాదుభరమున్విశ్వేశునందుంచెదన్
భ్రాతృత్వప్రతిపత్తిబూని ననుదా బాలించునవ్యాహతిన్

క. రాముడె నాదైవంబని
నామనమున దలతు నెపుడు నవ్యాసక్తిన్
రాముడె నా సర్వస్వము
కామిత మన్యంబులేదు కలలోనైనన్.

ఉ. నీవొకనాడు నూతుగని నీరజనాభుడె రాముడంటివా
భావము భావితంబగుచు భక్తిదనర్చెను భవ్యపద్ధతిన్.
తాపక సత్కృపారసము తత్వముదెల్పెను పూర్వమందున
న్భావుకధానకల్పకుని భవ్యపదంబులు గొల్వబూనితిన్.

ఉ. దైవము ధర్మమున్దలచి తత్పదయుగ్మమె నమ్మియుంటి నా
దైవము నన్ను దూరముగ తప్పకనుంచె నికేమిచేతు నీ
పావన పాదుకాద్వయము భవ్యకృపన్దయచేయజేసినా
వావిధమట్లు దెల్పితివి యట్టులగొంటి దేశికాగ్రణీ!

ఉ. కావున దేహమందునను గట్టిగ నిట్టులనిల్చె ప్రాణముల్
తావక సద్గురూపకృతి తప్పక నిట్టుల గాచియుండుటన్
నీవె మదీయ భ్రాతవును నీవె గురుండవు తల్లివంచు నా
భావమునందు నమ్మితిని భక్తిని రాముని నిన్ను గొల్చెదన్.

ఉ. రాముని జూచు టెన్నడొకొ రాముని మాటల వింటు నెప్పుడో
రాముని పాదయుగ్మమును రమ్యసపర్యలజేతు నెప్పుడో
రామకృపాలపాలనము రక్తిగనందగు నెప్పు డెప్పుడో
రాముడు భద్రపీఠమున రాజిలుచుండిన నప్పు ధన్యుడన్.

ఉ. రాముని చూచుభాగ్య మిక రాదు రఘూద్వహుడేమియయ్యెనో
రాముని చేరబోదు నిక రాయిడిబెట్టక రండు మీర లా
రామునిజాడ యేదియును రాదిక నెట్టుల తాళువాడ నా
రాముని జూడకుండిన పరాసుడనయ్యెద తాపసోత్తమా!

ఉ. రాముడు దుష్టరాక్షసుల రాయిడికోర్వక భూమివీడెనో
రాముడు దుష్టరాక్షసుల రమ్యశరాళిం గూలనేసెనో
రాముడు లక్ష్మణాన్వితుడు రాక్షసులేమియు చేయలేరు నా
రాముని ముద్దుతమ్ముడవు రమ్మన తెంపున బొమ్ము తమ్ముడా

గీ. రమ్ము రమ్మని తమ్ముడ రామునపుడు
నీవు కోరవు కోరిన నిశ్చయముగ
రాముడప్పుడె తప్పక రాగలండు
తప్పె తప్పెను తప్పెను దైవమపుడు.

ఉ. ఎన్ని దినంబులయ్యె పరమేశ్వరు గన్నులగాంచి తమ్ముడా!
యన్నియుగంబులై మదికి నద్భుతశోకము గూర్చుచుండె నీ

కన్నులికేల పీడుదు నె? కానకుపోదునె కాంచ నిప్పుడే!
తిన్నని మార్గమేదియును తీరుగఁ దోచ దికేమిచేతునో.

ఉ. కానకుఁ బోవుటే నిజము గట్టిగఁ దోచెను కార్యమిప్పుడే
కానకుపోదు నేనొకడ కాననుగానక యున్న కాశ్యపి
న్గాననుఁగాక వేదిరిగి కాంచెద కాశ్యపి లేకయున్న చో
బాణపరంపరాహతిని బద్దలు జేసెద పద్మజాండమున్

ఉ. కానకుఁ బోవనేల? కలకాలము కాశ్యపినుండనేల? నే
గానగ లేను రాఘవుని కానకుఁ బోయినవారు వత్తురే
కాననిచో రఘూద్వహుల కన్ దనువాపగ లేనుగాన నే
గానగ పుణ్యలోకమున కాయము వీడెద కాంక్ష దీరగన్.

ఉ. కానకుఁ బోవనేల? పటుకాయము వీడగ తొందరేలనో?
కానకుఁ బోవుకాలమున కారుణికోత్తముతోడ బల్కె నే
"కాన చతుర్దశాబ్దముల కాలము నిండినతోడ నేనని
న్గానక యున్న తత్క్షణమ కాయము వహ్నిని గాల్చివేసెదన్".

వ. అని యన్నయగు రామచంద్రునితోడ విన్నవించితిని.

ఉ. కాన చతుర్దశాబ్దముల కాలము నిండినదాక గాయము
న్మానుగ నిల్పగావలెను మామక నిశ్చయమట్టిదౌట నే
న్గానగవచ్చు రామనృపుఁ గానగ పుణ్యము గల్గియుండినన్
కానగలేకయున్న పటుకాయము నిప్పుల గాల్చివేసెదన్.

క. అనుచుండగ పినతమ్ముఁడు
ఘనవినయముతోడ జేరి గ్రక్కున బలికెన్
ఘనుఁగా రామ నృపాలుఁడు
మన చేరువ భూమియందు మసలగవలయున్.

చం. అనవిని చిత్తమందు నతి యభ్యధికాధివిలుప్తధైర్య సం
ఛిదమలబుద్ధినై యనుజు వేగని హేతువుఁ జెప్పుమన్న నా

సదమల బుద్ధిమంతుడిటు చక్కగ జెప్పగ బూనె నన్నరో !
మొదటనె యన్న రాదగిన మోవపువాసర మెంచి జెప్పుమీ.

క. అని నాకు నాజ్ఞనిడితివి
ఘనముగ నే నరయుచుంటి కాలము భక్తిన్
ఘనుడా యది యిపుడాదర
గణనాసంకలితమగుచు గ్రక్కున వచ్చెన్.

వ. అన్నా ! నీ వలనాడు చతుర్దశాబ్దసమాప్తి దినమును నీ వప్రమత్తుడవై లెక్కించి తెలుపుమని నా కాజ్ఞనిడితి వది మొదలు తదేకనిష్ఠ చతుర్దశాబ్ద పరిసమాప్తి పర్యంత వినాడికా కాలమునకు సమములగు పత్రఖండమ్ముల నేర్పరించి లేఖినితోడ వాటిపై రామనామంబులు వ్రాయించి రామనామ యుక్త పత్ర ఖండమును ఒక విఘటికొకటి చొప్పున రామనామోచ్చారణ సేయుచు నొక స్వర్ణకలశమున విడచుచుంటిని. అట్లు విడుచుచుండగా రేపటితోడచతుర్దశాబ్దంబులుసమాప్తములగును గాన కారుణికాగ్రేసరుడగు పెదయన్న రామచంద్రభగవానుడు సీతాలక్ష్మణసహితుడై మనకు సమీపభూమిని చేరియుండునని విన్నవించితినని యా నంత భరతుడు హర్ష శోకవిస్మయాకృష్టచిత్తుడై కొంతతడ వేమియు వలుకనేరక తుదకు పరీక్ష తేంద్రియుడుగాన దిగ్గునలేచిభగవంతుడగు వసిష్ఠు నవలోకించి, మహాత్మా! రామాగమనంబుగాని భరతాగ్నిప్రవేశముగాని యాసన్నతమంబైనది. చతుర్దశ సమయంబులు పరదినంబుతోడనే సమాప్తంబులగునని మన శత్రుఘ్నుడు తెలుపుచున్న వాడు. కనుక నే నిదిమొదలు రామదర్శనాంతమువరకుగాని యగ్నిప్రవేశారంభ ప్రయత్నాంతముగాని మనోవాగగోచర మహిమాన్వితుడగు శ్రీరామనామ పీయూషపానామందానంద మహాసాగర మగ్నోన్మగ్నుడనై యాహార నిద్రా విహార సల్లాపావలోకనాదులవీడి రామపాదుకారాధనము జేయుచుండెద. తత్రభవంతులగు మీరు చతుర్దశాబ్దపరిసమాప్త్యనంతర దినాంతమునందు రామదర్శనముగాని భరతాగ్నిప్రవేశముగాని జరుగునని మన దేశవాసుల కందరికిని యయోధ్యాపురవాసు

లకును దెలియునటుల చేయించగలరు. శత్రుఘ్ను డగ్నిప్రవేశసంవిధాన మంతయు యథాయోగ్యముగ సమకూర్చగలడు. తల్లులు బంధువులు విప్రులు మిత్రులు మంత్రులు సామంతులు సకలజనులు తద్దర్శనార్థము సంసిద్ధులైయుండగలరు. తమ్ముడా! శత్రుఘ్నుడ! నీవింతటిరామభక్తుడవని నే నెన్నడును గనివినియుండ లేను. పదునాల్గు సంవత్సరముల కాలము వ్యర్థముగ బోనివ్వక రామతారకమంత్రరాజమును మనోవాక్కాయములచేత జపమును చేసితివి. నిమిషములో పదునాల్గు సంవత్సరములు లెక్కించు సామర్థ్యముగల నీవు త్రికరణశుద్ధిగ నిట్లు రామనామమును జపించుటచేత నీ భక్త్యతిశయము బోధపడుచున్నది. కొందరు నీ చర్యను చూచి హేళనమొనర్చుదురు గాని వారే వెఱ్ఱివారని నా యభిమతము. భక్తినిష్ఠ యట్టిది. అవిచ్ఛిన్నస్మృతి సంతానము ముఖ్యతమమైనది గదా? శ్రీరామభద్ర భగవానుడు నీభక్తినిబట్టియైన తప్పక దర్శనమివ్వగలడని తలచెదను. శత్రుఘ్న! నా నియమమును బాటించి మదీయాగ్నిప్రవేశమే సంభావ్యమైన తల్లులను గురువులను భక్తిశ్రద్ధల నారాధింపుము నీకు రామదర్శనంబయ్యోనేని నావందనంబుల నర్పింపుము. పాదుకల సమర్పించి పాదసేవ చేయుమనిన విని శత్రుఘ్నుడు భరతు నవలోకించి యన్నా! నీవట్లు పలికెద వేమి? నీయాజ్ఞానుసారము అగ్నిప్రవేశసంవిధాన మంతయు సక్రమముగ జరిపెద. అగ్నిప్రవేశమే సంభావ్యమైన నీతోడ నేనును సమభాగినయ్యెద. నినువిడిచి క్షణకాలమైన నిలువను. నీతోడిదే లోకము. భవచ్ఛాయనుబోలి వర్తించెద. రామనృపాలు డనృతవాది కాడు. రాముడు మారాడువాడు కాడు.

వ చతుర్దశాబ్దంబులు నిండిన మరునాడు పగటికాలమున నిను గనవచ్చెదననిన రామునివాక్యము రిత్తయెట్లగును? కనుకనే మనకు రామభగవద్దర్శనము తప్పక లభించును అమంగళము శాంతించును. సర్వకళ్యాణములు సంప్రాప్తమగును. ఇదియే నిశ్చయమనియె. అంత భరతుడు రామపాదుకలజేరి విశేషముగ నర్చించి నిమీలితనయనుడై రామనామంబు జపించుచు ననన్యమనస్కుడై తైలధారావచ్ఛిన్నస్మృతి సంతానుడై అవాఙ్మానసాతీతభక్తిసంయుతుడై తదేకధ్యానపరాయణుడై

యుండె. అంత వసిష్ఠుడు జాబాలి వామదేవ కశ్యప వాత్స్యాయన సుయజ్ఞ గౌతమ విజయ సుమంత్రాదుల నవలోకించి,

సీ. భవ్యాత్ములారామిారుభరతునిగంటిరె పదునాల్గు సమములు బరఁగెనిష్ఠ
పరమయోగులకైనవరగునెయిటువంటి చిత్తోపశమనముచిత్రముగను
సకలేంద్రియములును సమవృత్తి యితనికి వశవర్తులైయుండెవాసిగాను
నిముషమెుక్కటియైన నియతినివిడువక సతతంబురామునిసంస్మరించు

గీ. సతత సుఖలోలుడైయుండ జాలువాడు
విషయవాంఛల నెట్టుల విడచినాడొ!
యోగనిష్ఠను వరలెడి యోగికూడ
నిట్టి పృథవృత్తినుండువా డెవడు గలడు?

క. మనమెఱిగిన కాలంబున
మనకన్నుల కిట్టివాడు మహిగనపడెనే!
ఘనుడీత డన్నివిధముల
వినగనలేదితని తమ్మువింతల చరితల్.

క. పదునైదవ వర్షాదిని
విదితుండౌ రామనృపతి వేరాకున్నన్
సుదతీవ్రాతము పురుషులు
కుదురుగ ఘోరాగ్నియందు గూలుట నిజమా.

వ. అప్రతిహతసమయుడగు మన భరతనరపతి యగ్నిబడ యత్నముచేయుచున్నవా డతనితోడనే శత్రుఘ్నుడును సకల బంధువులును వనితలందరును కోసలులును కేకయులును రామలక్ష్మణసీతలును మైథిలులును వేయేల జగమునగల సకల మానవులు నెచటనున్నవారచటనే మృతినొందుదురు. భూలోకము నిరవశేషముగ నిహతమగును. దారుణంబగు నీయవస్థను మానుపువాడొక్క రామనృపాలుడేగాని యన్యుడెవడునులేడు. ఇట్టి భయంకరదృశ్యమును మనకనులెటుల గనగలవు? ఒక్క సీతాసతీప్రాణనాయకుడు శ్రీరామచంద్రుడు కరుణాకటాక్షమున

నీక్షించి విచ్చేసి యీమహాభయంకర ప్రళయమును వారింపవలయును. ఇది ప్రళయసమయము కాకుంటను, భువనవిదిత పుత్రకామేష్టి సంభూత పవిత్రవంశాంకురంబులు జగంబునకు భద్రంబుగూర్చి యతి చిరకాలము భువనంబెల్ల పాలించదగినవారటను, యుష్మదాదుల తపోవైభవంబు లనిర్వాచ్యమహిమావిరాజితంబులగుటను, రాఘవకోసల మైథిల కేకయ వంశంబు లభివృద్ధినిపొందదగినవారటను పరమంబగు స్వశ్రేయసంబె కలుగ వలెను. అయినను భవితవ్య మెఱుగుట దుర్లభంబు. భవితవ్యమెఱిగి మాత్రము చేయుదగినదేమున్నది? అప్పుడే బహుదృఢతమ శుష్కకాష్ఠ సంచయసంయుక్త విశాలకాష్ఠరాశి నిర్మితమగుచున్నది. ఈ భయంకర వార్త ప్రపంచమున కెటుల విదితమైనదోగాని ప్రపంచజనులందరు సమయాబ్దపరిగణనా పరాయణులై యుండిరేమోగాని బహుదూరదేశంబుల నుండి యపరిమిత మహాజనవారంబుసంతతం బేగుదెంచుచున్నది. భూమి యీనినయట్లెక్కడజూచినను క్రిక్కిరిసి మానవసమూహ మగుపించుచున్నది. అందరును యోగులవలె జడలను కాషాయంబులను ధరించి యుండిరి. “యథారాజా తథాప్రజాః” యనువాక్యము సార్థకమైనది. వీరందరును పదునాలుగు వత్సరములు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల ననుకరించి యుండిరని తోచుచున్నది. ఈ యిక్ష్వాకువంశము ప్రజాహితైకపరిపాలకము. శ్రీరామచంద్ర కళ్యాణగుణపరంపరలు సకలజనాకర్షకములు గనుకనె జనుల కింత రాజభక్తి యేర్పడినది యనియెు. ప్రజలందరును యథాయోగ్యముగ తాము నివసించుటకు నియమితమై యున్న విశాల రమణీయ ప్రదేశముల నివసించి రామ రఘురామ శ్రీరామ సీతాపతే దశరథరామ కాకుత్స్థరామ యను శబ్దంబుల నుచ్చైస్స్వరంబున బలుకుచు నివసించియుండిరి. జనులంద రతిదృఢసంమిళిత భయంకర విస్మయావహ విరాగ సాహసాన్వితులై భరతునితోపాటు తామును వైశ్వానరప్రవేశమునకు వెనుదీయని ధైర్యసాహసములు కలవారై యుండిరి.

సీ. శత్రుఘ్నుడంతట సద్భక్తిభరతుని జేరి పలికెనిట్లు శీఘ్రముగను
రాముడు రాడయ్యె రాత్రిచేరెను గడువునిన్న నెదాటె గనుక లెమ్ము

చేయగదగినది చేయుము యిప్పుడె యనగనిమ్మనుపీడింపనుజుతోడ
పాదుకాద్వయమును భక్తిశిరమున దాలిచి నడచెను ధైర్యగరిమ

గీ. ప్రజల దుఃఖరవంబుల భవ్యగిరులు
బ్రద్దలగుచుండ గృహమును బాసి యప్డె
కాష్టరాశిని జేరెను కైకసుతుడు
సకలదివిజులు గనుగొని సంస్తుతింప.

సీ. అగ్నులగైకొనియార్యులునడిచిరి ముదితలువిప్రులుమునులుసఖులు
భరతునితోగూడిబహుశోకయుక్తులై పరిపరివిధములబలికిరపుడు
శ్రీరామచంద్రుడుచేరకయుండుట భరతునితోనగ్ని బడగదలచి
మనములనందరుమహితనిశ్చితులైరి కాష్టరాశినిజేరికైకసుతుడు

గీ. భవ్యకాంచనమణిమయభద్రపీఠ
మందు పాదుకలనునిల్పి యార్యవరుడు
పూజసలిపెను భయభక్తి పూరితముగ
సమయపూర్తిని గాంక్షించె సాధుడతడు.

గీ. అస్తగిరికిని భాస్కరుడు డఱుగుచుండె
భానుకిరణంబులన్నియు బడియె వార్ధి
పక్షులన్నియు గూళ్ళకు బరచుచుండె
భరతుడప్పుడు వహ్నిని బడగ దలచె.

వ. అంత భరతాజ్ఞ భృత్యులు కాష్టరాశియం దగ్నిని ప్రవేశ పెట్టిరి. భరతుడు రామరామయనుచు పాదుకాయుగ్మసన్నిధి నాజ్ఞగొని వసిష్ఠాదిపూజ్యులకు వందనంబిడి యాజ్ఞగొని యగ్ని కభిముఖుడై నడచు చుండె. శత్రుఘ్నుడు భరతువెన్నాడి యఱుగుచుండె. మహామహుడగు వసిష్ఠర్షి యతివేల దుఃఖావేశుడై వారినిరువురి ననుసరించి చనుచుండె నంత కౌసల్యాద్యంతఃపురవనితలందరును జనుచుండిరి. వారిననుసరించి సుమంతుడు జనియె. సకలజనులు తమకు లభించిన యవకాశముల సఫల పరచుచుండిరి. అపు డాకసమునుండి యచ్చైస్స్వరంబున నొకమహాద్భుత

నవ్యస్వరంబు వినబడియె. నంద రదిరిపడిరి. వారివారి యవలోకనంబు లాకర్ణనసారి పర్గంబులచే నాకృష్టములైనయ ట్లాకసంబున కెగసినవి. సర్వశ్రోత్రంబుల "కాగుమాగుము త్వరపడకుము. శ్రీరామభగవానులు భద్రంబుగ నున్నవాడు. సీతాలక్ష్మణసహితుడై మీనయనంబుల కవలోకనీయుడగును. సర్వభద్రంబులు చేకూరు"నని పలుకుచు భరతునకగ్నిభట్టారకునకు మధ్యభాగంబున భరతమార్గావరోధియై యొకవ్యక్తి నిలువబడి భరతు నవలోకించి,

మ. తగునా ? సాహసమేల జేసెదవు ? సద్ధర్మంబె సన్మార్గమే
 భగవంతుండగు రామభూవిభుడిదే భార్యానుజోపేతుడై
 తగురీతి న్నినుగాంచు భద్రయుతుడై తథ్యంబుగా నమ్ముమీ
 యగసంచారుడ వాయుపుత్రుడను రామాజ్ఞాదృతిన్వచ్చితిన్.

క. రాముని కుశలము దెలుపగ
 రామునిచే బంపబడితి రామప్రియుడా !
 రాముడు సుఖియైయుండెను
 రామాగమనంబు యిపుడె రాజిలునుమీ.

వ. శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణసహితుడై భరద్వాజాశ్రమమున విడిసి, భరద్వాజార్చితుడై భరద్వాజాజ్ఞ నటనున్నవాడు. నిను గాంచ రాగలడు. నీవిట్టి సాహసకృత్య మొనర్చుట తగదు. చతుర్దశాబ్దంబులు సమాప్తిని బొందుటతోడనే నీచెంత కేతెంతుననిన రామవాక్యమును నమ్మకుండుటకు గతంబెద్ది ? రాము డెప్పుడైన మాటాడెనా ? రాము డేల రాకపోవు ననుకొంటివి ? ఈ దారుణకృత్యంబునుండి చిత్తంబు మరల్చుము అనిపలుకు హనుమంతు నవలోకించి అగ్నిప్రవేశపరీతభీభత్సహృదయులగు తత్రత్యులందరును విస్మితహృదయులై యుండ భరతు డేమియు దోచక వెఱ్ఱివానివలె నిరీక్షించుచుండె నంత హనుమంతుడు,

క. ఏమీ దారుణకృత్యము
 భూమీశుల కిట్టిపనులు పోలునె చెప్పుమా

రామోక్తి మారిపోవునె
క్షేమముగా రాముడిటకు చేరునుసుమ్మా.

కం. ఆమాట వినుటతోడనె
భ్రామింబడె భరతుడపుడు ఘోరున జనముల్
ఏమేమి యనుచు మూగిరి
రామానుజు డపుడె భరతు రయమునబట్టెన్.

వ. అంత వసిష్ఠమహర్షి తన కమండలోదకమున భరతు ముఖకమలం బభిషేకించిన దెలసి కన్నులువిచ్చి మోహంబు దొలగ వానరు నవలోకించి గాఢాలింగన మొనర్చి నీవు వానరుడవో నరుడవోగాని నాయందింత కరుణకు కారణంబేమి? ఇట్టి ప్రియవాది ఋణం బెటుల నీగెద? పదునాలుగు సమంబులకు కర్ణపేయంబుల వింటిని.

గీ. బ్రతికియుండిన శుభముల బడయవచ్చు
ననెడి కళ్యాణశుభవార్త యమృతమగునె?
బ్రతికియుండితి పదునాల్గు వర్షములకు
గలిగె నానందమయవార్త కర్ణములకు.

వ. అను భరతు నవలోకించి వాయుపుత్రుడు భరతరాజా! నేను వానరుండ వాయుపుత్రుడ హనుమంతుడనువాడ. వానరరాజగు సుగ్రీవుని సచివుండ రామదాసుడ. రామభగవానుడు తన క్షేమమును నీకు తెలుపుటకుగాను నన్నిట కనిపె. రామ భద్రుడు సీతా లక్ష్మణ సుగ్రీవ విభీషణాది మహావీరులతోడ పుష్పకవిమానము నెక్కి లంక నుండి బయలుదేరి భరద్వాజాశ్రమమున కేతెంచి తదాజ్ఞ నట నివసించి యున్నవాడనిన విని భరతుడు హనుమంతు నవలోకించి

గీ. వానరుడవగు నీకును వరదునకును
స్నేహ మెట్టుల చేకూరె జెప్పవయ్య
ఎచట రాముడు నివసించె? నెచట నీవు
రామమిత్రుడవైతివి రమ్యసరణి.

సీ. శ్రీరామచంద్రుడు సీతామహాదేవి లలితసద్గుణుడైన లక్ష్మణుండు
శుభముగనున్నారె చూచితి వేనీవు సత్యమేనీమాట సాధుగుణుడ !
ఎపుడువారిచటకు నేతేరగలరయ్య నినుబంపె నెవ్వాడునిజముచెపుమ
కాపేయబుద్ధిని గనబోకపలుకుము వాంఛితమేదేని వాసినిత్తు

గీ. వరము కోరుము సరసార్థవచనరచన
జేయుశక్తుడవీవని చెప్పకుండ
దోచుచున్నది సత్ప్రేమతోడ నన్ను
గావ మనమున దలచుము కార్యవిదుడ !

వ. అనవిని హనుమంతుడు రాముని చరిత్రను దెల్పెదను విను మనిన భరతుడును మహర్షులును మహాజనులు విన కుతూహలులై యుండిరి. హనుమంతుడు వసిష్ఠాది మహర్షులకును భరతునకును వందనంబు లర్పించి భరతు నవలోకించి,

—♦ హనుమంతుడు రామచరితమును తెలుపుట ♦—

మ. వినుమీ రామనృపాల శేఖరుడు సేవించె న్భరద్వాజుని
ఘనమౌనీంద్రుని యాజ్ఞ నిన్ను గనగా కాంతానుజోపేతుడై
వినయంబొప్పగ రేపు కల్యమునసే వేగాంచ మిమ్మందరన్
మనమందేమియు సంశయంబు గనకన్మద్వాక్యము న్నమ్ముమీ.

సీ. కాకుత్స్థరామాజ్ఞ కదలి వేగమ నేను గుహుని గాంచితినయ్య కోవిదుండ!
పదునాల్గు సమములు పరిపూర్ణమైయుంట రాముడు రాడని రాజ్యమెల్ల
సుతునకర్పణజేసి సూనృతగతినేడు గుహుడసువులవీడ గోరియుండె
మిత్రులలోనెల్ల మేటియాతడుసుమ్ము మితిలేనిభక్తిని మెలగుచుండె

గీ. నతని భృత్యులు గుహుతోడ నద్భుతముగ
ప్రాణహానిని జేయగ ప్రతిననిడిరి
నాదుమాటల నమ్మరి నరవరేణ్య !
భరతుడగ్గిని బడు వేగబరువుమనర్థి.

వ. గుహుని వాక్యములంబట్టి నేనంత త్వరితముగ వచ్చితిని మీ రిట్టి దారుణకార్య నిమగ్నులైయుంటిరి. నా భాగ్యవశమున క్షేమముగనున్న మిమ్ము గనుగొంటిని ధన్యుడను.

సీ. మాతులగృహమునమహితులౌ మీరుండ మహనీయుడైనట్టిమనుజ విభుడు
రామాభిషేకంబురక్తిజేయగ నెంచె విఘ్నంబు గలిగెను వేగనపుడు
దశరథరాముడు దండకకేగెను దశరథుడేగెను ధరణివీడి
రాజగృహమునుండిరప్పింపమంత్రులు తమ్ముడనీవునుతరలివచ్చి

గీ. విధివిహితముల నెల్లను వేగ దీర్చి
రాజ్యపాలనమందున రక్తిలేక
సకలపరివార యుతుడవై సత్వరముగ
చిత్రకూటాద్రి రాముని జేరినావు.

వ. అపుడు నీవు రామునకు గతవృత్తమంతయు విన్నవించి విధి విహితకృత్యముల రాముడు దీర్చినపిదప నీవు రామచంద్రునితోడ,

మ. మనవంశంబున పెద్దవాడొకడె సంభావమ్మున న్స్వామిని
స్సనుమార్గంబున నేలుచుండుగద యీ మర్యాద బాలింపగా
నను మన్నించి వనంబువీడి పురికి న్హాప్రార్థన న్జేరుమీ
యన నీభూమిని నేల పాదుకల నీకర్పించె ధర్మార్థియై.

మ. రమణీయంబగు పాదుకాయుగము నే రారాజుగా జేసి నీ
వమలోత్తుంగవిరాగభక్తిమతివై యంచద్గతిన్నుండగా
రమణీసోదరయుక్తుడై వెడలి తా రాముండు రాజద్గతిన్
గమికర్మీకృతుడయ్యెదండకకు నేకాంతవాస్మ మైయుండగన్.

వ. ఆముగ్గురును చిత్రకూటమును విడిచి కొంతదవ్వరిగి యత్రి మహాముని యాశ్రమంబుగని యా దంపతులచేత పూజితులై మార్గ మధ్యముననున్న మునుల యాశ్రమముల సత్కృతులై విరాధునిద్రుంచి సుతీక్ష్ణాశ్రమమున నగస్త్యభ్రాతాశ్రమమును గనుగొని పూజితులై

యగస్త్యాశ్రమమున సత్కారముల నాశీర్వచనముల నందుకొని దశరథ మిత్రుడగు జటాయువును మన్నించి,

సీ. అటనుండిచనిచనియటవులెన్నియొదాటి వరజనస్థానమువాసిగాంచి
పర్ణశాలనుగట్టిబహువిధులందుండ రావణసోదరిర క్తిజేరి
శతకోటిమ్మథసంకాశదేహుని రామునిగనుగొని ర క్తిబలికె
కైకొని నన్నేలు కామపీడితనైతినని పల్కరాముడు హార్షవశత

గీ. కాంత యిది నాకు భార్యయై కలిగియుంట
కాంతునన్యుని జేరుము కాంతయనియె
సీత గబళింప వేగమే జేర ముక్కు
చెవుల గోసెను సౌమిత్రి చిత్రముగను.

సీ. శూర్పణఖాభిఖ్య శోకించిశోకించి ర క్తసిక్తాంగియై రట్టుజేసి
ఖరుగనుగొని రాముకాంతను దేబోవ గలిగెనిట్టులయనెకరుణబుట్ట
ననిబల్క కోపించి యతివేగ ఖరుడప్డు తమ్ముడుసేనలు తననుగొలువ
పర్ణశాలకుజేర భాస్కరకులజుడు తరుణిని తమ్ముని తగినచోట

గీ. నిలిపి రాక్షసమూకను నిపుణముగను
బాణతతిచేత ఖండించి భండనమున
మునిగణంబులకెల్లను ముదముగూర్చి
పర్ణశాలను జేరెను భద్రగుణుడు.

వ. చతుర్దశసహస్ర మహాసేనాసమేతులగు మహాశూరులు ఖర దూషణాదులు రామునిచే మృతులైరి. జనస్థానము రాక్షసశూన్య మైనది. రావణసోదరియగు శూర్పనఖ ఖరదూషణాదుల మృతికి శోకించి లంకకు పరువిడి రావణు నీక్షించి జనస్థానమంతయు రాక్షసహీనమైనది. దశరథపుత్రుడు రాముడనువాడు సీతయను భార్యతోడను లక్ష్మణుడను తమ్మునితోడను జనస్థానమున నివసించియుండ సర్వాంగసుందరియగు సీత యను రామపత్నిని గొనితెచ్చి నీ కర్పింపదలచిన లక్ష్మణుడనువాడు ఖడ్గంబున కర్ణనాసికంబుల నిటుల గోసెను. ఖరదూషణాదులు సేనలతో రాము నెదిర్చి యుద్ధనిహతులైరి. జనస్థానము శూన్యమైనది. మీ ప్రభుత్వ

మిట్లున్నది. ఇంటిదగ్గర జరుగు వృత్తాంతములనుగూడ నీవరయలేకుంటి వని చెప్పి విలపించెను. రావణుడు తన సోదరి నోదార్చి మాయా విదుడగు మారీచుని సహాయముతో పంచవటిని చేరెను. మారీచుడు కనకమృగమై సీతకభిముఖగ విహరించెను.

గీ. స్వర్ణమయమైన లేడిని సరసిజాక్షి
సీత కనుగొని వేగమే చేరి రాము
పట్టి తెమ్మని కోరెను పరమసాధ్వి
దాని బట్టగనేగెను దాశరథియు.

గీ. మాయలన్నియు నెరిగిన మాయధనుడు
మోసమిదియని తెలియక మోసపోయె
నిట్టి లేడులు భూమిలో నెచటగలవు?
కాల మెటువంటివారిని కలతపెట్టు.

గీ. రాక్షసులమాయ యిదినమ్ము రామచంద్ర!
వలదు పోవకు మోసమ్ము వచ్చుననుచు
తమ్ము డెంతయు బలికిన దాశరథియు
వినక పోయెను లేడితో వేగమవుడు.

గీ. సర్వవిదుడైన రాముడే చాలడనిన
చాలునొకడని పలుకగా జాలు నెవడు?
కాల మెంతటివానిని కలతబెట్టి
తనవశంబున త్రిప్పును తగినయటుల.

సీ. బంగరుమృగములబరికించియుంటిమేమా యయనక పోయెమానధనుడు
దానినిగొని తేర దడయక నేగెను బట్టగ లేడయ్యె పరుగులిడియు
పటుబాణమునదానిబడవేయదలచెను రామునివలెకంఠరవముమార్చి
హాలక్ష్మణాయని యనవినిసీతయు బంపెనులక్ష్మణు బరువమునను

గీ. యదియె తరియని దనుజుడు హార్షవశత
దనరథంబున సీతను దాల్చి చనియె

మృగము మారీచుడై పడి మృతిని బొందె
కాలగతిని తప్పింపగ గలరె జనులు ?

గీ. కనకమృగతృష్ణ నీరీతి గలుగదగునె !
మహితమారీచమాయను మందమతిని
దైవవశమున బడితిని దైవమెటుల
చేయ దలపోయు నటులనే చేయగలడు.

క. అనితలచి నడుచుచుండగ
కనిపించెను లక్ష్మణుండు కాననభూమిన్
మనమున శోకము గలిగెను
తనపడతిని యడవి విడిచి తనకగుపడుటన్.

సీ. మారీచమాయలమరపించిమననిట్లు జనకజగొనిపోయెజాలయెవడొ
నీమదికదిదోచనీవిట్లుజేతువే కారణమెట్లుండగడగెనిటుల
ఏమిచేయగవచ్చునిప్పుడుచెప్పుము తోచదునాకేమి తోయజాక్షి
శకునంబులేమియుశస్తంబుగాలేవు కష్టముగలిగెను కాలమహిమ

గీ. పర్ణశాలయు శూన్యమై బరగుచుండె
పడతి కనపడకుండెను భయము కలిగె
చింతవిడనాడలేకుంటి చిత్తమందు
భామ గనుగొనుభాగ్యంబు బడయగలనె ?

క. శోకంబున వారిరువురు
వీకంబని కాంచలేక వెదకుచు సీతన్
చీకాకు పడుచు మిక్కిలి
యాకొను సింగంబులట్ల యరిగిరి వనికిన్.

సీ. గోదావరీతీర మోదావహంబులౌ కాననభూముల కలయదిరిగి
దండకనంతయు దడయక వెదకిరి వినుగనుపదిలేక విశ్వవిదుడు
బావులచెరువుల బహుళపచ్చికపట్ల బహుళభంగి వెదకిరి భవ్యులపుడు
మునిపల్లెలందున ముదితనుగానక వివిధకుంజంబుల వెదకివెదకి.

గీ. జాడ లేశము తెలియక జడులభంగి
మతివిహీనత మాటికి మాటికరిగి
కాననెచ్చట గనలేక కాంతనంత
పర్వతంబుల వెదకిరి బహుళభంగి.

సీ. దశరథమిత్రంబు దశకులవిభుడగు శరజటాయువునేలబడుటజూచి
దగ్గరచేజేరి దశరథతనయుడు మన్నించి యిదియేమి మాన్య యనిన
దశకంఠుడనువాడు ధరణిజగొనిపోవ డాకియుద్ధముజేసి ధరణిబడితి
రథమదె గూర్చితిరావణుడరిగెను లంకయాతనియూరు లలితగుణుడ!

గీ. చేయగలిగినదంతయు చేసినాను
దర్శనాపేక్ష నసువుల దాల్చియుంటి
పోవుచున్నవి యసువులు భూమినాథ!
మరచిపోవకు నను నెప్డు మహితధిషణ!

సీ. అంతటపక్షీంద్రుడసువుల విడిచెను సంస్కారవితతిని జరిపె విభుడు
పరమపదము వేగబడయుము నీవని పరమపదముబొందె పక్షివిభుడు
సీతను వెదకుచు సీతేశుడంతట ద్రిమ్మరెవనమెల్ల ధీరుడగుచు
దశరథరాముడు ధరణిజవెదకుచు గనలేక సీతను గాసిజెందె.

గీ. నడవిదారిని విడువక యరిగి యరిగి
యలసి యొకచోటనుండిరి యవనివిభులు
రాము డతికోపభరమున రహివహించి
తమ్ముగని యనె దారుణతమముగాను

గీ. వినుము తమ్ముడ! సీతను వినయవృత్తి
నమరు లర్పింపరేలనో యధికశక్తి
భువనజాలంబులెల్లను బుగ్గిగాను
సమయజేసెద గనుమయ్య శస్త్రనిహతి.

గీ. ధనువు నిటుదెమ్ము బాణము లడయకిమ్ము
బ్రహ్మమొదలగువారలు ప్రాణభీతి

వినుతిజేసిన విడువను వీరవినుత !
సీతనిచ్చిన విడుతును శీలగరిమ.

వ. అని బాణప్రయోగమున కుద్యమించు రామునిగని సౌమిత్రి, యన్నా ! ఇది న్యాయముకాదు. అగ్రహింపకు మపరాధ మొక డొనరించిన నందర సంహారించుట యుక్తముకాదు. శాంతించుము. వైరిని వెదకి చంపుదమనిన రామభూమీశుడు శాంతిని పొందెను. పిమ్మట రామలక్ష్మణు లడవిని జనుచుండ శిరోగ్రీవావిహీనుడగు కబంధుడను వాడు తన దీర్ఘబాహువుల రామలక్ష్మణుల బట్టుకొనిన వారాపట్టును వదిలించుకొనలేక ఖడ్గంబుల కబంధుని రెండుబాహువులును ద్రుంచిరి. కబంధునికోరిక ననుసరించి యొకగోతిలో కబంధుని శరీరమును కాల్చి వేసిరి. కబంధుడు దివ్యశరీరమును ధరించి యీదారిని మీరుపోయిన మీకు మేలుకలుగు నని పలికి యథేచ్ఛగబోయెను. రామలక్ష్మణు లరణ్యమున పోవుచు పంపాసరస్సును గనుగొనిరి. అచట శబరియను మహాసాధ్వి రుచిగల ఫలముల నొసగి పూజించెను. రామలక్ష్మణు లాఫలముల భక్షించి యానందించిరి. రామభగవానుడు శబరికి నక్షయ లోకము లొసగెను. రామలక్ష్మణు లాపంపాసరస్సున సుస్నాతులై వృక్షచ్ఛాయ నధివసించియుండిరి. ఋశ్యమూకపర్వతమున వాలిభయం బున డాగియున్న సుగ్రీవుడను వానరరాజు రామలక్ష్మణుల,

గీ. సూర్యతేజుల గనుగొని సూర్యసుతుడు
తన్ను వధియింప వాలిచే ధరణిపతులు
పంపబడిరని భీతిల్లి పవనసుతుని
నన్నుగని యిట్లు పలికెను నరవరేణ్య !

గీ. రాజపుత్రుల వీరల రమ్యచాప
ధరులగంటివె ? నీవేగి ధైర్యకలన
వారివృత్తంబు దెలియుము వాలిచేత
పంపబడిరేని తెలుపుము పారిపోదు,

గీ. మంచిమాటల వారల మనసు దెలసి
వేగ సీతురమ్మ తెలుపుము విస్తరించి.
వైరివర్గంబువారలీ వీరులంచు
భీతినొందితి వారించు భీతిబాపి

వ. అనిన నేను భిక్షుకరూపమున రామలక్ష్మణుల చేరి వందన మర్పించి మీరు క్షత్రియులవలె నగుపించుచున్నవారు. వంశనామముల దెలిపి నన్ననుగ్రహింపుడంటిని. అందు సౌమిత్రి నను గనుగొని మేము క్షత్రియులము. సావిత్రుల మాతడు రామచంద్రుడు, నేను లక్ష్మణుండ. మేము సోదరులము. కొండొక కారణమున నితడు భార్యతోడను, నాతోడను గూడి యరణ్యమునకు విచ్చేసెను. జనస్థానమున నితనిభార్య నెవడో యపహరించినాడు. ఆమెను వెదకుకొనుచు నిటచేరితిమనియె నంత నేను లక్ష్మణునితో నాకనపడు పర్వతము ఋశ్యమూకమనునది దానియందు సుగ్రీవుడను వానరరాజున్నవా డతడు తన యన్నయగు వాలిచే నపహృతదారుడై చింతాసముద్రమున మునిగియున్నవాడు. మిమ్మురువురగని మిమ్ము శరణమును పొందినవాడు. తనకార్యము మీ వలన సాధించుకొను కోరికతో నున్నవాడు. వాలిభయమున నతడా పర్వతమును విడిచి రాజాలడు. మీరాతని సమీపమునకు విచ్చేసి దయనీయుడగు నతనికి శరణమొసగుడు. నేను వానరుడను. వాయు పుత్రుడను, హనుమంతుడనువాడను. సుగ్రీవసచివుడనంటిని. నామాటల విని ఋశ్యమూకము చేరుటకు సమ్మతించిరి.

క. వానరరూపము దాల్చితి
మానుగ నాబుజములందు మహితులగొంటిన్
వానరరాజును జేర్చితి
భానుసుతుడు భానుకులుల భక్తినిగొలిచెన్.

వ. సుగ్రీవుడు రాముని గనుగొని 'రామచంద్ర! నేను, వాలియను వాడు నన్నదమ్ములము. వాలి నాయన్న. వాలి నాభార్య నపహరించి నన్నీ భూతలంబున నెక్కడనున్నను కొట్టుచున్నవాడు. బలవంతుడుగాన నేను మిగుల భయమును పొందితిని. నిన్ను శరణము బొందితిని. వాలిని

బరిమార్చి నన్ను రక్షింపుమనియె. రామసుగ్రీవులు పరస్పరహస్తగ్రహణ మొనర్చి యగ్నిని వేల్చి తత్సన్నిధిని రాముడు సుగ్రీవునిగని వాలిని సంహరించి నీభార్యను రాజ్యమును నీకొసగెదనని ప్రతిజ్ఞయొనర్చెను. సుగ్రీవుడు భవద్భార్యాపహారిని వెదకి వానిని బరిమార్చుటకు నాశక్తి కొలది సహాయమొనర్చెదననియె. పరస్పర మిట్లు ప్రతిజ్ఞలచేసి యగ్ని సన్నిధిని మిత్రత్వమును బూనిరి. అంతట వారందరునొకచోట గూర్చుండి యుండిరి. సుగ్రీవుడొక మూటను గొనితెచ్చి రామునకిచ్చెను. రాము డా మూటను విప్పి యాభరణముల గని యవి సీతవేయగుట తెలిసి మిగుల చింతించి లక్ష్మణు గనుగొని యిందేదేని నీవు గుర్తించగలవా యనియె.

గీ. ఎఱుగ కేయూరముల గన్న లెఱుగకుంట
నెఱుగ కుండలముల గన్న లెఱుగకుంట
నెఱిగియుంటిని యందెల నెపుడు నేను
పాదముల మ్రొక్కునపుడు గన్పడుటవలన.

గీ. కాల్యకృత్యంబులెల్లను గడపి నేను
నీకు వందన మర్పింతు నియతముగను
తల్లి సీతకు భక్తిని దండమిడుదు
గాన నెఱిగితి నందెల గనుల గనుట.

గీ. వీరికెట్టుల దొరకెనో వినగవలెను
గురుతు బట్టితి నందెల కువలయేశ!
జనకతనయవి యివియని సత్యముగను
సీత పడవేసియుండును చింతచేత.

వ. సుగ్రీవుడు మహాత్మా! రామచంద్ర! ఒకదినంబున నాకాశ మార్గంబున రావణు డొకవనితం గొనిపోవుచుండెను. ఆమె రామ రామయని శోకించుచు నీ మూటను మానలుగురిమధ్యను పడవేసెను. దానిని భద్రముగా దాచియుంచితిని. ఇపుడు మీ కర్పించితిననియె. రామభగవానుడు మిగుల శోకించెను. లక్ష్మణుడు తనయన్న నోదార్చెను. రాముడు కొంతసేపటికి స్వస్థచిత్తుడై యుండ సుగ్రీవుడు తన యన్న యగు

వాలికిని తనకును కలిగిన వైరకారణము సవిస్తరముగ విన్నవించెను. వాలి సామర్థ్యమును వాలి యీపర్వతమునకు రాకుండుట కేర్పడిన మతంగశాపమును ఆ శాపకారణమున నే నీపర్వతమున నివసించి యుంటిననియు విన్నవించెను. రామభగవానుడు సుగ్రీవుని గనుగొని సుగ్రీవ! వివాదము వచ్చినపుడు యిద్దరియందున నేవో దోషములుండక పోవు. మీయిరువురి గుణదోషములతోడ నాకేమియు పనిలేదు. వాలిని సంహరించెదనని ప్రతిజ్ఞచేసితినిగాన వాలిని సంహరించి నీ భార్యను రాజ్యమును నీ కిచ్చుటయే నాకార్యము. నీవు భీతిల్లకుము. వాలి యెంత వాడైనగానిమ్ము. నాబాణముల కడ్డుకలుగదనియోగాని సుగ్రీవునికి రాముడు వాలినిసంహరించగలడా యని సంశయము కలిగినది. సుగ్రీవుడు కోరిన పనులన్నియుజేసి రాముడు సుగ్రీవుని మెప్పువడసెను.

కం. అదిగనుగొని సుగ్రీవుడు
మదిమెచ్చుచు బలికెనిటుల మాన్యుడ! వినుమీ
కదనమునందున సురవిభు
మదమార్చెదు వాలి నీకు మహితుడె రామా!

క. అపరాధపడితి నిట్టుల
కృపయుంచుము తప్పుసైచి కూరుని వాలిన్
కపటాత్ము ద్రుంపు వేగమ
విపులను నీవంటివాడు వెదకిన గలడే.

క. సాలంబుల నేడింటిని
శైలంబును పృథివిగూడ సాయక మొకటన్
లీలను భేదించితి విది
పోలునె మఱియెవరికైన పూజ్యుడ రామా!

క. శోకమును విడిచినాడను
ప్రాకటముగు ప్రీతిగలిగె ప్రభువరవినుమీ!
నాకేశతుల్యవిక్రమ!
వికచాంబుజవక్త్రనేత్ర! వీరస్తుత్యా!

క. వీరుని గర్విని వైరిని
క్రూరుని మద్భ్రాతృరూపకృపణుని వాలిన్
ధీరుడ ద్రుంపుము వేగమ
భీతుని ననుగావ నెంచు భీషణబాణా!

క. ఇంకొక భీతిని బాపుము
బింకంబున కదియె మూలబిరుదా సుమ్మీ
శంకించుచుంటి నిన్నును
పొంకంబున దానవతడు భూమిని వెలసెన్

గీ. తపమునకు మెచ్చి వాలిని ధాతబిలిచి
యనియె నెవ్వఁడు నీ కోడ నభిముఖముగ
యుద్ధ మొనరింపవచ్చునో క్రుద్ధుఁ డగుచు
వాని బలమున నర్ధంబు బడయుమయ్య.

క. వాలికి కాంచనమాలను
హేలాగతి నిచ్చి వజ్రి హితుఁడా! దీనిన్
వీలుగ గళమున దాల్చుము
ఫాలాక్షుం డెదుర నీకు భయముండ దికన్.

వ. అని బ్రహ్మయు శచీపతియు బలికిరి. అని విన్నవించిన విని రామభద్రుడు మిత్రమా! నీవీ మాటల వినిపించి మేలుచేసితివి. నేను వాలని పిలిచి మందలించి మీ యిద్దరికిని సఖ్యమొనర్చ దలచితిని. ఇప్పు డట్లు చేయుటకు వీలులేదు. బ్రహ్మవరమును తిరస్కరించదగదు. వరములను శాపములను మహిమలను పాటించవలెను. కావున నొక ధర్మాతిక్రమణ మొనరించ వలసివచ్చినది. నీవును వాలియు యుద్ధము చేయుచుండ నేను చాటుననుండి బాణమును ప్రయోగించి వాలిని సంహారించవలె నన్యునితో బోరువానిని కొట్టుట యధర్మము. ఒకధర్మ రక్షణార్థము మఱియొక యధర్మమాచరించవచ్చును. బ్రహ్మవరమును త్రిప్పుటకంటె చాటుననుండి వాలిని కొట్టుటయె మేలు. వాలిని చంపెద నని ప్రతిజ్ఞచేసితిని. చంపక తప్పదుగదా! శరణాగత రక్షణ ధర్మము

సిద్ధించును. వెనుక నేను విశ్వామిత్రాజ్ఞను తాటకిని కూల్చితిని. ఇంద్ర సంహారోద్యుక్తయగు కావ్యమాతను విష్ణుడు సంహరించెను. రుద్రుడు భస్మాసురునకు వర మొసగి పలాయితుడయ్యెగావున చాటుననుండియే వాలిని సంహరించుటకు నిశ్చయించుకొంటిననియె లక్ష్మణసుగ్రీవాదు లంగీకరించిరి.

గీ. రామవిభుడప్డు సుగ్రీవు రక్తిగాంచి
మనము కిష్కింధ కిప్పుడె మహితముగను
పోవవలయును ముందుగ బొమ్ము నీవు
వాలి బిలువుము గర్జించి వరగుణాఢ్య !

క. వాలియు నీవును రణమును
హేలాగతి చేయుచుండ హేమాంచితమా
కోలను గొట్టెద వాలిని
నీలును బరికించి వీరవిక్రమలీలన్.

గీ. వారలందరు రామాజ్ఞవలన నేగి
చెట్లమరుగున నిలచిరి శీఘ్రముగను
మిహిరసుతుడంత వాలిని మిక్కుటముగ
బిలిచె భీమణరవమున బ్రిదుల గిరులు.

గీ. హేమమాలను దాల్చిన భీమబలుడు
వాలి సుగ్రీవుబాహుల బట్టికొట్టి
పుడమి బడవేసి మర్దించి పూర్ణబలుడు
క్షీణుడని యెంచి చనియెను శీఘ్రముగను.

గీ. శిథిలగాత్రుడు సిగ్గున శిరమువంచి
చేరి రాముని నిందించి చేతగాని
పనిని చేయగబూనుట పాడిగాదు
నమ్మి నగుబాట్లపాలైతి నరవరేణ్య !

వ. అనినవిని రామభద్రుడు సుగ్రీవ! కోపింపకుము. నామాటల వినుము. మీరిద్దరును సమానరూపులగుట భేదంబు తెలియక మిత్ర ఘాతదోషంబు గలుగునేమోయని భయపడి యుపేక్షించితి ఈ గజ పుష్పమాలను గళమున ధరించి తిరిగి వాలి నాహ్వానించి యుద్ధమొనర్చు చుండుము. సత్వరముగబొమ్ము. తప్పక వాలిని గూల్చెదనని దృఢముగ పల్కిణించిన ధైర్యమువలంబించి రామవాక్యముల నమ్మి కిష్కింధా ద్వారమున గొప్పగ నఱచెను. హేమమాలియగు వాలి తార యుక్తి యుక్తముగ నెంతబోధించినను వినక గ్రక్కునవచ్చి యాగ్రహావేశమున సుగ్రీవునితో ఘోరముగ బోరుచుండెను. రామనృపాలుడు సమయము కనిపెట్టి క్రూరనారాచమును చాపమున దొడిగి యాకర్ణాంతము లాగి లక్ష్యశుద్ధిగ విడిచెను. శరవిద్ధగాత్రుడై వాలి భూమింబడియె. రామ లక్ష్మణులు మెల్లగ వాలి పడియున్న చోటికి చేరిరి. వాలి రామునిగని యతిపరుషవాక్యముల నిందించెను. రామభద్రుడు తగిన సమాధానముల నిచ్చెను. వాలి తనదే తప్పని మనమున నిశ్చయించుకొనెను. రామ భద్రుడు భగవంతుడగుటవలన తనకు సద్గతి కలిగెనని సంతోషించెను. వాలి సుగ్రీవుని పిలిచి తన మెడలోనున్న హేమమాలికను తీసి సుగ్రీవుని మెడలోవేసి 'సుగ్రీవ! తప్పంతయు నాదే. నాతప్పుల నెంచక యంగదుని నీ పుత్రునివలెనే భావింపుము. వానరరాజ్యము నేలుము. రాముని యాజ్ఞను మీరకుము. తారామతము ననుసరించుము. మన మిద్దర మును యేకకాలమున సఖ్యముగను సౌఖ్యముగను వర్తించుట భగవంతున కిష్టములేకపోయినది. రామకార్యమును నిర్వహింపుము. రామకార్యమువట్ల యుపేక్ష వహించకుము. ప్రమాదము వాటిల్లును సుమీ' యని ప్రాణముల విడిచెను. సుగ్రీవుడు మిగుల దుఃఖించెను రాముడు హితవాక్యములబల్కి యోదార్చెను. వాలివధ విని తార యంతఃపురస్త్రీలతో నేతెంచి భూమిమీద పడియున్న వాలి నీక్షించి మిగుల దుఃఖించెను. తార రామునిగని కోపముతో దూషించ దలచి వేదాంతవాక్యములతో రాముని కొనియాడెను. సుగ్రీవుడు వాలికి సంస్కారక్రియలన్నియు నంగదునిచే యథాయోగ్యముగ

జేయించెను. సుగ్రీవుడు వానరరాజ్యమున కభిషిక్తుడయ్యె. అంగదుడు యువరాజయ్యెను. రామలక్ష్మణులు ప్రవర్షణగిరియందుండి వర్ష కాలము గడపిరి. హనుమంతుడనగు నేను సుఖలోలుడగు సుగ్రీవునిగని ‘వర్ష కాలము దాటినది. యుద్ధోచితకాలము ప్రవేశించినది. నీవిట్లు సుఖ లోలుడవై వర్తించుచుంటివి. రామున కాగ్రహముకలిగిన ప్రమాదము వాటిల్లు’ నంటి. సుగ్రీవుడు సేనాపతుల కందరికిని యుద్ధమునకు సిద్ధముగ ప్రయాణోన్ముఖులై సిద్ధముగనుండ నాజ్ఞాపించెను. తమతమ సేనలతో సేనాపతులు వచ్చుచుండిరి. రామాజ్ఞను లక్ష్మణుడు కిష్కింధకే తెంచిన తారయును, నేనును ప్రయాణప్రయత్నము సిద్ధమైనదనియు సేనాపతులు వచ్చుచున్నారనియు వచించి యుపశమితకోపుని చేసితిమి. సేనాపతులంద రును కిష్కింధకే తెంచిరి. సుగ్రీవుడు రామలక్ష్మణుల సేవించ ప్రవర్షణ గిరికేగెను. కర్తవ్యము నాలోచించి సీతాన్వేషణమునకు వానరుల బంప దలచెను. మహాసేనాసమన్వితుడగు వినతుని తూర్పునకును యువరాజగు అంగదుని, నన్నును, జాంబవంతుని మహాసేనలతో దక్షిణమునకును వీరవానరసేనాసమన్వితుడగు సుషేణుని పశ్చిమమునకును బహుసహస్ర సేనావారముతో శతవలి నుత్తరమునకును పోవ నాజ్ఞాపించెను. రామ భగవానుడు నన్నుబిలిచి యంగుళీయక మొసగి గుర్తుగనుండుటకు దీనిని మైథిలికిమ్మని నాకాజ్ఞాపించెను. సుగ్రీవుడు సేనాపతుల నందర నవలో కించి మాస మతిక్రమించకుండ మీకు నియమితములైన దిక్కుల పూర్ణ ముగ వెదకి సీతావృత్తాంతమును తెలుపవలెను. మాసము నతిక్రమించిన శిక్షితులగుదురనియె. సేనాపతులందరును తమకునియమితములైనదిక్కుల పూర్ణముగ వెదకి మాసము నిండకుండనె సుగ్రివసన్నిధికి చేరిరి. సీతనన్వే షించుటకు దక్షిణదిక్కునకు పోయిన మేము సీతను వెదకుచు స్వయం ప్రభగుహ జొచ్చి యందుండి పైకివచ్చుటకు తగిన దారి తెలియక స్వయంప్రభను ప్రార్థించి యామె యనుగ్రహమువలన గుహనుండి పైకి వచ్చితిమి. అప్పటికి మాసమతిక్రమించినది. ఒకవశమున నుంటిమి. అంగ దుడు జరిగిన వృత్తాంతమంతయుజెప్పుచు ‘జటాయువుధన్యుడు. రామార్థ మసువులవిడిచెను. మనమందర ముగ్రశాసనుడగు సుగ్రీవునిచే మరణ

దండన విధించబడి వ్యర్థముగ ప్రాణములవిడువవలసివచ్చిన' దనివల్కెన్.
జటాయుమరణమునువిని సంపాతియను పక్షీంద్రుడు మాసన్నిధికి మెల్లగ
వచ్చి జటాయుమరణమును మావలన దృఢముగవిని విచారించి జటా
యువును, తానునుసోదరులగుటయు రెక్కలుకాలితానీవనమునబడుటయు
వినిపించి రామపత్నియగు సీత లంకలో నశోకవనములో నున్నదనియు
నూరామడలవెడల్పుగల సముద్రమును దాటి వెళ్ళిన సీత కనిపించుననియు
యిక్కడనుండి చూచిన సీత నానేత్రముల కగుపించుచున్నదనియు చెప్పి
నన్ను సముద్రముదరికి గొనిపొండు. జటాయువున కుదకదాన మిచ్చెద
ననియె. మేమందున కంగీకరించి సంపాతిని సముద్రమునకు చేర్చి సము
ద్రమును గనుగొంటిమి. సంపాతి సముద్రమున మునిగి సోదరునికి నివా
పాంజలులిచ్చె నద్భుతముగ సంపాతికి రెక్కలు మొలచెను. యథేచ్ఛగ
నెగిరి యాకసమునకు పోయెను. సముద్రమును దాటి పోయి సీతను గను
గొనివచ్చెదనని వానరవీరు డెవడును బలుకలేదు. జాంబవంతుడు నన్ను
జూచి 'నీవు రామప్రియుడవు. నీవిట్లుపేక్షించినకార్యమెట్లుకొనసాగును?
లెమ్ము. సముద్రమును దాటుము. సీతను గనుగొని కార్యమునునెరవేర్చు
కొని రమ్ము' అని పలికెను.

గీ. జాంబవంతుని మాటల సంతసమున
సాగరంబును దాటెద సత్వరముగ
సీత గనుగొని భాషింతు చిత్తమలర
దనుజు గనుగొని మర్దింతు ధైర్యకలన

క. తతమత్స్య కూర్మ నాగము
పతితోద్ధితపక్షిగణము పర్వతయుతమున్
శతయోజన విస్తీర్ణము
మతిమన్నతిపాత్రమైన మకరాలయమున్.

గీ. కనుల గనుగొంటి దాటగ గడగి నేను
కాయమును బెంచి ధైర్యంబుగాంధి మిగుల

తండ్రి వాయువు నర్చించి, తలచి రాము
సీత గొనియాడి గిరినెక్కి చిత్తమలర.

సీ. మాహేంద్రగిరినుండిమహితవేగముతోడనాకాశపథమున నతిగియతిగి
మైనాకగిరిచేయు మన్ననలందుచు సురసను గెలిచితి సులువుగాను
సింహికననుబట్టి చీరికగొనకుండ జంపివేసితి వేగ చారుశీల !
పవనవేగముతోడ బరచితిమిక్కిలి నిర్జరులందరు నిలిచిచూడ

గీ. శశధరోదయవేళను శస్త్రవిభవ
లంకగనుగొంటి జేరితి లంకలోన
లంఖినీనామరాక్షసి లలితశక్తి
దాక గెలిచితి దయనిచ్చె దారియదియె,

గీ. సూక్ష్మరూపముగైకొని చొరవజేసి
పురమునంతయు వెదకితి పుణ్యగరిమ
రావణాంతఃపురంబును రహినిగంటి
సీత గనలేకపోతిని సిగ్గుగంటి.

వ. తిరిగిన ప్రదేశముననె తిరుగుచు విసుగుజెందక శ్రమయను గొనక పురవరమును పూర్ణముగ సందు గొందులనెల్ల వెదకి యుద్యాన వనభూములనెల్లను దిరిగి యొకచోట,

గీ. శింశుపావృక్షఛాయను చేరియున్న
రాక్షసీగణపరివృత రామపత్ని
మలినవసనంబుగట్టిన మణినిబోలి
కనులపడె నాదు భాగ్యంబు గణనకెక్క.

క. మాసిన బట్టను గట్టెను
వాసిగ దుఃఖాబ్ధిమునిగి వరలుచునుండెన్
భాసురరవమున రాముని
వాసిగ దలపోయుచుండె వరదుడ ! విభుడా !

గీ. దుఃఖసాగరమందున దూలిపడుచు
దాశరథి చేరు దారిని దలచలేక

చేయతగువని తోచక చిత్తమందు
సీత భీతిని దగిలెను చింతమునిగె.

వ. ఆమెను కనులగనుగొని హర్షంబునొంది యీమెయే సీతా మహాసాధ్వియని మనమున నిశ్చయముగ దలచి 'నాభాగ్యము పండినది. రామానుగ్రహపాత్రుడనగుదును. సందేహము లేదు. వెదకుచున్న యోషధి కాల బడినది' యని సంతసించుచు శింశుపావృక్షదళంబుల చాటున నెరికిని యగుపడకుండ డాగి సూక్ష్మరూపంబు దాల్చియుంటిని. అంత నొక యవ్యక్తధ్వని వినపడినది. అది వినగ వినగ హెచ్చి జయ జయధ్వానములతో వచ్చుచుండుట రావణాగమనమని తెలిసికొంటిని. కొన్ని నిముషములలో బహుస్త్రీగణపరివృతుడగు రావణుండు ప్రత్యక్ష మయ్యెను.

గీ. అటుల రావణు డేతెంచి యబలగాంచి
తగని వాక్యంబులను బల్కె దారితప్పి
సీత రావణు తృణసము జేసిపల్కె
భవనమునుజేరె దైత్యుడు పరుషముగను

వ. రావణుడు గృహమునకు పోవుచు త్రిజట మొదలగు రాక్షస స్త్రీలను గనుగొని మీకు రెండుమాసములు గడువిచ్చుచున్నాడను. ఈ యవకాశమున సీత నాకు వశ్యయగునటుల చేయుడు. అట్లుకాదేని సీతను భేదించి మాంసమును పక్వమొనర్చి ప్రాతరశనములోనికి తెండని యాజ్ఞాపించి చనెను. రాక్షసవనిత లందరును నిద్రాపరవశులైరి. నేను కోసలదేశపు భాష ననుసరించి,

చ. సమయముజూచి రామవిభు సత్కథలెల్ల వచించుచుండ నా
యమ ననుబిల్చి రామవిభు హరిశుభస్థితి వించు సత్కృపన్
సుమనసుకుమారి యుంగరము సుందరరామవితీర్ణమివ్వగా
నమితముదంబుజెంది తన హరిశిరోమణినిచ్చె గుర్తుగాన్.

వ. రామభగవానునిరూప మెట్టిదో వల్కుమనిన రాముని దృష్టాకారవిశేషమంతయు యథార్థముగ వర్ణించి చెప్పితిని. విని సీతా

మహాదేవి తనమనమునగల సందేహమును విడిచి నన్ను రామదూతనని దృఢముగనమ్మెను. రామునకు కాకాసురవృత్తాంతాదులను నమ్మకొరకు విన్నవించుమని నాకు వచించెను.

చ. అనుమతిబొంది రావణునియంతికమేగ నశోకవాటికన్
మునుముగ బెల్లగించితిని మూకలగొట్టితి నింద్రజిత్తుచే
ఘనముగబట్టుకోబడితి గాంచితి రావణు బుద్ధిచెప్పితిన్
మనమునకోపగించి ఘనమామకవాలము గాల్చనెంచుచున్.

వ. నాతోకకు నూనెగుడ్డ లనేకంబుల దెప్పించి,

గీ. చుట్టి కాల్పించి తనవారు చూచుచుండ
నూరద్రిప్పించె గాల్చితి నూరునంత
సీత మాతల్లి చల్లని చూపువలన
కాలకుండెను నాతోక కనుడు దీని.

వ. లంకలోనుండు రాక్షసవీరులలో నాల్గవవంతు వీరులను వధించితిని. లంక కాలి భస్మమయ్యెను. లంకయంతయు హాహారవములతో నాక్రందనధ్వనులు చెలరేగెను. నాతోకను సముద్రములో ముంచి చల్లార్చితిని. తదనంతరమున,

ఉ. క్రమ్మర సీతగాంచి నిజకాంతున కేమివచింతువమ్మ? నీ
కమ్మని దృష్టి గాల్పకను కాయమునిల్పె కృపాపయోధి! నే
నిమ్మగబోయి రామనృపునిప్పుడె దెచ్చెద లంకగూల్పగా
నమ్ముము నాదుమాట నిపుణంబుగ రావణుజీల్చు సత్వరన్.

చ. అనవిని సీత యిట్లనియె హర్షవశంబున రామచంద్రునిన్
మనమునలిల్పి కాయమును మంచిగ నిల్పెద కొన్నినాళ్ళు నా
ఘనునెటు దెత్తువో దయనుగావగనెట్టుల బూనియుంటివో
యనఘుడ! నీదుభారమని హాయని కన్నుల నీరునింపినన్.

వ. అపుడు నేను పతివ్రతాశిరోమణియగు సీతామహాదేవి నూరడించి ధైర్యవాక్యంబుల నుపశమితశోక నొనర్చి,

కం. అమ్మా ! సమ్మతి నుండుము
మాయమ్మారు వచింతు నమ్ము మానినుతు రామున్
కొామ్మా ! రావణుగూల్పగ
సమ్మతి గొనివత్తునమ్మ సత్యము వినుమా.

వ. అనిపల్కు నావాక్యములను సీత విశ్వసించెను. నేను సీతకు నమస్కరించి సెలవువేడ నాయమ 'వాయుపుత్రా ! నీవు యీ పూట నిట వసించెదవేని నామనస్సునకు కొంచెము హాయిగలుగును. కార్య భారము మిక్కిలిగ నీ తల నున్నది. పొమ్మనుటకు నోరురాకున్నది. ఏమి యందును ? నన్ను రక్షించు భారమంతయు రామునియందు విన్యస్తమై యున్నది. ఈ కార్యనిర్వహణమునకు సూత్రధారివి నీవు. నీ చిత్తానుసార మొనర్పుము. నిన్ను నమ్మి యుండెద' నని సీతామహాదేవి పల్క నేనామెంగనుగొని రామచంద్రభగవానునికి నీవృత్తాంతమంతయు సవిస్తరముగ విన్నవించి సాధ్యమగునంత త్వరలో గొనితెచ్చెదను. నా మాటను నమ్ముము.

సీ. అనిపల్కి సెలవొంది యంబరవీథిని సాగరమునుదాటి జక్కగాను
వానరులనుజేరి వాసిగవార్తల వినిపించి వారితోవేగబోయి
మహితు రామునిగాంచి మణినిచ్చిజానకి కుశలంబుదెల్పితికూర్మితోడ
వినివిభుడావార్త విశ్వాసవశమున నమ్ృతాభిలాషియానార్తుభంగి.
గీ. సీత గనుగొననాశించి శీఘ్రముగను
పయనమయ్యెను రాముడు భద్రముగను
పేన లెల్లను చేరెను సింధుతటము
నబ్ధిదాటుట యెట్లనో యనియె విభుడు.

వ. అపుడు దశాస్యానుజుడు విభీషణుడనువాడు సహజవివేకము గలవాడగుట రాముడు మానవమాత్రుడుగాడనియు, సీత లక్ష్మి యనియు, రాముడు పరమాత్ముడనియు దుష్టసంహారార్థము సాధురక్ష ణార్థ మవతరించిన నారాయణుడనియు దెలసి విపత్సమయమున భ్రాతను పరణము ధర్మమని తెలసియు సర్వవిధబంధువగు భగవంతునకు విముఖు

డగుటకు వెఱచి రావణునకు హితోపదేశమును సర్వవిధములజేసి యవమానితుడై స్వోజ్జీవనార్థము రామాశ్రయణమే కర్తవ్యమని నిశ్చయించి తన నలుగురు మంత్రులతోడను వెడలి శరణాగత రక్షణపరాయణుడగు రామభూవిభుని సమీపమునందు నాకాశమున నిలచి 'రామనృపాల! నేను రావణుని తమ్ముడను, విభీషణుడనువాడను. మాయన్నయగు రావణునితో 'సీతనిచ్చి శరణమును వేడు' మని బహువిధముల సభలో జెప్పి యవమానితుడనై లంకను దారాపుత్రాదులను విడిచి నిన్ను శరణమును బొందితిని.

గీ. రావణుని సోదరుండను రామచంద్ర!
శరణమును బొందవచ్చితి సత్యముగను
నన్ను రక్షించదలచుము నరవరేణ్య!
పాపి ననుకొనవలదు పద్మనయన!

గీ. వీరపత్నిని సీతను వినయముగను
రామభద్రున కర్పించి రాము కరుణ
బొందుమని నేను పలుసార్లు బోధజేయ
పాదములతోడ ననుదన్నె పాపి యతడు.

గీ. విడిచి దారను పుత్రుల విడిచి సిరుల
సర్వమును నీవెయనియెంచి సత్వరముగ
దాస్యమొనరింప జేరితి దడయకిపుడె
నన్ను కరుణను గావుము నరవరేణ్య!

గీ. సర్వభూత శరణ్యుని సత్యరతుని
రామనరపాలు సద్గుణు రమ్యదేహు
శరణమును గోరి వచ్చితి శమితరిపుని
సర్వవిధసేవలను నెప్డు సలుపువాడ.

గీ. సర్వధర్మంబులను వీడి సత్యముగను
రామశరణంబు బొందితి రమ్యముగను

సర్వపాపంబులను ద్రోలి సత్వరముగ
గావనెంచుము దాసుని కరుణతోడ.

గీ. వానరేశుని హనుమంతు వాలిపుత్రు
సర్వవానరవరులను సత్వయుతుల
వేడుచున్నాఁడ తెల్పుడు వేగమీరు
భీతి జేరెను రాము విభీషణుండు.

గీ. తప్పు నాయందు లేదని తలచి మీరు
వైరితమ్ముని జేర్చఁగ వలదటంచు
బలుకబోకుడు సత్యంబు బలుకుచుంటి
వైరి రావణు విడనాడి వచ్చినాఁడ.

వ. విభీషణవాక్యంబులను విని రామనృపుడు సుగ్రీవాదుల గను గొని విభీషణుని జేర్చుకొనుటకును విడుచుటకును మీయభిప్రాయ మేమియో వచించుడనియె. లక్ష్మణుండును సుగ్రీవుడును జాంబవంతుడు నిట్లు పలికిరి. ఇతడు రావణునికి కేవలముతమ్ముడుగాన పరిత్యాజ్యుడనిరి. హనుమంతుడను నేను 'విభీషణుడు రావణునకు జ్ఞాతి. జ్ఞాతులెపుడును సమయము నన్వేషించుచుందురు. కనుక జ్ఞాతియగు విభీషణుండు లంకారాజ్యమునుగోరి రావణుని వీడి వచ్చినవాడు. రాముని శరణమును పొంది రావణుని బరిమార్పించి లంకారాజ్యము నాక్రమించవచ్చునని విభీషణాభిమతముగాన విభీషణుని జేర్చుకొనుటయె యుక్త' మంటిని. జ్ఞాతులందరు భరతసము లనుకొనకుడు. శరణమును బొందినవానిని విడుచుట ధర్మము కాదంటిని. విభీషణుడు రాక్షసుడైనను సద్గుణు డంటిని. రామభద్రుడు వారివారి వాక్యంబులనెల్ల విని యిట్లు పలికెను.

గీ. ఇతడు మిత్రుడుగా వచ్చె నితని విడువ
తగదు దోషంబు గలిగిన దలచబోను
సాధు జనములు మెచ్చఁగ సత్వరముగ
గావనెంచితి నభయంబు గరుణ నిడితి.

గీ. భ్రాతలందరు భరతునివంటివారె?
పుత్రులందరు ననుబోలు పుత్రవరులె?
సచివులందరు నినుబోలు సచివవరులె?
వ్యసనములయందు భ్రాతలు వదలగలరు.

క. దుష్టుడో శిష్టుడో కానీ
దుష్టుండై నాకు నేమిదురితము జేయున్?
కష్టించినైన నేరడు
యిష్టునిగా నితనిగావ నెంచితిసుమీ.

క. ఇచ్చితి నభయం బితనికి
మెచ్చితినే నితనిగాంచి మేలౌసుండీ
సచ్చరితుడు గనవచ్చెను
మెచ్చగదగు పనుల నితడు మేలుగ జేయున్.

వ. వానరరాజా! నామాటలవినుము. మహావీరులగు దేవదానవ గంధర్వాదు లెందరెదురించినను వారినందఱ నా కిచ్చగలిగినచో నంగుళ్యగ్రమున గూల్చగల సట్టి యిచ్చ లేకుండుటచే మిమ్ముల నందఱ జేర్చుకొని ఈయాడంబరమును జరుపుచుంటిని. ఇతడు శరణమునుబొందెనుగాన రక్షించితిని.

క. ఒకసారి శరణమనుచును
ప్రకటంబుగ నన్ను నమ్మి ప్రార్థించినచో
నికటమును జేర్చి కాతును
సకలాత్మలననుచు దీక్షసలిపితిసుమీ.

గీ. గనుక నభయంబు నిచ్చితిగాన నీవు
వేగ గొనితెమ్ము మిత్రుని విశ్వసించి
విను విభీషణుగాచుట వింతగాదు
వీని యగ్రజునైనను విడువబోను.

వ. రామవాక్యములవిని సుగ్రీవుడు పరమాద్భుత మని యెంచి 'మహాత్మా! రామచంద్ర! నాయంతరాత్మకూడ విభీషణుడు శుద్ధుడనియె

బోధించుచున్న' దని పలికి సెలవొంది విభీషణు సమీపమునకు బోయి 'మిత్రమ! విచ్చేయుము రామసన్నిధి'కనిపలికితోడితెచ్చెను. విభీషణుడు తన నలుగురుమంత్రులతో రామపాదంబుల స్పృశించి వందనము లర్పించిరి. విభీషణుడు మహాత్మా! నేను రావణుని తమ్ముడ విభీషణు డను వాడను. రావణావమానితుడనై నిన్ను శరణము బొందితిననియె. రామభద్రుడు 'విభీషణా! రావణుసంహరించి లంకారాజ్యమున నిన్నభిషిక్తునిగ జేసెద'ననియె. విభీషణుడనుగృహీతుడనని. రాముడు సముద్రోదకమును తెప్పించి విభీషణుని లంకారాజ్యమున నభిషేకించెను. జాంబవంతుడు లేచినిలువబడి స్వామీ! రావణుడు సీతనిచ్చి శరణము వేడిన నేమియిచ్చెదవనిన రామభగవానుడు రావణు డట్టి పనిజేసిన క్షమించి నాయయోధ్యారాజ్యము నిచ్చెదననియె. తత్రత్యులందరు జయజయధ్వానములతో రామునికొనియాడిరి. సుగ్రీవుడు విభీషణుని గనుగొని రామభగవానుడు సముద్రమును దాటుట యెట్లనిన రామవిభుడు సముద్రుని ప్రార్థించవలెను. సముద్రుడు కృతజ్ఞుడేని రామునికి దారినివ్వగలడనియె. మరియు తనకు సాగరమనుపే రెట్లు వచ్చినదో యెరుగడా? సగరచక్రవర్తి కుమారులచే వృద్ధిబొందినవాడుకాడా ? విభీషణవాక్యమునుబట్టి రామనరపాలుడు ప్రాయోపవేశమున మూడుదినములు సముద్రుని ప్రార్థించెను. సముద్రుడు దర్శనమివ్వలేదు. నాల్గవదిన ప్రాతఃకాలమున రాముడు కనులదెఱచి గర్వియగు సముద్రునిగని కోపించి లక్ష్మణు గనుగొని,

గీ. చాపమిటు తెమ్ము లక్ష్మణ జాగులేక
ఘోరవిషతుల్యశరములగొట్టి యిపుడె
గర్వమడగింతు శుష్కాబ్ధి కాలినడల
సేనలెల్లను నడచును చిత్రముగను.

గీ. అన్న పలికిన పలుకుల కలరి యపుడె
విజయలక్ష్మిని గూర్చెడి విష్ణుచాప
మధికభక్తిని శరముల నమలగుణుడు
లక్ష్మణుండిచ్చె కైంకర్యలక్షణుండు.

సీ. శరము చాపమునందు చయ్యనగూర్చిన భయపడిపాథోధివరమభక్తి
సన్నిధి కేతెంచి శరణంబువేడుచు ప్రాణభీతిని వేగ ప్రణతిజేసి
నామాటవినవయ్య నరలోకదేవేంద్ర నలునిచే సేతువు నవ్యరీతి
గట్టింపనిలుచును కారుణ్యావశమున కట్టింపుమట్టుల కమలనయన

గీ. నలుడు జలమున విడిచిన నల్లరాయి
యైన బెండును బోలుచు నమలగతిని
తేలియుండును తండ్రియె తెంపుజేసి
వరము నీతని కిచ్చెను వరద వినుము.

గీ. గనుక వానరులందరు గండశిలల
పర్వతంబుల చెట్లను భవ్యగరిమ
దెచ్చియుందియు నలుడంది తీరుగాను
సాగరంబున సేతువు నలుపువాడు.

వ. అని సముద్రుడు వినయంబున బలికెను. రామవిభుడును సముద్రుని గనుగొని యీబాణ మమోఘము. ఎక్కుపెట్టినబాణమును రాముడెప్పుడును దింపడు. దీన దేనిని గొట్టుమనెదవో తెల్పుమనిన సాగరుడు ద్రుమకుల్యమను పుణ్యక్షేత్రమున దస్యులు ఆవేశించి లోకుల హింసించుచున్నవారు. వారిపై విడువుమనియె నట్లు విడిచిన వారలు మృతులైరి. రామాజ్ఞను నలుడు సేతువుగట్టుచుండెను. వానరు లందరు పర్వతాదుల నందించుచుండిరి. ఐదుదినములలో సేతువు నిర్మించబడినది. పది యోజనముల వెడల్పును నూరామడ పొడవుగల సేతువు భద్రముగ నిర్మించబడినది. రామభగవానుడు నన్నును లక్ష్మణు డంగదుని నధిష్టించి సర్వవానరసేనతో సాగరమునుదాటిరి. అట లంకలో రావణాజ్ఞను విద్యుజ్జిహ్వుడనువాడు రామశిరంబును శిరోమణిని ధనమ్మును బాణంబులను నిర్మించి దశవదనునకిచ్చెను. వానిని రావణుడు కొని చని సీతకు చూపించెను. సీత నిజమనుకొని బహువిధంబుల విలపించెను. సమయమునుచూచి విభీషణపుత్రిక సరమయనునది 'నీవు విలపించకుము. ఇది మాయ, విద్యుజ్జిహ్వుడనువాడు మహామాయావిదుడు. మాయగా

నిట్లు నిర్మించెను. నిన్ను మోసవుచ్చుటకు నీ సన్నిధికి తెచ్చి విడిచి రావణుడు పోయెను. ఇది మాయాకల్పితముగాని వాస్తవముకాదు. మాయాకల్పితము లేడుగడియలకంటె నెక్కువకాలము నిలువయుండవు. ఇప్పటి కేడు గడియలు దాటినవి గనుకనే యామాయాకల్పితము లన్నియు మాయమై పోయినవి. చూడుము. నేనిప్పుడే రాముని సేనా వారమును చూచివచ్చితిని. రామభగవానుడు లక్ష్మణుడు వానరులు సుఖముగ నున్నవారు. మా తండ్రియగు విభీషణుడు రావణసోదరుడు. వారిలో తన నలుగురు మంత్రులతోడను చేరియున్నాడు. రాముని గూర్చి నీవేమియు శోకించకుము. రాముడు సుఖయై యున్నవాడు. రామలక్ష్మణులు వానరమధ్యముననున్నారు. నీ యందు మంచిలక్షణము లగుపించుచున్నవి. నీకు మంచికాలము సమీపించినది. నీభర్త జయ మును నిస్సంశయముగ బొందును. రావణుడు సమూలనాశనమును బొందును. రామలక్ష్మణులు వానరులు పూర్ణోత్సాహముతో నున్నా' రను చుండ వానరసింహనాదములు వినవచ్చినవి. సీత సరమావాక్య ముల నమ్మెను. సరమ లంకలోనికేగి తిరిగి సీతను గనుగొని 'యమ్మా! రావణుని తల్లియు అవిద్ధుడను మంత్రియు మండోదరియు మాల్యవంతుడు రావణుని బ్రతిమాలి మించిరాకుండగనే సీతనర్పించి రామునితో సంధి జేసికొనుమని యనేక విధముల జెప్పిరి. వారిమాటలు రావణుని తల కెక్కినవి కావట. మా తండ్రియగు విభీషణుడు రామభద్రునిగని మహాత్మా! యీ రాత్రి మనమందరము యోజనద్వయోన్నతిగల సువేలపర్వతము నధిరోహించి యుందమనియె నట్లందరు సువేల నధిరో హించిమధ్యప్రదేశమునరామలక్ష్మణులును, చుట్టును వానరసేనావారము నివసించిరి. విభీషణుడు మంత్రులు జాగరూకులై నిద్రావశులుకాక చుట్టును తిరుగుచుండిరి. సుగ్రీవుడు సువేలాగ్రము నెక్కి లంకవైపునకు పరిశీలనతో చూచెను. రావణుడు సౌధాగ్రమున నిలిచి శ్వేతఛత్రము మొదలగు రాజచిహ్నములతో వానరసేనను చూచుచుండుట కనిపిం చెను. తద్వైభవము సహించనేరక చివాలున నెగిరి కోపావేశమున ధావణుని శ్వేతఛత్రమును విఱిచి ముక్కలుచేసి భూమిపై బడవేసి

రావణుని మర్దించెను. వానరరాజ రావణులు ఘోరముగబోరిరి. రావణుడు మాయాబలము ననుసరింప సుగ్రీవుడు చివాలున నెగిరి సౌధాగ్ర శిఖరమును విరచి భూమిపై బడవేసి రామసన్నిధిని నిలచెను. రామభద్రుడు సుగ్రీవు నాలింగనమొనర్చి నీకిట్టిసాహసము తగదనియె. ప్రాతఃకాలమున కాల్యకృత్యముల దీర్చి రామనరపాలుడు సుగ్రీవుని గనుగొని శకునములు మంచివిగ గనుపించుచున్నవి గనుక నిపుడె లంకకువెడలి లంకాద్వారముల నవరోధింతమనియె. వల్లెయని సుగ్రీవుడు వానరసేనల యుద్ధమునకు బయలుదేరనాజ్ఞయిడియె. రెండవసాగరమువలె సేనావారమంతయు వెడలి లంకాద్వారములనన్నిటి నవరోధించిరి. అపుడు రామప్రభు వంగదునిగని 'నీవు సత్వరముగ రావణునిగని నిన్ను సంహరించుటకు రామభద్రుడు లంకాద్వారమున నున్నవాడు. నీకుగల బలమును చూపించుమని నేనన్నానని పలుకుము పొమ్ము' అనియె. రామాజ్ఞ నంగదుడు రావణునిజేరి రామవాక్యముల వినిపించి నేను వాలిపుత్రుడ, నంగదుడు నాపేరు. రామదూతననియె. రావణప్రేషితులగు నైదుగురు రాక్షసు లంగదుని బట్టుకొనిరి. అంగదుడు వారలతోడనే యాకసమున కెగసి యటనుండి వారి నైదుగురిని భూమిపైన బడవేసెను. రాక్షస వీరు లైదుగురు మృతులైరి. అంగదుడు మహోన్నతమగు ప్రాసాదశిఖరమును విరచి రావణునికభిముఖముగ బడవేసి త్వరలో నీవిట్లనే భూమింబడెదవని పలికెను. వాలిపుత్రుడు రామసన్నిధిని నిలచెను. రాక్షసులు యుద్ధమునకు వెడలిరి.

క. వానర రాక్షస వీరులు
మానాతిగ సమరసక్తమానసు లగుచున్
మానుగ బాహాబాహిని
బూనిరి యుద్ధంబుజేయ బూనికతోడన్.

గీ. వాలితనయుని కోడిన వాసవారి
నాగపాశంబులను గట్టె నరపతులను

దైవయోగము దప్పింప తరముగాదు
రాఘవులు భూమిబడి రీల్గు రణమునందు.

వ. కొంతసేపటికి రామభగవానునికి తెలివికలిగెను. లక్ష్మణుం డట్లనే పడియుండెను. రామనరపతి లక్ష్మణుగూర్చి పలువిధముల శోకించె నంతగొప్పగాలి విసరెను ధూళి భూమ్యంతరములగప్పెను. వైనతేయుడు రామలక్ష్మణుల సన్నిధిని నిలచెను.

గీ. గరుడు డేతేర నాగులు గడచిపోయె
రామ లక్ష్మణు లతనిని రమ్యముగను
గనుల గనుగొని నీకింత కరుణయేల
గలిగె నన మీకు దాసుడగానె యనియె.

గీ. మిత్రుడను నీకు దాసుడ మిత్రకులుడ
నన్ను భృత్యుని వేఱుగ నవ్వుసిగను
దలచబోకుము దయయుంచు ధన్యతముడ !
కనుచునుందును నిన్నెప్డు కనులతోడ

క. గరుడుని గనుగొని రాముడు
మరతునె నీచేత నేను మనమున నుంతున్
బలువడి గాచితి విట్టుల
బలిమాత్రుడవీవు మాకు వక్షికులేంద్రా !

క. అన విని వినయంబొప్పగ
దన నెలవునకేగదలచి దశరథతనయా !
వని వినియెద సెలవొసగుము
మనమున గరుణించవయ్య మహిత విచారా !

వ. అని పలికి సెలవొంది తన నెలవున కేగెను. క్రమముగ ధూమ్రాక్షుడు వజ్రదంష్ట్రుడు కంపనుడు నరాంతకుడు దుర్ముఖుడు ప్రహస్తుడు మృతులైరి. రావణుడు మహాసేనతో స్వయముగ యుద్ధమునకు వచ్చెను. రామరావణులకు ఘోరయుద్ధము జరిగినది. వానర రాక్షసులనేకులు మడసిరి. రావణలక్ష్మణులు భయంకరముగ బోరిరి.

రావణుడు తనకు చతుర్ముఖబ్రహ్మ యిచ్చిన శక్తిని లక్ష్మణునిపైకి విడిచెను. లక్ష్మణుడు మూర్ఛితుడయ్యెను. రామరావణులు భయంకర యుద్ధమొనర్చిరి. రామచంద్రుడు రావణుని రథమును చాపమును సూతుని రథ్యములను నరకెను. రావణు డూర్ధ్వబాహుడై నిలచి యుండెను. రామనృపతి రావణునిగని 'నీ వలసియున్న వాడవు. నీపోకకు సమ్మతించితిని. నేదతీర్చుకొని రమ్ము పొ'మ్మనియె. రావణుడు పాదచారియై లంకకు పరువిడియె. రాముడు లక్ష్మణుని సన్నిధికిచేరి మిగుల విచారించుచుండెను. జాంబవంతాదివృద్ధులు రామునోదార్చిరి. సుషేణుడులక్ష్మణహస్తమునుబట్టి నాడినిచూచి 'రామరాజా! లక్ష్మణుడు మృతుడు కాలేదు. ఇది మూర్ఛ. నాడి దివ్యముగ నున్నదనుచుండ లక్ష్మణుండు నిద్రనుండి లేచినటుల లేచెను. రామభగవానుడును వానరులందరు సంతసించిరి. కుంభకర్ణుడు నిద్రనుండి లేచి రావణాజ్ఞను యుద్ధమునకు వెళ్లెను. వానరులకు రాక్షసులకు ఘోరయుద్ధము జరుగుచుండెను. కుంభకర్ణుడు వానరులను బట్టి మ్రింగుచుండ ముక్కులలోనుంచి పైకి వచ్చుచుండిరి. సుగ్రీవుడు కుంభకర్ణునితో బలముగపోర చేతులతో సుగ్రీవునిబట్టుకొని లంకకు పరుగుపరుగున పోవుచుండెను. వారివెనుకను నేనటుగుచుంటిని. సుగ్రీవుడు కుంభకర్ణుని ముక్కుచెవులను పూర్ణముగ దంతములతో గొరికివైచెను. కుంభకర్ణుడు సుగ్రీవుని భూమిపై విసరివేసెను. సుగ్రీవుడు భూమిపై బడక నెగిరి రామపార్శ్వమున నిలచెను. రామనరపాలుడు తనపైకివచ్చు కుంభకర్ణుని గనుగొని గదతోకూడిన కుంభకర్ణుని కుడిహస్తమును నటికివేసెను. దానిక్రిందపడి వానర రాక్షసులనేకులు మృతినొందిరి. కుంభకర్ణుని వామహస్తమును కూడ రామనరపాలుడు ఖండించెను. కుంభకర్ణుడు నోరు తెరచుకుని యాకాశపథమున రాముని మ్రింగవలెనను నూహతో వచ్చుచుండెను. కుంభకర్ణుని శిరస్సును తీక్ష్ణబాణమున రామభగవానుడు నటికివేసెను.

గీ. కుండలాలంకృతంబైన కుంభకర్ణ
 శిరము వెలసెను రాతిరి చిత్రముగను

యదితి నక్షత్ర మధ్యస్థుడైనయట్టి
కువలయేశు బోలుచు కుదురుగాను.

వ. కుంభకర్ణునికథ విని రావణుడు మహాసేనలను మహావీరులను బంపెను. వాలి పుత్రు డంగదుడు నరాంతకుని, దేవాంతక త్రిశిరుల నేనును, మహోదరుని నీలుండును, మత్తోన్మత్తులవృషభుడును, లక్ష్మణుడతికాయుని గూల్చితిమి. శక్రారిసేనలతో గూడి యేతెంచి వానరు లనేకుల సంహరించి యట్టహాసము చేయుచు బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. సకల వానరులను రామలక్ష్మణులను భూమిపై పడవేసి లంకకేగి తన తండ్రికి గత వృత్తాంతము నెఱిగించెను. నేనును విభీషణుడును మాత్రము తెలివితో నుంటిమి. వానరులను పరిశీలించుచుంటిమి. జాంబవంతుడు మాటలనుబట్టి విభీషణుడని గ్రహించి 'మిత్రమ! హనుమంతుడు జీవించి యుండెనా?' యని యడిగెను. విభీషణుడు 'మిత్రరత్నమ! రామలక్ష్మణ సుగ్రీవుల నడుగక హనుమంతు నడిగితివేల?' యనియె. జాంబవంతుడు హనుమంతుడు బ్రతికియున్న నందరము బ్రతికినవారమె. అతడు లేకున్న నందరము మృతులమె యనియె. నేను వినయంబున సన్నిధికేగి నమస్కరించి నాపేరు చెప్పితిని. జాంబవంతుడు 'గొప్ప విపత్తు కలిగినది. వీరి నందరిని నీవు బ్రతికించవలెను. కనుక సత్వరముగ లేచి హిమవంతమును దాటుము. కైలాసగిరిమధ్య నోషధిపర్వతము కలదు. దాని యగ్రమున మృతసంజీవని విశల్యకరణి సంధానకరణి సావర్ణ్యకరణి యను నాలుగోషధులు గలవు. వాటిని గైకొని సత్వరముగరమ్ము. రాజులను వానరులను బ్రతికింపుము. సూర్యోదయమైన ప్రమాదము కలుగును సుమీ' యనియె.

గీ. వానిమాటలవిని నేను వానియందు
కలుగు భక్తిని రాముని కష్టములను
దలచి వేగమ నేగగ ధైర్యగరిమ
మానసంబున దలచితి మహీప! వినుము.

సీ. శీతాచలంబున సిద్ధౌషధంబులు గనపడకుండుట గనలినేను
కొండను పెకలించి గొబ్బున తలదాల్చి దశరథరాముని దరికిజేరి
పర్వతమునునేను ప్రక్కన నిలిపితి దివ్యౌషధిగ్రహణ దివ్యమహిమ
రాముడు సౌమిత్రి రాణువయంబెయు నిదురలేచినయట్లు నియతితోడ
గీ. తెలివినొందిరి యప్పుడు ధీరులంత
వారి గనుగొని మెచ్చిరి వాసవాదు
లపుడు వానరనాథుడు హర్షమునను
కౌగిటనుజేర్చి నన్నప్డు గారవించె.

వ. ఆ సాయాహ్నమున సుగ్రీవుడు వానరవీరులనుగని మీరందరు కొఱవుల బట్టుకొని లంకనంతను కాల్చుడు పొండనియె. వానరులు సుగ్రీవాజ్ఞను లంకాపట్టణమును హుతవహజ్వాలాలంకృతి మొనర్చిరి. వానర రాక్షసులు ఘోరముగ బోరిరి. సూర్యోదయానంతరమున లంక నుండి యమిత రాక్షససేన వెడలి యనేక వానరులను బరిమార్చిరి. అపుడు కంపప్రజంఘుల నంగదుండును శోణితాక్షుని ద్వివిదుడును యూపాక్షుని మైందుడును కుంభుని సుగ్రీవుడును నికుంభుని నేనును మక రాక్షుని రామనృపతియు ద్రుంచితిమి. హతశేషులగు రాక్షసులు లంకకు పరుగులిడిరి. అపుడింద్రజిత్తు మహాసేనలతోడ నేతెంచి వానరుల ననేకుల సంహరించి యంతర్ధానుడై తిరిగివచ్చి మాయాసీతను తెచ్చి రామ లక్ష్మణులు జూచుచుండ యజ్ఞోపవీతక్రమమున ఖండించె. అది నిజమని రామలక్ష్మణులువిచారపడుచుండిరి. విభీషణుడు 'రామరాజేంద్ర' విచార పడకు. మిది యసత్యము. ఇటుల మిమ్ము మోసపుచ్చి మాయాసీతను ఖండించి యంతర్ధానమును పొందినవాడు. ఇట్లంతర్ధానము నొంది గొప్ప ప్రయత్నమొకటి చేయగలడు. లంకాపట్టణములో నికుంభిల యను దేవత యొకటి కలదు. నికుంభిలాభిముఖముగ వీడు హోమమొనర్చి యాదేవతనుమెప్పించి రథాశ్వచాపబాణములబొందును. అట్లుహోమము నిర్విఘ్నముగ నెఱవేరి రథాశ్వచాపబాణముల బొందిన నితడవధ్యుడు. మహావీరు లెవరును వీనిని సంహరించలేరు. మహావీరు లెంతటి వారైనను వీనిచే హతులగుదురు, కాన నిపుడాహోమమును విఘ్న

మొనర్చవలెను. కనుక మహావీరులు హోమమును విఘ్నమొనర్చుటకు సత్వరముగ బయలుదేరవలెను. నేను, నా మంత్రులిప్పుడె మీరుపంపు మహావీరులతో నికుంభిలకేగి యా హోమమును విఘ్నపరచెదమని విన్నవించెను. రామవిభు డామాటలను విని లక్ష్మణవీరుని గనుగొని నీవు విభీషణ సుగ్రీవాంగద హనుమంతాది వీరులతో నికుంభిలకేగి హోమమును విఘ్నపరచి శక్రారిని ద్రుంచి రమ్మనియె. లక్ష్మణుడు విభీషణాదులతోగూడి నికుంభిలకేగి దీక్షాపరుడై హోమ మొనర్చుచున్న యింద్రజిత్తునుగని హోమమును విఘ్నమొనర్చెను. శక్రారి యాగ్రహించి యుద్ధమునకు వెడలె. ఇంద్రజిల్లక్ష్మణులకు ఘోరముగ పోరు జరిగినది. లక్ష్మణుడు మహాగ్రహమున నైంద్రాస్త్రమును చాపమున సంధించి,

గీ. సత్యసంధుడు రాముడు సత్వనిధియు
నైన శస్త్రమ నీవిపు డమరశత్రు
హతము చేయుము వేగమ హాయిగాను
సంప్రహృష్టుని ననుజేయ జాలుమనుచు.

వ. పలికి లక్ష్మణుడు మంత్రమును భక్తితో జపించి నారి నాక ర్ణాంత మాకర్ణించి యా యైంద్రాస్త్రమును శక్రారిపైకి బంపెను.

గీ. అస్త్ర మప్పుడు వేగమ యంటిగి యతని
ప్రాణములదోల భూమిపై బడియె నతడు
లలిత సద్గుణుడైనట్టి లక్ష్మణుండు
పటిమ వీరత్వమునుజూపి ప్రతిభగాంచె.

క. బలమున లక్ష్మణు డాజి
స్థలమున మేఘనాదుగని చలమున గూల్చెన్
బలభేది బలుద్రుంచిన
సలలిత మార్గంబుద్రొక్కి సాహసమొప్పన్.

వ. ఇట్లు శక్రారి నిహతుడైన హతశేషులగు రాక్షసులు లంకకు బఱువులిడి ఇంద్రజిత్తుని హోమవిఘ్నమును ఘోరయుద్ధమును శక్రారివధ

యును వినిపించిరి. విని దశాస్యు డతివేల దుఃఖాక్రాంతుడై చేయునది తోచక కొన్ని నిముషములు నిర్వీణుడై యుండె. మాల్యవంతుడునుమండోదరియు తిరిగి రావణుని సంధి యొనర్చుకొనుమని ప్రార్థించిరి. వారి మాటలు రావణునికి రుచించినవికావు. ఇట లక్ష్మణ సుగ్రీవాదులు మహాసంతోషముతో రాముని సన్నిధికిజేరి విభీషణుడు జరిగినవృత్తాంత మంతయు రామునకు విన్నవించి లక్ష్మణవీరుని పరాక్రమమును వర్ణించి చెప్పి విరూపాక్షాది రాక్షసులందరు మాచేత నిహతులై రని పలికెను. రామచంద్రుడు సౌమిత్రి నాలింగన మొనర్చి సంతసించుచు లక్ష్మణవీర సోదర! నీవు మహావీరుడు పరాక్రమవంతుడు శక్రజేతయగు మహామాయావిదుని యనన్య నిర్జితుని జయించి భువనమున నకలంకకీర్తి నార్జించితివి. నన్ను మెప్పించితి వని పలికెను. లంకలో రావణుడు తన మనంబున నిట్లు తలచెను.

కం. నీటను తేలెను రాళులు
వాటముగా పనులుజేయ వలరిరి కీశుల్
నీటుగ మనుజులు దనుజుల
పాటవముగ జంపి రహహా బహుభంగులుగన్.

గీ. కాలమంతయు విపరీతగతినినుండె
కనలిచేయుగ నేదియు గానరాదు
దండిమగటిమి కలదయ్యొ దైవమిష్ట
శక్తి యుక్తిని సాధింతు సర్వమిపుడు.

వ. అని తలచి మహాసేనతోడను మహావీరులతోడను రావణుడు యుద్ధమునకు బయలుదేరి యుద్ధరంగమునకు చేరెను. రామ రావణులు దివ్యాస్త్రప్రయోగమున కుపక్రమించిరి. రావణుడు ప్రయోగించిన యస్త్రముల నన్నిటిని ప్రత్యస్త్రములచే రాముడు వారించెను. లక్ష్మణుడు రావణ హస్తగతమగు చాపమును మహోగ్రశరమున ద్రుంచెను. విభీషణుడు తన గదచే రావణ రథాశ్వములను రావణ సారథిని ద్రుంచెను. రావణుడు మిగుల నాగ్రహించి మాయుడు తన

కిచ్చిన శక్తిని విభీషణునిపైకి ప్రయోగించెను. లక్ష్మణు డడ్డాసిని తన రొమ్మునఁదాల్చి భూమిపై నిశ్చేష్టితుఁడై పడెను. వానరులు రాక్షస మూకల నన్నిటిని గూల్చిరి. రావణుడు లక్ష్మణుని లంకకుగొని పోవ దలచి తన బాహువుల నెత్త బ్రయత్నించి విఫలప్రయత్నుఁడయ్యెను. నేను రావణుని రొమ్ము వ్రక్కలగునట్లు పిడికిలితో మొత్తితిని. రావణుడు రక్తమును గ్రక్కి భూమిపై బడియెను. నేను లక్ష్మణుని బాహువుల నెత్తి బుజమున నుంచుకొని రాముని సమీపమునకు చేర్చితిని. రావణుడు పాదచారియై లంకకు పరువిడెను. వానరులంద రట్టహాసమొనర్చి నవ్విరి. సుషేణుడు దివ్యౌషధుల లక్ష్మణు నాఘ్రాణింపజేసెను. లక్ష్మణుడు సుఖనిద్రనుండి లేచినటుల లేచెను. రావణుడు తిరిగి రథసారథుల తోడను సేనలతోడను విచ్చేసి రామునితో ఘోరముగ బోరెను.

గీ. రాముఁ డప్పుడు రావణ రథ్యములను
జంపి మార్గణశతమున సరసగతిని
రావణునిగొట్టి ఫాలంబు రమ్యబాణ
భగ్న మొనరించి పలికెను భయముదోప.

## — రామభద్రుని పరుషోక్తులు —

గీ. చోరవృత్తిని సతిగొని శూరుభంగి
సిగ్గులేకను దిఱిగెదు శీలహీన!
నిన్ను బఱిమార్చి లోకుల నిరుపమాన
నీతియుక్తుల జేసెద నీచ! యిపుడె.

గీ. ధనదు తమ్ముఁడవై పుట్టి దనుజులెల్ల
గొలువ దిఱుగుచు నీచంపు గొడవలిట్లు
చేయుచుంటివి నిన్నిప్డు చేవజెఱచి
వలువ! వలుపాట్ల పెట్టెద పాఱకుండు.

గీ. నిలచి పోఱుము శూరత నీకు కలదె
మాయఁ జేయగ లేవిక మలినచిత్త!

లేడిపోయెను సాయంబులేదు నీకు
పారిపోలేవు నాబారిపడక యిపుడు.

క. చేసితివి పాపమెంతయొ
మోసము వాటిల్లె యముని మొగసాలకు వే
గాసిల బంపెద పశువా!
భాసురముగ పారిపోక పటుగతి నిలుమా.

వ. అను రామవాక్యముల విని యాగ్రహావేశమున మహా శూలమును రామునిపై ప్రయోగించి 'రామా! నీవును నీతమ్ముడును నీశూలంబున మడిసెద'రనియె. రాము డద్దానిని యష్టఘంటాయుక్త మగు దివ్యశక్తిచే ఖండించెను. రామప్రయుక్త శరవర్షమున కాగలేక వణకుచున్న రావణ హస్తగతచాపము బాణసహితముగ రథముపై బడియె. రావణుడు నిశ్చేష్టితుడై రథమునగూలెను. రథసారథి రావణ రథమును రణరంగమునుండి తొలగించెను. కొన్ని నిముషములకు రావణుడు తెలసి సారథిని నిందించి రాముని గూల్చక లంక చొరననియె. ఈ యవకాశమున నగస్త్యమహాముని శ్రీరామున కాదిత్యహృదయము నుపదేశించెను. రామరావణులు పరస్పర జయాభిలాషులై మహోగ్రముగ బోరిరి.

కం. వానర రాక్షసవీరులు
బూనిరి విస్మయము నపుడు పూర్ణముగాగన్
మానుగ బొమ్మలబోలిరి
కానగ లేదిట్టిపోరు గతమున ననుచున్.

గీ. దేవబృందములప్పుడు తేటిచూచి
రామరావణ జయముల రక్తిదవిలి
రామజయమున స్వస్తిని రామునకును
దనుజ జయమున స్వస్తిని దనుజునకును.

గీ. పలుకుచుండిరి ఖీతిని పటిమవీడి
యపుడు కేతువుగూల్చెను హరిగుణుడు

రాముడదిగని కోపించి రావణుండు
రామచంద్రుని గొట్టెను రభసముగను.

గీ. రాము డద్దాని గనుగొని రభసవృత్తి
రమ్యశరముల బఱపుచు రావణాఖ్యు
దేహమంతయు తూట్లుగ దెఱపిలేక
యుండునట్లుగ గొట్టె మహోగ్రముగను.

వ. అపుడు రావణుడు యుద్ధముననుండి లంకకుబోయి హోమ మొనర్చి రథాశ్వ చాపబాణముల బడసి రాముని సంహరించదలచి దీక్షితుడై హోమ మొనర్చుచుండెను. విభీషణుడు తన మంత్రుల వలన విని రామదర్శన మొనరించి మహారాజా ! రావణుడు దీక్షితుడై నికుంభిలాహోమము నొనర్చుచున్నవాడు. హోమము నిర్విఘ్నముగ పరిసమాప్తినొందిన రథాశ్వచాపబాణములు లభించిన రావణు డవధ్యు డగుగాన నిపుడె హోమవిఘ్న మొనర్పవలెనన్న రామభగవానుడిపుడు చేయదగినపని యేమియని యడిగెను. విభీషణుడు వాలిపుత్రుడగు నంగదుడు సత్వరముగ లంకకేగి మండోదరిని కేశములబట్టి రావణుడు హోమ మొనర్చు చోటున కీడ్చుకొని రావలెను. మండోదరియవస్థను చూచి హోమమునువీడి యుద్ధమునకు వచ్చునపుడు రావణుని సంహరించవచ్చు ననియె. అంగదుడు సత్వరముగ బఱుగిడి మండోదరిని బట్టి రావణు సన్నిధి కీడ్చి తెచ్చెను. మండోదరి రావణునిజూచి మిగుల నిందించి యేడ్చెను. రావణు డాగ్రహించి హోమమును జాలించి యంగదుని మర్దించెను. వాలిపుత్రుడును రావణుడును మహోగ్రయుద్ధ మొనర్చిరి. అవకాశమును చూచుకొని యంగదుడు లాఘవముగ నెగసి యాకాశ మార్గమున రామపార్శ్వమున నిలచెను. రావణుడు లంకకునేగి యుద్ధ సన్నద్ధుడై రణరంగమునకేగి రామునితో ఘోరముగ బోరుచుండెను. పురుహూతు డాకసమునుండి రామరావణుల యుద్ధమును చూచి మాతలిని బిలిచి 'మన రథమునుగొని చని రామునకిమ్ము. భూస్థుడై రాముడు రావణునితో బోరుట బాగుగలేదు. సత్వరముగ బొమ్మనియె. మాతలి

రథమునుదెచ్చి రాముని నంపధిష్ఠింపజేసెను. రామరావణులు పోరు చుండిరి.

క. దివిజాధినాథు రథమున
దివిజేశుని భంగి నెక్కి దివిజులు బొగడన్
దివిజారి ద్రుంచదలచెను
భవితవ్యము దెలిసినట్టి భవ్యులు మెచ్చన్.

గీ. కనుల గనుగొని దివిజులు గలనిలోన
రావణుడు గెల్చి జగముల రాయునేమొ
యనుచు భీతిని మనమున నధికముగను
గనిరి రాముడు ఘనశక్తి గలచె దైత్యు.

వ. రావణుడాగ్రహించి శూలమును రామునిపై ప్రయోగించిన రామనరపాలు డాశూలమును ఖండించి రావణశిరస్సులను ఖండించెను. పతిత శిరస్సామ్యములగు శిరస్సు లుత్పన్నములయ్యె. ఇట్లు ఏకోత్తర శతశిరస్సులఖండించి పునఃపునరుదయమానములగు శిరస్సులగని మాతలిని గనుగొనిన మాతలి 'రామచంద్ర! నీవు సర్వజ్ఞుడ వవిదునట్లవర్తింతువు. రావణుని వక్షస్థలమున బ్రహ్మవరమున శిరోజనక మహావిశేష మొకటి కలదు గాన బ్రహ్మాస్త్రమున వీని వక్షస్థలమును భేదింపుమనిన రామ భగవానుడు బ్రహ్మాస్త్రమున రావణ వక్షస్థలమును భేదించెను. త్రిభు వనకంటకుడగు దశాస్యుడు మృతుడై రథమున గూలెను. మహేంద్రాది దేవతలును మహర్షులును సర్వభూతములును సంతోషించిరి. సుగ్రీ వాదులు పరిపూర్ణానందము నొందిరి. అంతరిక్షమునుండి రామునిపైని పుష్ప వర్షంబు గురిసెను. దేవదుందుభులును మ్రోగినవి. నారదు డంతరిక్షముననుండి,

గీ. పాపమును చేయుపట్లను భయములేక
పరుల వనితల బొందగ పాట్లుపడుచు
లోకులందరు నిందింప లోభవృత్తి
తుచ్ఛులిట్లనె చెడుదురు తుదకు వినుడు.

చ. కులముతొలంచు సద్గుణము గూల్చు వివేకము బోవజేయుచు
స్జలములగల్చు ధర్మమును జంపు నహింసను గాల్చివేయు ని
ర్మల చరితంబు పోనడచు మానము బాపును పాపభీతిని
న్వెలయదు బుద్ధికామ శరవిద్ధ మనస్కుత చిత్ర మిద్ధరన్

వ. శరీరమన శిథిలమగునది, దేహమన నగ్నిచే గాల్చబడునది యని యర్థము. ఇట్టి తుచ్ఛశరీరమును శాశ్వతమని నమ్మి యస్థిరములు కష్టభూయిష్టములగు తుచ్ఛసుఖముల నాశించి బంగారమువంటి కాలమును వ్యర్థపుచ్చుదురు. బ్రతికిన స్వల్పకాలమున మంచిగ నడచి లోకుల నుతులకు లోనగువాని జీవనమె జీవనము. బలవంతుడనని విర్రవీగి తుద కిట్లనె చెడుదురు. క్షణము జీవించినను కీర్తి నార్జించినవాడే పురుషుడు.

క. ఘనుడై రావణు డీల్గెను
ఘనవిద్యుడు తపమునందు ఘనుడౌ మిగులన్
మనమలరు విభవమందియు
తనయానుజబంధుమిత్రతతితో బోయెన్.

క. తన సుఖమును పరసుఖమును
తన మనమున సమముగాగ దలచుచు నెపుడున్
తన కష్టము పరకష్టము
తన మనమున సమముగాగ దలచగవలయున్.

గీ. ఎంతకాలము బ్రతికిన నెంతశక్తి
కలిగియున్నను ఫలమేమి? కడకునింతె
గనుక పరులకు మేలైన గతిని నడచి
కీర్తి నార్జించువాడెపో కీర్తితుండు.

క. పురుషుడు పౌరుషకీర్తుల
పడువడి విజ్ఞానపరత పరహితపరుడై
దురితముల చేయబోవక
బరగిన యొకపూటయైన భద్రముగాదే.

గీ. బ్రతికె చిరకాల మీతడు పరమసుఖము
గనియె తపమున బరమేష్ఠి కరుణగాంచె
వీరవిక్రమకేళిని విగ్రహించె
మంచికంటెను చెడ్డయె మహిని నిలిపె.

కం. పరదారల పరధనముల
పరిహీనసుఖంబుకొరకు పాపులుకోరన్
పరవాసుదేవు డెవ్వడు
పరిహాసముజేసి వాని ప్రాణము గొనుబో.

వ. ఇట్లు పలికి రాముని సేవించి ప్రార్థించి స్తుతించి తనదారిని తాను బోయెను.

వ. అంత రావణాంతఃపురమునుండి మండోదరి ప్రభృతులగు రావణభార్యలు పాదచారులైవచ్చి రావణునిపైబడి యనేకవిధముల విలపించిరి. మండోదరి శోకము నెట్లనో క్రమింగి రాముని గనుగొని మ్రొక్కి— 'మహాత్మా! నీ వెవరవో నే నెఱుంగుదును. నీవు పరవాసుదేవుడవు. స్వామీ! నా భర్త విశేషజ్ఞాని. నిన్ను బాగుగ నెఱుంగును గాని నీచేత మృతిబొందవలెననెడి తలంపుతో నింత దారుణకృత్యమొనర్చెను. నీవలన మృతినొంది పునీతుడయ్యెను. సద్గతినొందెను. మహాత్మా! దయయుంచి నన్ను నాభర్తసన్నిధి కంపుము. నీవీ పుణ్యమును కట్టుకొనుము. నీవు సర్వజ్ఞుడవు. మనుష్యమాత్రుడవుకావు. సర్వేశ్వరుడవు. సర్వనియంతవ'వని స్తుతించెను. విభీషణు డంతవరకును రావణునియం దత్యంతాగ్రహము తోడనెయుండెను. మండోదరీదుఃఖమును చూచుటతోడనే హాతాదాపతిత తీవ్రదుఃఖావేశుడై పలువిధముల దుఃఖించెను. సహజ సౌహృద మెట్టివానినైన నిట్లు చేయునుగదా! రామభగవానుడు దుఃఖించుచున్న విభీషణునిచెంతకేగి యోదార్చి 'విభీషణ! శోకించకుము. ఎంత చింతించినను ఫలమేమియులేదు. ప్రాణులందరగతియు నిట్టిదె. పుట్టినవాడెవడును నిచట శాశ్వతముగ నిలువబోడు. మన కనులకగపడు యణువు మొదలు మహాత్మువరకుగల సమస్త జీవ నిర్జీవరూప స్థిర చరరూప పదార్థము

లన్నియు నశించిపోవునవియె. పంచమహాభూతమయములగు దేహములు శాశ్వతములు కావు. నీ సహోదరుడు లోకసామాన్యుడు కాడు. మహావీరుడు. వేద వేదాంత వేదాంగవిదుడు. కీర్తిగలవాడు. చిరజీవి. యుద్ధశౌండుడు. మహోత్సాహసమన్వితుడు. ఇట్టి మహావీరుని మృతికి నీవంటి క్షత్రియ వీరుడు విచారించతగడు. యుద్ధమున మృతినొందిన వీరు డశోచ్యుడు. జలబుద్బుదోపమదేహధారు లొకరికొకరు దుఃఖింపతగదు. రేపు మనగతియు నిట్టిదియె' యని యోదార్చె నంత విభీషణుడు శాంతి నొందెను. రామభూవిభుడు 'విభీషణ ! ఈ మహావీరునకు యథాశాస్త్రముగ సంస్కారముల జరుపుము. ఈ స్త్రీల నంతఃపురమునకు బంపు' మనియె. విభీషణుడు రామభద్రుడా ! ఇతడు నాకు భ్రాతయైనను త్యక్తధర్మవ్రతుడు, నృశంసుడు, పరదారాభిగామ్ముడు, సంస్కారార్హుడు కాడనియె. రామభూపాలు డితడెట్టివాడైనను నీవు మత్ప్రియము చేయక తప్పదు. నీవలన నేను జయమును పొందితిని. ఇత డధర్మచరుడైనను తేజోవంతుడు, బలవంతు డింద్రాదుల జయించినవాడు. మహాత్ముడు, బుద్ధిమంతుడు, వేదవేదాంతవేత్త. ఇతనికి నీవు భక్తి శ్రద్ధలతో సంస్కారముల నాచరించవలెను.

కం. మరణముతోడన వైరము
పరిసమాప్తమై పోవుసుమ్ము పరమార్థజ్ఞా !
పరిపూర్ణమయ్యె కార్యము
విరచింపుము యితని కిపుడు విహితక్రియలన్.

క. విధివిహితములైన కర్మల
విధిగా నిపు డాచరించి విశ్వాసముతో
బుధరాజి మెచ్చ కీర్తిని
ప్రథితోత్తమ ! విక్రమాఢ్య ! బడయుము వేగన్

వ. విభీషణుడు రామవాక్యములకు బద్ధుడై యంతఃపురాంగనల బంపి రావణునికి ఔర్ధ్వదైహికక్రియల యథాశాస్త్రముగ యథాన్యాయముగ నాచరించి యాశౌచాంతమున రామసన్నిధి కేతెంచెను. రామనృపాలుడు

లక్ష్మణుని గనుగొని నీవు విభీషణునితోడ లంకాపురప్రవేశ మొనర్చి యథాన్యాయముగ లంకారాజ్యమునకు రావణసింహాసనమున విభీషణునికి పట్టాభిషేక మొనర్పుమనియె. రామాజ్ఞను లక్ష్మణుడు విభీషణుని లంకా రాజ్యమునకు పట్టాభిషిక్తు నొనర్చి రామసన్నిధి కేతెంచెను. రామనర పతి హనుమంతుడనగు నన్నవలోకించి, వాయుపుత్ర! నీవు సీతకడకేగి నా విజయవార్తను తెలుపుమని యాజ్ఞాపించెను.

సీ. రామాజ్ఞగైకొని రఘురామపత్నిని సీతామహాదేవి జేరినేను
వినయావనతుడనైవిజయంబుదెలిపితి వినియామెసంతోషవివశయయ్యె
ప్రియవార్త దెలిపిన ప్రీతిపాత్రునకేమి సత్కృతిజేయగజాలనైతి
మరువను నిన్నెప్డు మననుసనుంచెద మహితుడవైనీవు మసలగలవు

గీ. కష్టసుఖములు కావటి కడవలట్లు
దేహధారికి జోడుగ దేజరిల్లు
వృత్తమొక్కటి విపరీత వృత్తిజనక
సమత నుండుట సాత్విక సమ్మతంబు

క. ఆనాటి కష్టమంతయు
నీనాటికిబోయె నీదు హితవచనంబుల్
యేనాడు దలచుచుండెద
భూనాథుని జూడజేసి పుణ్యముగనుమా.

క. తెచ్చెద రాముని నంటివి
పొచ్చెము లేకుండ తెచ్చి ప్రోచితి విటులన్
మెచ్చితిని నీదు భక్తికి
హెచ్చగు దయగూర్చి నిన్ను హితయుతుజేతున్

వ. నీవు మిగుల కష్టపడి నామేలు నాకాంక్షించి చేయశక్యము గాని పనులను జేసి నా భర్తకు విజయమును గూర్చితివి. నీవు చేసిన యీ యుపకార మనన్యసాధ్యము. నిన్ను నేనెన్నడును మఱువను. నాదుఃఖమును పోగొట్టి నాకానందమును కలిగించితివి. నాకుప్రియవార్తను దెలిపితివి, నన్నాదరించితివి. కష్టకాలమున కాపాడితివి. ఇపుడు రాము

దర్శనము గలిగించి నన్ను రక్షింపుము. నీవు సర్వసమర్థుడ వనియె నపుడు సీతామహాదేవిని మిగుల ప్రార్థించి యమ్మా పూర్వమున నే నిక్కడకు వచ్చినపుడు యీ రాక్షసస్త్రీలు నిన్ను పలికిన క్రూరవాక్యములు నామనమున ములుకులవలె నున్నవి. అవి నన్ను మిగుల బాధించుచున్నవి.

కం. అమ్మా! నామనవిని విని
యిమ్మా నాకొక్కవరము హితతమబుద్ధిన్
అమ్మరో రాక్షసవనితల
ముమ్మాటికి గూల్చువాడ మూర్ఖుల తల్లీ!

వ. అని ప్రార్థించు హనుమంతు నీక్షించి సీతామహాదేవి నవ్వి నాయనా! హనుమంత! నీవెంత వెఱ్ఱివాడవు. వీరలజంపినమన కేమిలాభము కలుగును? అపరాధులైనను స్త్రీల జంపుట పాపము. పైగా వీరలు నిరపరాధలు. రాజాశ్రయులు రాజాజ్ఞ నొనర్చిన చెడుగుల ఫలములు రాజులవియేగాని కర్తల నంటవు. దాసీజనముపై నీవంటి మహావీరు డాగ్రహించకూడదు.

సీ. చెప్పశక్యముగాని చేతనవర్గంబు పూర్వపుణ్యార్జిత పుణ్యపాప
రూపనిబద్ధమై రూఢిగ దిఱుగును పరులు మిత్రులు జేయుపనులులేవు
కాలంబు చెడుగైన కలుగునుబాధలు మంచికాలంబైన మంచికలుగు
నాభాగ్యహీనత ననువీరుబాధింప నాగ్రహింపగ నేలనయ్య చెపుమ.

గీ. తప్పుచేయనివారలు ధరణి గలరె?
పాపులైనను శుభులైన పవనపుత్ర!
వధ్యులైనను కరుణించవలయునుమ్మ
నిరపరాధులు వీరలు నిజముగాను.

వ. అని పలుకు సీతావాక్యముల విని హనుమంతుడీ మహాదేవి కరుణానిధి. ఈమె యోగ్యత మిగుల సంతోషమును గలిగించుచున్నది. ఈమె స్వభావము రాముని స్వభావము నొకటియె. రాముడు రావణుని తమ్మునక భయమిచ్చెను. ఈమె సాపరాధలగు నీస్త్రీల కభయమిచ్చి

సది. వీరిదాంపత్యము శ్రీశ్రియఃపతుల దాంపత్యమువంటిది. జనకరాజపుత్రి రామసందర్శనమును కోరెను. కనుక నీమె కోరికను రామునికి తెలిపెదనని తలచి పోయి సీతాకాంక్షితమును రామున కెఱింగించితిని. శ్రీరామచంద్రుడు విభీషణునిగని సీతను నా సన్నిధికి గొని తెమ్మనియె. సీతామహాదేవి యస్నాతయై రాముని గనదలచెను. శ్రీరామచంద్రుడు సీత సుస్నాతయై యలంకృతయై తనసన్నిధికే తేరవలెనని తలచెను. జనకరాజపుత్రి శిరస్నాతయై సాలంకృతయై యందలంబెక్కి యంగరక్షకులిరుపార్శ్వంబుల పిచ్చుకత్తులతో నడచుచుండ విచ్చేయుచుండె. గగనచారులకైన జూచుట కశక్యంబైయుండె. వానరులు తమ తల్లియగు సీతాదేవి గనుగొనుట కతికుతూహలులై యందలంబుచుట్టును మూగిరి. గొప్పకోలాహల ముదయించినది. వేత్రపాణులు వేత్రంబులతో వానరులను కొట్టుచుండిరి. బరాబర్లు చేయుచుండిరి. ఆధ్వనిని రామచంద్రుడు విని విభీషణుని గర్హించి సీతపాదచారిణియై తనసన్నిధికి రానాజ్ఞాపించెను. సీత యందలమును దిగి కృశగాత్రియగుట గాలికి కదలు వగడాకువలె చలించుచు నడుగులు తడబడుచుండ వచ్చుచుండెను. రామనరపాలుడు విభీషణుని గనుగొని 'మిత్రమా! వినుము.

సీ. మానముగాపాడమగువలకెప్పుడు ప్రాకారవస్త్రాదిపరికరములు
రాజనియమములును రాజితగృహములు వసికిరావెప్పుడు భవ్యభరిత
పరమపావనమౌచు బఱగువృత్తి యొకటె విబుధవినుతమౌచు
వెలయుసుమ్ము
కష్టదశలయందు కళ్యాణములయందు క్రతువులయందున గనగవచ్చు

గీ. ధర్మబద్ధలు గావున తరుణులపుడు
దర్శనంబున దూష్యలై జనరబోరు
గనగజెల్లదు తదితరకాలమందు
గగన చారులకైనను కార్యవిదుడ!

కం. ఈవనిత సమరగతయై
భానాతిగ కష్టదశల బడియుండుటచే

భావింపు చూడదగునని
యేవనితయు పతిసన్నిధి నెపుడును గననౌ.

కం. అన వినియె నాతడప్పుడు
ఘనవినయముతోడగూడి కాంతామణియున్
గనుగొన వానరులందరు
జననాథునికడకు నడచి జానకి చేరెన్.

కం. కనుగొనె రాముడు సీతను
దినకరకరలులితలతను దీనాననునున్
మనమున శోకము గలిగెను
తనకాంతను కమలనయన తద్దయుగనుటన్.

గీ. విస్మయంబును హర్షము విపులమైత్రి
యొకటికంటెను యొక్కటి యొక్కసారి
హెచ్చుచుండగ నాథుని హేమగాత్రి
కనుల గనలేక కంపితగాత్రి యయ్యె.

వ. అప్పుడు జనకమహారాజ పుత్రిక తనమనంబునెట్లనో చిక్కబట్టుకొని వందనమును చెల్లించి తనచీరచెంగున వదనమును గప్పుకొని కనుదమ్ముల బాష్పంబు లొలుకుచుండ గద్గదస్వరయై 'యార్యపుత్రా!' యని మాఱుమాటాడలేక కురరివలెఘనరోదన మొనర్చె. అటనున్న మేమందరమును శోకార్ణవమగ్నోన్మగ్నులమైతిమి. అంత కొన్ని క్షణంబులకు శోకభార మించుక తగ్గగనె పుండరీకదళ సదృక్షంబులగు రామచంద్రునినయనంబు లరుణాభదళంబుల బోలియుండుటనువదనంబున కోపచిహ్నా లగుపించుటను గనుగొని చూపరుల శోకరసము నిశ్శేషముగ నింకిపోయి భయవిస్మయంబులు హృదయకుహరంబున వెల్లివిఱిసె నంత రామభూవిభుడు కనుగొనల సీత నీక్షించి.

క. కులజాతుడైన పురుషుడు
ఖలగృహమున చిరము నిలచు కాంతను ప్రియగా

విలసితకాముక వృత్తిని
కలియగ దానిచ్చగించగలుగునె చెపుమా.

క. కలిగిన యవమానంబును
విలయమునొందించినాడ వీరత్వమునన్
ఖలరిపులను ఖండించితి
వలసినయెడ వేగ నీవు వర్తింపుమికన్.

వ. నీవు రావణాంకపరిభ్రష్టవు, దుష్టచక్షుర్నిరీక్షితవు, సత్కులసంజనితుండవగు నాకెట్లు పత్నివిగా దనరగలవు? దివ్యరూపవు, చిరకాలదుష్టగృహవాసవునైన నిన్ను చపలుడగు రావణుడు సహించియుండెననుట విశ్వాసపాత్రము కాదనియె. సీత రామవియోగానల దందహ్యమానశరీరయై రాముని తీక్ష్ణావలోకనంబుల నీక్షించి సర్వజనులు శోకసంతప్తులై విస్మయాక్రాంతమనస్కులై వినుచుండ 'నార్యపుత్రా! ఇది యేమి యన్యాయము! ఇట్టి పలుచని మాటలు భాస్కరకులజనితుల నోట లోకమెపుడేని వినియున్నదియా? నేను జనకుని పుత్రికనుకానా? నాది క్షత్రియకులముకాదా? రామపత్నినికానా? నీకేల యిట్టితలంపు కలుగవలె? క్షుద్రజనులాడు నుడుల నీవెట్లు నేర్చితివి? ఇట్టి హృదయవిదారణ వాక్యంబుల బలుకుటకు గతంబెద్ది? ఆచారప్రధానజనకరాజకులసంజాత యిట్టిదనుకొంటివా? పదిరెండు వత్సరములు నాతోడ నిలచిన నీవు నేనెట్టిదాననో కనిపెట్టనేరవైతివి. రావణుడు నన్నంటె నంటివి. అందు నాయపరాధ మేమున్నది? రక్షకహీననై పరునిపాలబడితిని. మూర్ఛమునిగితిని. నన్నతడు గొనితెచ్చెను. నేనేమి చేయగలను? నన్నతడు స్పృశించెనంటివి. అది నా కామకారితకాదు. అందు దైవమపరాధి. దైవాధీన కార్యంబుల దప్పింప నే నెంతటిదానను? మదధీనమైన హృదయము భవద్విముఖమై యెన్నడును లేదు. నన్నిట్లు జీవితసంశయమున నుంచ దలచిన నీవేల యింత శ్రమపడితివి? ఇదియంతయు వ్యర్థపరిశ్రమము. నీ సుహృజ్జనులకష్టములు నిరర్థకములు. క్రోధవశుడవై నీవు లఘుజనునివలె వర్తించుచుంటివి. క్రోధ మెంతపనినైనను చేయించగలదుగదా! ఇది

నీకును నీకులమునకును తగదు. నా భక్తియు నా తపమును నాశీలమును నాజన్మస్థలమును నీచేసవమానితములైనవి. సీతయన నీతలంపున నీచవనిత యని తోఁచినది. కానిమ్ము, గడచినదానికి వగచిన నేమిఫలము? ఇపుడు ప్రత్యయవిశేషమున నిన్నును లోకులను మెప్పించి నా పాతివ్రత్యమహిమను చూపించెదను. మహాత్ములారా! నాపాతివ్రత్యమహిమను గనుగొనుడు. నాయనా! సౌమిత్రీ! చితిని బేర్పించుము. అగ్నినిడుము. నన్ను ధన్యురాల నొనర్పుము. ఈ నిందార్ణవమునుండి నన్ను గట్టెక్కింపుము. సత్వరముగ లెమ్ము. జాగొనర్పకుము. నేను దుఃఖావేశమున నలనాడు నిన్ను కాకులాడితిని. ఆపరుషవాక్యముల మఱువుము' అను సీతావాక్యములవిని యన్నముఖము నవలోకించి యింగితజ్ఞానశ్చకోసలాః యనునట్లు యాకారసూచితాశయమును తెలసి చితిని సంసిద్ధమొనరించెను. వానరపుంగవులు నేనును జాంబవంతాదులు విభీషణుడును దుఃఖపరవశులమైతిమి. అంత సీత హవ్యవాహనునికి ముమ్మారుప్రదక్షిణమొనర్చి నమస్కారము లాచరించి ధీరుడగు రామవిభునకు ప్రదక్షిణ నమస్కారములొనర్చి యగ్నిభట్టారకున కభిముఖయై యిట్లనియె.

సీ. పావక! వినవయ్య పలికెదసత్యంబు సర్వసాక్షివినీవు సవితయట్ల
సకలజన్మంబుల సకలదశలయందు సర్వకాలమునందు సర్వవిధుల
రామునితలచుచు రాముని గనుచును రామునిగొలుచుచురామనామ
మెప్పుడుపలుకుచు నెవనినిదలచక నివసించియుండుట నిజమయేని

గీ. తల్లి తండ్రియు గురుడును దైవతంబు
సర్వధనములు సద్వస్తు సముదయంబు
రామమయమని మనమున రమ్యముగను
దలచియుండుట నిజమేని దహన! కావు.

కం. మనసున వాక్కున కర్మను
గనగా నధికుండు నాకు గనపడడెవడున్
మనసున వాక్కున కర్మను
ఘనుడొక రాముండె నాకు గనపడుచుండున్.

కం. మనమున రామునికంటెను
ఘనుడని నే నెవనినేని కాంక్షించినచో
నను నీజ్వాలల గాల్పుము
ఘన దహనుడ నీవుగాన కరుణించకుమీ.

క. రాముడె నా సర్వస్వము
రాముడు నాకధిపు డెపుడు రాముని దలతున్
కామము ధర్మార్థంబులు
రామునితో కూడియుండు రాజద్గతితోన్.

సీ. జ్వలనుడ నీకెట్లు స్వాహామహాదేవి శచి శత్రుదమనుడౌ శక్రునకును
నలునకుదమయంతి నారాయణునకును మంగళదేవత మహితసుగుణ
సత్యవంతునకెట్లుసావిత్రి సవితకు ఛాయామహాదేవి చంద్రునకును
చంద్రిక పార్వతిశర్వున కజునకు వాణియు ప్రియతమ వనితలెట్లు

గీ. రాఘవున కేను విడువని రమణినైతి
దేహ మెప్పుడైన భేదమై తేజరిలిన
నాత్మ రామున కన్యమై యలరబోదు
దహన! దేహము దహియింపు తప్పుయున్న.

క. మఱచితివో మా తల్లిని
మఱచితి నాతండ్రి నేను మఱచితి మిథిలన్
మఱచితి మా చెల్లెండ్రను
మఱువనునూ రాము నెపుడు మనమున దహనా!

క. అపరాధ లేశమున్నను
విపరీతము లేదు నన్ను వే గాల్పుమయా
అపరాధము లేకుండిన
విపరీతము లేక శశిని వే బోలుమయా.

క. ఎఱుగవె నీవును చంద్రుడు
నెఱుగడె శక్రుండు రవియు నెఱుగరె దివిజుల్

పరికింపలేడె శర్వుడు
మఱిపింపగ వశమె నాకు మరతురె మీరల్.

వ. ధనంజయ ! నామాటలగల సత్యాసత్యంబుల బరికింపుము. రామవియోగానలదందహ్యమాన సర్వావయవనైన నన్ను నాదృష్టియు చిత్తంబును నొకనిముషమైనను రాముని విడిచి యుండిన నరులవృత్తముల నఱయ నియమితులైన సాక్షులెవరేని నావృత్తమునందు కళంకము కలదని పలికినను నీవెఱిగియున్నను కనికరింపక తద్దోషపరిహారార్థము ప్రాయశ్చిత్తముగ నీమహాజన సమక్షమున నాదేహము భస్మసాత్కృతము నొనర్పుము. నాచిత్తము సర్వదా రామానన్యముగనున్న నీయగ్ని జ్వాలలు నాకు చంద్రకిరణాయమానములగుగాక ! రాముడు విశ్వసించునటులను యీవీరులందరు నమ్మునటులను నాకతను నీవు స్వయముగ తెలుపుమని పలికి రామ రఘురామ రాఘవ రాజీవలోచన! ఇవియె భవత్పాదార విందములకు వందన శతములు. ఏ జన్మమునందును నిను విడిచి నా యాత్మ యుండకుండ నన్ననుగ్రహింపుము. అన్నా ! లక్ష్మణ! పుత్రభాండ ! నేను నిన్నాడినమాటల ఫలమనుభవించుచుంటిని. సుగ్రీవ ! రామసఖ ! నీకష్టమంతయు వ్యర్థమైనది. హనుమంత ! పుత్రకల్ప ! నీ యుపకారమునకు ప్రత్యుపకార మొనర్పలేకపోతిని. ఓ వానరులారా! నాయందు లేశము తప్పులేదని నమ్ముడు. రామ ! రాజీవలోచన! జనకజామాత ! కౌసల్యానంద వర్ధన ! సెలవు. ముమ్మాటికి సెలవు. కరుణయుంచు'మని చివ్వున నెగిరి యగ్ని మధ్యంబున వ్రాలెను. లక్ష్మణు డాగ్రహావేశమున రాముని నిందించెను. యుచ్చైస్వరమున దుఃఖించెను. మహావీరులందరు శోకార్ణవమున మునిగిరి. రాఘవరాముడు తలవంచి కనుల బాష్పంబులు కాలువగట్టునటుల శోకించె నంత నగ్నిభట్టారకుడు పీతాంబరమును ధరించి యగ్నిమధ్యమున దివ్యపీఠాసీనుడై మహాపురుష రూపమున దివ్యాంబరధారియు దివ్యాలంకారభూషితయు మహాపతివ్రత యునగు సీత తన యంకమునప్రకాశించుచుండ రాము నీక్షించి 'యోజనకజాప్రాణనాయక! దశరథ రాజపుత్ర! శరణాగత త్రాణపరాయణ ! రామచంద్ర ! కాకుత్స్థకులతిలక !

సీ. ఇదియేమి రాఘవ! యెఱుగవె సీతను పరమపతివ్రత భాసమాన
నేనును వాయువు నెప్పుడు బరికించి చూచితి మిసుమంతమాడులేదు
సర్వేంద్రియమ్ములు సతతమునీయందె సక్తములైయుండె సార్వభౌమ!
పరిశుద్ధచారిత్రపరమపావనశీల భర్తృపరాయణ పరమసాధ్వి!

గీ. గాన గైకొని యేలుము కాశ్యపీంద్ర!
కరుణ విడనాడ దగ దయ్య కమలనాభ!
తగునె నీకిది ధర్మంబె ధర్మనిరత!
మామకాజ్ఞను గైకొమ్ము మహిజ నిపుడె.

సీ. జానకిశపియింపజచ్చును దైత్యుడు తపమువ్యర్థముచేయుతలపులేదు
భర్త్రాజ్ఞ లేకుండ పడతికిస్వాతంత్ర్యమొక్కడిదనియెంచె నింగితజ్ఞ
నీచేత దైత్యుడు నిహతుడైనను కీర్తిగలుగునంచెంచెను కాలమహిమ
కష్టములెన్నియొగలిగెను మిక్కిలి మనసుననిన్నెప్డు మరువలేదు

గీ. సీత నిప్పుడె గైకొని శీఘ్రముగను
చేరవలయును నీయూరు చిత్రచరిత!
సీత తపమున నిష్ఠను శ్రీసమాన
గాన నాతల్లి గైకొను కమలనయన!

క. అనవిని రాముడు మనమున
ఘనమగు హర్షంబునొంది గైకొనసీతన్
మనమున మెచ్చుచు తలచెను
ఘనపాతివ్రత్యమహిమ గలిగినదౌటన్.

వ. అగ్నిభట్టారకుడు తన జ్వాలలమధ్యమునుండి యందిచ్చిన మునివ్రేళ్లు భూమిపై మోపి బాహువులు సాచి దివ్యవసనయు దివ్యాలంకారభూషితయు నగు సీత నందుకొని తనచెంత నివసింపజేసి రాముడు తనూనపాదునకు వందనం బిడి వినయంబున నిట్లనియె.

సీ. పావకవినవయ్య పావనిభూమిజ యనినేనుదెలిసియు నఖిలజనులు
దనుజునిగృహమునసతతవుండుటనుజూచి శంకింతురనియిట్లుసలిపినాను

పరిశుద్ధచరితయై బఱగెనుగావున నిందింపరెవ్వరు నిర్జరేశ!
కలుషము లేదనికాంతను గైకొంటి క్రతువులనినుగొల్తుక్రమముగాను

గీ. తనువు శాశ్వత మనరాదు తగినవృత్తి
యొకటి నరునకు శుద్ధమై యొనరవలెను
రఘుదిలీపాదులెల్లను రాజ్యమేలి
నిత్యసత్కీర్తికాయులై నిలచినారు.

వ. అనురామవాక్యంబులవిని యగ్నిభట్టారకుండు 'రామచంద్రా! నీవు మనుజుడవుకావు. నీచరిత మాకల్పము త్రిభువనంబుల విఖ్యాత మగును. భవత్కృతదశవదనహనన సంతుష్టహృదయులగు సకలదేవతలు నింగి నినుగాంచ నిలచియున్నవారు. వారల గనుగొనుము. ప్రాఙ్ముఖుడై జటాజూటమును ధరించియున్నవాడు శూలహస్తుడు. స్ఫటికమణిసమ గాత్రుడు శంకరుడు. కనక ప్రభాభాసమానుడు పద్మజుడు. తక్కినవారు పాకశాసన ధనంజయ ధర్మరాజ వరుణ వాయు కుబేరాదులు. తక్కిన వారు దేవతలు, వారు దివ్యర్షులు, వీరు బ్రహ్మర్షు, లాకడనున్నవారు రాజర్షులు. వీరందరిని సమ్మానింపు'మనిన విని విస్మితుడై తానును సీతయు లక్ష్మణుడును వారల యథోచిత వందనాది సత్కారముల పూజించిరి. అవుడు రామవిభుడు 'మహాత్ములారా! మనుష్యసామాన్యుడనగు నన్ను మన్నించి మీరందరు దర్శనమిచ్చుట నాభాగ్యవిశేషము. నేను ధన్యుడను, నాపితరులు కృతార్థులు. ఇది నాసుకృతవిశేషమో, నాపూర్వుల తపఃప్రభావమో నేనెఱుగను. భవదీయ నిర్వాచ్య నిర్హేతుక కరుణాసాగర మెట్లు పొంగి పొఱలినదో తెలియజాలకుంటిని' అను రఘురాము నీక్షించి దేవతలందరును 'నీవు పరవాసుడ వాద్యంతరహితుడ వఖిల భూతాంతరాళసంచారుడ వప్రమేయుడ వఖిలజగత్కర్త వఖిలలోకారాధ్యుడ వఖిలలోకభర్తవు. జ్ఞానవిజ్ఞాననిలయుడవు. నీవు మాయామానుషరూపధారివగుట నిన్ను నీవెఱుంగవు. నీవు సర్వతంత్రస్వతంత్రుడవు. సర్వనియంతవు. సర్వేశ్వరుడవు. సర్వద్రష్టవు. నిత్యుడవు. నాధారుణుడ వజుడవు. సర్వశబ్దవాచ్యుడవు' అని నుతించు దేవతల వాక్య

ముల విని రామభగవానుడు 'మహాత్ములగు నో దేవతలారా! మహాత్ములారా! నేను మీరనినంతవాడను గాను. రాముడనువాడను. దశరథపుత్రుడను, మానవమాత్రుడననియె. ధాత శ్రీరాము నవలోకించి 'మహానుభావ! నేను నీపుత్రుడనగు చతుర్ముఖుడను. ఇతడు నాపుత్రుడు రుద్రుడు. నీకు పౌత్రుడు. నేను సత్యమును పలుకుచుంటిని. వినుము. నీవు సర్వారాధ్యుడవగు నారాయణుడవు, చక్రాయుధుడవు, పరబ్రహ్మాభిధానుడవు, పరమపదవాసుడవు, ముక్తనిత్య సామ్యానందప్రదుడవు, సహస్రశీర్షుడవు, సహస్రాక్షుడవు, సహస్రపాదుడవు. సీత శ్రీమహాదేవి, శ్రియఃపతివీవు. దేవప్రార్థితుడవై రావణవధార్థ మవతరించినవాడవు. భవద్భక్తులు యావచ్ఛరీరరహిత పర్యంతము సకలసద్భోగభాజనులై తుదకు పరమపదమున నిత్యముక్త సామ్యతను పొందుదురనియె. శంకరుడు రాముణాలోకించి,

గీ. పుష్కరాక్ష మహాభుజ పూజ్యపాద
శ్రీనివాస దయాకర చిత్రచరిత
భాగ్యవశమున రాక్షస భయము బాపి
కాచినాడవు లోకుల కరుణతోడ.

క. భరతుని నాశ్వాసించుము
పరమాదర మొప్ప తల్లిపదముల గనుమా
వరరాజ్యము గైకొను మిక
పరిచితులకు భాగ్యమిచ్చి పాలించుమయా.

క. సుతులను బడయుము వేగమ
మతిమంతులు మంత్రివరులు మంచిగ గొలువన్
శ్రితజనుల గాచుచుండుము
సతతము సద్విప్రవరుల సాకుము కరుణన్.

వ. రామచంద్ర! సద్గుణసాంద్ర! ఈ మహోన్నత విమానమున వసించినవాడు భవజ్జనకుడగు దశరథుడు. భవజ్జయమును విని భవదాలోకనాపేక్ష వచ్చినవాడు.

క. కనుమీా జనకుని వేగమ
ఘనుడీతడు దశరథుండు గడువేగముగన్
మనమున నినుదలచు నెపుడు
ఘనముగ బూజింపవయ్య కమలదళాక్షా!

క. మనుజానకు గురుడు పూజ్యుడు
ఘనజనకుడు గురునికంటె ఘనుడగుసుమ్మా
మనమున దలచుము దీనిని
గనవిక నీవితని నెపుడు గనుగొను మిపుడే.

వ. అను శంకరు వాక్యంబులవిని రామభద్రుడు సీతాలక్ష్మణ యుక్తుడై దశరథభూమిపాలునకు వందనము లాచరించి సవినయముగ పూజించిన దశరథభూమిపాలుడు పుత్రులను సీతను గనుగొని యాలింగన మొనర్చి 'నాయన! రామచంద్ర! నేను స్వర్గసుఖ మనుభవించుచున్నను నిన్ను విడనాడుటవలన సుఖము సుఖముగా గనిపించుటలేదు. నీవు నిస్తీర్ణవనవాసుడవు. నిను గాంచిన నాకు సంతోషము మిక్కిలి గలుగుచున్నది. నీవు పుత్రుడవైన కారణమున నేను నాపితరులు తరించితిమి. కౌసల్య కానందమును గూర్పుము. భరతుని వేగగనుగొనుము. రాజ్యమును గైకొని భరతుని సంతసింపజేయుము. సుమిత్రానందవర్ధన! లక్ష్మణ! రాముడుపరమపదవాసుడగునారాయణుడుసుమీ!సీతకమల. ఈదంపతుల కైంకర్యమును సర్వదా చేయుచుండుము. శతానందాదుల వాక్యముల వింటివికదా! సంశయింపక సంశ్రయింపుము. కైంకర్యనిష్ఠనిన్నెపుడ విడువకుండుగాక!అమ్మా!సీతామహాదేవి! నీచరిత్రము లోకములకెక్కినది. నీవు ధన్యురాలవు. మీాదాంపత్యము లోకకళ్యాణకరము' అనియె. రాముడు మహారాజా! నీవు కైకను నీపుత్రునితోకూడ నిన్ను పరిత్యజించితినంటివి. అది శాపముకాకుండుగాక! భరతు ననుగ్రహింపుము. దశరథుడందుల కంగీకరించెను. దేవేంద్రుడు రామనరపాలు గనుగొని నీవు కోరినవర మిచ్చెదనని యె. రామభద్రుడు మృతులైన వానరులందరు నిర్వ్రణులై సుఖముగ లేతురుగాక యనియె వానరులందరు సుఖసుప్తులవలె లేచి

రామునికి వందనములిడిరి. మేమందరమును మాకు పరవాసు దేవుని సేవ లభించినందులకు పరమానందము నొందితిమి. దేవతలందరు స్వస్థానములకేగిరి. రామాజ్ఞను లక్ష్మణుడు విభీషణుని రావణసింహాసనమం దధిష్ఠింపజేసెను. విభీషణుడు,

సీ. సుగ్రీవు గనుగొని సుష్టుగ యోచించి రావణుతమ్ముడు రాముజేరి
వినయావనమ్రుడై వినుచుండమిత్రులు కరుణించి స్నానంబుగాంచవలయు
జడలను విప్పంగ చతురులుగలరిందు శ్మశ్రువర్ధనులును చతురమతులు
ననవిని హర్షించి యవనీశుడప్పుడు మెచ్చితి భక్తికి మేలుమేలు.

గీ. భరతు డక్కడ బహుకష్ట భరితుడగుట
నర్హ మెట్టుల నభిషేక మాచరింప?
ననుచునున్నవి పదునాల్గుసమము లిపుడె
చేరదలచితి పురమును చిత్తమందు.

కం. పదునాల్గుసమము లరిగిన
పదపడి పగటింట నేను భరతుని గనగా
నదునేమొ యనెదొ వినుమిక
విదితాత్ము డతండు వహ్ని వేబడునుమిత్రా.

గీ. అతని విడనాడి క్షణమైన నవనినుండ
జాలనని నమ్ము సుగ్రీవ! జాగులేక
పయనమగునట్టి పద్ధతి బలుకుమనిన
బలికె యుపాయములో జేర్చ భరతుననుచు.

వ. పలికి సుగ్రీవుడు,

సీ. పుష్పకమనునొక పుణ్యవిమానంబు గలదందునెక్కి కదలిపోవ
యభిలషితంబైన నర్హ కాలంబున నింపుగ నినుజేర్చు నిష్టపురికి
వానర దైత్యులు వరుసగ నీతోడ సాకేతమునుజూడ సంతసమున
భరతుని శత్రుఘ్ను భవ్యులగురువుల గనుగొనకోటను కనులకోడ.

గీ. గోరుచుండిరి కరుణించి కొనుచు బొమ్ము
నేను మంత్రులు మిత్రులు నిన్నుగూడి
పయనమగునట్టి పద్ధతి బలుకు మనిన
సరియె యని పల్కె రాముడు సరసముగను.

గీ. భరతు గనుగొనగలమట భద్రగుణుని
చిన్నతమ్ముని గందుము శీలవినుతు
తల్లులనుగాంచ మదిలోన దలచినాము
కనుల పట్టాభిషేకంబు గాంచగలము.

సీ. సకలవాంఛలకంటెసరసాధికంబగునభిలాషయిదియయ్యయార్యవినుత
మనమతి సంతోషమాన్యమైనదిగాన జనుదెంచుచున్నాము జానకీశ
యని పల్కె లంకేశు డప్పుడు వానరసత్కారవితతిని జాలజేసె
పుష్పకమే తెంచె పూజ్యుడురాముడు లక్ష్మణసీతలు లలితముగను

గీ. వానరేంద్రుడు దనుజులు వరుసగాను
సకలవానరవీరులు సంతసముగ
పుష్పకారూఢులైయుండ పుష్పకంబు
గగనవీథిని బఱచెను గనిరి జనులు.

వ. అప్పుడు

సీ. సీతాధినాథుడు సీతనుగనుగొని రాక్షసవీరులు రణమునందు
యెవరెవరెచ్చట నెవరిచే జచ్చిరో యదియంత జెప్పుచు నబ్ధిజేర
సాగరుడిచ్చట సాక్షాత్కరించెను సేతువుగట్టగ జెప్పెనిచట
ఇదిఋశ్యమూకాద్రియిదియెకిష్కింధయునుగ్రీవుపురమిదిజూడుమబల

గీ. యనగ నారాము కనుగొని యనియె సీత
వానరాంగనలనుగూడి వరపురంబు
జేరదలచితి కరుణించి చిత్తమలర
పిలువబంపించి వేగమ ప్రియము గూర్పు.

వ. అనవిని రామచంద్రుడు 'విమానమ! కిష్కింధాపురసమీపమున భూమిపై నాగు'మనియె.

క. రామాజ్ఞ నిలచె పుష్పక
మా మానిను లందరప్పు డతివేగముగా
రామాజ్ఞ పుష్పకంబున
శ్రీమానితులగుచు జేరి చెలగిరి మిగులన్.

వ. వానరాంగనలందరు రామసుగ్రీవుల యాజ్ఞను పుష్పక మధిరోహించిన తోడనే.

సీ. గగనవీధికి నేగి గమనించె పుష్పక మధిపుడపుడు సీతకనియెనిటుల
నిచ్చటహనుమంతుడింపుగ మాట్లాడెయలజటాయువిచటనలసిపడియె
గోదావరీనది గొబ్బునగనుగొను పర్ణశాలయదియె పడతి! గనుము
చిత్రకూటాద్రిని చేరితిమిదెగను భరతుడుమననిట బఱిగగనియె

గీ. నతని గనుగొన గోరిక లతిశయించె
నతడు జడలను నారల నలరగట్టి
యవని బండుచు కష్టంబు లందుచుండె
సకల కళ్యాణగుణగణ సంయుతుండు.

వ. అనునప్పటికి భరద్వాజాశ్రమము సన్నిహితమయ్యెను. రామనరపాలుడా పూజ్యపాదసేవచేయుట యుచితమనియెంచి పుష్పకమునాగనాజ్ఞయిడియె, పుష్పకమాగెను. రామభూపాలుడు సీతయు లక్ష్మణుడును పుష్పకమునుండి దిగి భరద్వాజసన్నిధికేగి పందనము లాచరించిరి. భరద్వాజుడు వారి ముగ్గురను సత్కరించి 'రామచంద్రా! నీశుభాగమనమున కానందించితిని. మీవృత్తాంత మెప్పటికప్పుడు నేనఱియుచునే యుంటిని. సీతల్లులును నీ తమ్ములును తక్కంగల జనులందరును కుశలంబుగ నున్నవారు. భరతుడు జటావల్కలంబుల ధరించి నందిగ్రామమున నివసించి వన్యాహారమును దినంబున కొక్కసారి దినుచు భూమిం బండి భవత్పాదుకల నీమారుగ దలచుచు పరమనిష్ఠ నున్నవాడు. ఈ దినశేష మిచట నివసించి రేపుదయము పుష్యయోగమునభరతుం గను'మనిన రామనరపాలుడు 'మహాత్మా! భరతుడు పదునాలుగు వత్సరములు దాటినమరునాడు పగటికాలమున నీదర్శనము కాదేని నేనగ్నిబడెద ననియె గాన

నీదిన శేషమున భరతు గనవలె'ననియె. భరద్వాజుడు 'తగినవానిని బంపి భరద్వాజప్రార్థన నిచట నిలచితిననియు కల్యమున నినుగాంచెదననియు తెలియజేయుము. జన్మతారను పోవిడిచి సంపత్తార నయోధ్య ప్రవేశించుము. అదినీకు శ్రేయస్కరమనియె. రామభూపాలుడు భరద్వాజాజ్ఞకు బద్ధుడై నన్ను బిలిచి నీవు సత్వరముగజని నందిగ్రామమున భరతుగని నా శుభాగమనమును భరద్వాజాజ్ఞ యలంఘ్యమగుట నీరేయి భరద్వాజాశ్రమమున నిలచి కల్యమున రాగలనని చెప్పుము. సత్వరముగ బొమ్ము. మార్గమధ్యమున గుహుడనువానినిగని నాక్షేమాగమనమునువచియించి కల్యముననినుగనుగొనుసనివచింపుము. జాగుచేయకుము. సూర్యాస్తమయమైన ప్రమాదము వాటిల్లునుసుమా యని వచించెను. నేనెంత తొందరగ గుహునకు రామకుశలాగమనమును తెలిపి విచ్చేసినను నీవిట్టి సాహసమొనర్చుటకు సిద్ధముగనుంటివి. రామనరపాలు డిప్పటికి భరద్వాజాశ్రమమును విడిచియుండును. సూర్యోదయము సమీపించుచున్నది. అని పలికి భరతుడు హనుమంతు నవలోకించి మిగులస్తుతించి నమ్మి రామచంద్రాగమనమును ప్రతీక్షించుచుండె. అంత భరతుడు శత్రుఘ్నుగనుగొని యయోధ్యాపుర రాజవీధులను, సకల గృహంబులను, గోపురంబులను, దేవళంబులను సర్వప్రదేశములను మంగళ సంవిధానముల నొనర్పింపుమనిపలికెను. శత్రుఘ్నుడట్లొనర్చుటకు తగినవారి నియమించెను. సకలజనులును భరద్వాజాశ్రమమునుండి రాదగిన యాకాశమార్గంబున తమతమనేత్రంబుల బంధించి తదేకవీక్షాపరతంత్రులై యుండిరి. అంత నేదియో యొకయవ్యక్తధ్వని వినిపించె. క్రమముగ నేదియో యొకరూప మగుపించెను. తుదకది విమానాగమనమని శ్చయించబడినది.

౧. శబ్దంబుతోడనె చయ్యనపెనుగాలి విసరగ జాలెను విస్తరించి
కనులకునేదియొ గనిపించెముందుగ నవయవియునిదోచె నక్షులకును
నతివిశాలమగుచునలరారియద్భుతకాంచనరత్నాప్తికలిగెమెరయు
నుత్తమ పుష్పకమూర్ధ్వభాగంబున కనులకుగనిపించె క్రమముగను

గీ. జనులు తలలెత్తి చూచుచు సంతసమున
రామ రఘురామ శ్రీరామ రామయనుచు
కేలు మోడ్చుచు మిక్కిలి కేకవిడుచు
గగనమంతయు ప్రయ్యగ గంతులిడిరి.

గీ. అందు కొందరు వ్రేలితో నధికలీల
చూడుడంచును తలలెత్తి చూపుచుంట
చూచి హర్షించి రెందరో నూరిజనులు
వందనంబులు సలిపిరి వరుసగాను.

సీ. పుష్పకమప్పుడుపుణ్యావశంబున భరతునిసన్నిధిబడిగనిలచె
భరతుడుసంతోషభరితుడై రాముని పాదయుగము చెంతపాదుకలను
భద్రముగానుంచిపాదయుగంబున పడిలేవకున్నను బాహులతల
భవ్యుడురాముడుబట్టిలేవగదీసి గాఢంబుగాగను కౌగలించి

గీ. తమ్ముడ్కుమ్రడ! ఇదియేమి తనువు మిగుల
చిక్కియుండెను మునిరూపు జెందినావు
చిన్నతమ్ముడు మిక్కిలి చిక్కిపోయె
కాల మెటువంటి గతులను కలుగజేయు.

గీ. అనుచు శత్రుఘ్ను కౌగిట నలరజేసి
మ్రొక్క దీవించె భరతుడు మోదముననను
రామపదధూళి శిరమున రమ్యభక్తి
దాల్చి భవ్యతజెందెను ధన్యుడపుడు.

వ. అంత భరతుడు

గీ. లక్ష్మణుని గని కౌగిట లలితముగను
చేర్చి లాలించి సీతను జేరి మ్రొక్కి
సూర్యపుత్రుని సుగ్రీవు జూచికరము
భ్రాతృభావంబుతో బట్టె భద్రకరము.

వ. భరతుడు తనకరముతో సుగ్రీవుని కరము బట్టుకొని మన్నించి
విభీషణుని హస్తగ్రహణ మొనర్చి వానరయోధులను మాన్యులయగు

రామభగవానుని భద్రముగ దెచ్చి నాకనులకు జూపించి నన్ను రక్షించితిరి. మీ ఋణము నెన్నటికిని తీర్చుకొనజాలము. సుగ్రీవ! నీవు మాకు సోదరప్రాయుడవు. ఇదివరకు మేము నలుగురమే సోదరులము. ఇపుడు నీతో నైదుగురమైతిమి. నీవుచేసినమేలును మేమెన్నటికిని మరువబోము. విభీషణ! నీవు మాకు పరమోపకారివి. రామభగవానుడు నీవలననె నీభ్రాతయుత్రిలోకవిజయియు మహావీరుడగు రావణు సంహరించగల్గెను. నీ వలన మావంశము రక్షితమైనదనియె. అంత రామభూపాలుడు తల్లుల పాదంబులకు వందనంబులిడి యాశీస్సులబొందెను. వసిష్ఠు పాదంబులకు సాష్టాంగ నమస్కారముల నొనర్చి యాశీస్సుల నందుకొనియె. తక్కిన వారి నందరిని యథాయోగ్యంబుగ పూజించెను. సుమంత్రు నాలింగన మొనర్చెను. మంత్రుల మన్నించెను. విప్రులను మన్నించెను. బంధుల గౌరవించెను. లక్ష్మణుడును సీతయు యథాయోగ్యముగ వందనంబుల నర్పించిరి. అటనున్న వారందరు సంతోషార్ణవమున మునిగిరి.

సీ. శత్రుఘ్నుడప్పుడు సచ్ఛీలులక్ష్మణు పదములబడిమ్రొక్కె పరమభక్తి
సీతామహాదేవి శ్రీపాదములజేరి ప్రణమిల్లిమిత్రుల మైత్రినెఱపి
సీతయు కౌసల్యజేరి వేమ్రొక్కను కౌసల్యసీతను కౌగలించి
శ్రీదేవి మాయింటసీతయైపుట్టెనుమాపుణ్యవిభవంబుమహితమయ్యె

గీ. ననియె సీత సుమిత్రను హరిభక్తి
నతుల నొనరించి కైకేయి నవ్యనళిన
పదయుగంబుల గొలుచుచు భవ్యగురుని
పాదయుగ్మంబునకు మ్రొక్కె పరమసాధ్వి.

వ. అంత దశరథపత్నుల కందరికిని వందనార్హులగు విప్రముఖాదులకును సీతారామలక్ష్మణులు వందనము లర్పించి సీత తనచెల్లెండ్ర గనుగొని ప్రియంబులబలికె నపుడు భరతుడు శ్రీరామచంద్రు నవలోకించి.

మ. ఇది నీరాజ్యము నీకు నిచ్చితిని నీవేరీతి నాకిచ్చితో
ముదమొప్పంగను దీరెకష్టములు నామోహాంధకారంబు నీ

పదపద్మార్చన బోయె నా బ్రతుకు సంభావ్యంబు నీరాకచే
మదధీనంబగు దేహయాత్రయును సమ్మాన్యంబు నీదాటచే.

మ. పదిరె ప్లెక్కువ యయ్యె కోశము మహాభాగ్యోన్నతుల్ భూ ప్రజల్
కదనం బెచ్చటలేదు పాడియలరెం గణ్యంబు మద్భాగ్యమున్
మదిమెచ్చంగల వంటలంతటను సామాన్యంబుగా బండె నా
యెడ నిన్నిప్పుడు నమ్మికొల్చితిని నాయేపంత నీదాటచే.

సీ. అనవినిభరతునియమలవాక్యంబుల వినిమెచ్చిరాముడువేడ్కతోడ
భరతాశ్రమముజేరిపల్కెపుష్పకమీవుధనదాలయమునకుదడయకేగు
మననట్లనదియేగెనప్పుడుభరతుడు భక్తినిరామునిభవ్యు గాంచి
రాజ్యపాలనమునురక్తినిజేయుము రామరాజ్యమునవ్యాసక్తిగలిగ

గీ. తీరె నాతలభారంబు ధీరతిలక!
నీవు గైకొనవలయును నిశ్చయముగ
యెద్దు మోసెడి భారంబు నెటుల దూడ
మోయగలుగును చెప్పుము మోదమునను.

క. కరుణాసింధుడ వీవని
పరమేష్ఠిసుతుండు దెల్పె పటుతరబుద్ధిన్
కరుణావితు గావింపుము
మఱుమాటలు పలుకవలదు మహినేలుమికన్.

క. పురహరుడును పరమేష్ఠియు
పురుహూతుడుగూడ నీకు పురుడే యనుచున్
గురువరు డాడిన పలుకులు
గురుతుగ నామనమునందు కుదురుగ నుండెన్.

గీ. వారివేగాహతిని గూడి వ్రస్సిపోవు
సేతు వెట్టుల గట్టగా చేతగాదొ
అటుల బహురంధ్రయుతమైన యవనిరాజ్య
మఱియు దుర్బంధమనుచునే ననగవలెనె?

సీ. ఒకకోర్కెఫలవాంఛనొకచూతబీజంబు తనదొడ్డిలోవలతడపిపెంచ
నది పెద్దమ్రానయ్యెనధిక శాఖలగాంచె పూచెనుపూలన్ని పుడమిబడియె
కాయయొకటియైనగాయకయుండుట నాకోర్కెకోరికలడవిగలిసె
నాయుపమానంబునంచితగతిగన నీకుచెల్లునుగాదె నిర్జరాభ!

గీ. దశరథాజ్ఞను తలదాల్చి ధరణినేల
బూనకుండిన నీవల్ల బూర్వులకును
జనులకెల్లను ఫలమేమి జానకీశ!
గాన పట్టాభిషేకంబు గనుము వేగ.

కం. తరణియు చంద్రుడు భూమియు
వరతారలు సురలు మునులు వాసవముఖ్యుల్
వరలుచు నుండెడుదాకను
ధరణిని బాలింపవయ్య దశరథతనయా!

సీ. వినుమొకమాటను విశ్వాసవశమున గనుము నీప్రజలనుగనులతోడ
నీదినమందున నిటకుజేరకనీవు తప్పిన తప్పక దహానుజేర
తలచిరితల్లులు తరుణులుగురువులు నాతోడివారని నమ్ముమీవు
ప్రతులును మిత్రులుప్రబలులొబంధులు సామంతులందరుసరసమతులు

గీ. ధరణి గలిగిన జనులెల్ల ధర్మసరణి
యగ్గి బడగనె యరుదెంచి రమలమతులు
కనుక కరుణించి ప్రజలను కావ్యవిదుడ!
ప్రజలవలె నెంచి పాలించు భద్రముగను.

వ. రామభగవానుడు తన యనుంగు తమ్ముడు వల్కు — పల్కుల

క. వినివిని తమ్ముని గనుగొని
తనమనమున మెచ్చి ప్రజల దయగనుగొనుచున్
తనయందు వారికుండిన
ఘనభక్తికి హర్షమొంది గ్రక్కున బలికెన్.

క. ఖలదమనుడైన రాముడు
సలలితకృపభరతుగాంచి సరసత బలికెన్

ఘనరవము గలుగు వాక్కుల
నిలనేలెద నీదు భక్తి నింపుగ గనుచున్.

క. తమ్ముని తనయుని పలుకులు
సొమ్ములుగా చెవుల కెపుడు సొంపులు గూర్చన్
తమ్ముని తనయుని పలుకుల
నిమ్ముగ వినలేని మనుజు డినుమో రాయో.

గీ. ధర్మబద్ధుడ నగుచును ధరణినపుడు
విడిచినాడను నీవెంత వేడుకొనిన
ధర్మబద్ధుడ నగుచును ధరణి నిపుడు
విడువ కేలెద నీవింత వేడుకొనుట.

క. అనుమాట నోట వెలువడ
ననుమానము విడిచి భరతు డలరెను మదిలో
తనమంత్రుల గనుగొనియెను
వినయంబున కార్యసమితి విరచితమయ్యెన్.

గీ. శ్మశ్రువర్ధనులప్పుడు శస్త్రహస్తు
లగుచు రాముని జేరిరి యర్థ్యముగను
తమ్ము లసురులు వానరు లధినవారు
స్నాతులైయుండ రాముడు స్నాతుడయ్యె.

సీ. చిత్తానుకూలఁరుచిత్రమాల్యంబుల వరభూషణములను వస్త్రములను
దశరథతనయులతగురీతినప్పుడు బహువిధాలంకారపరుల జేయ
దశరథపత్నులుధరణిజనందరు ప్రతికర్మమొనరించి ప్రస్తుతింప
తనమంత్రులందరుతగినదుస్తులదాల్చి తనపార్శ్వమున వేగదనరుచుండ

గీ. దనుజ వానరవీరులు దండ నిలువ
సకలజనులును సతులును సంతసమున
సర్వభూషణభూషిత సర్వగాత్రు
లగుచు చెలగిరి సర్వత్ర హరిగుణులు.

వ. అంత సుమంతానీతమును మను మాంధాతృ కకుత్స్థ రఘు దిలీపప్రభృతి మహారాజాధిష్ఠితమును నవరత్నప్రభాభాసురమునగు,

క. హరియుక్త రథము రాముడు
పురుహూతునిబోలి యెక్కి పోవుచు నుండన్
గురుడును మంత్రులు జనములు
పరివారము తగినయట్లు పరివేష్టించెన్.

క. వానరులు మనుజరూపుల
మానితవరసహస్రనవ మాతంగములన్
మానుగ నెక్కిరి ముదమున
పూనిక సద్భూషణముల బూనిరి మేనన్.

వ. అపుడు.

సీ. భరతుడుసారథ్యభరము దాల్చుచునుండ శత్రుఘ్నుడునుబట్టె ఛత్రమపుడు
సౌమిత్రివీచెను చామరయుగముతో రాముని శిరమున రమ్యసరణి
చంద్రనిభంబైన చామరమునుబట్టి వరవిభీషణుడప్డు వాసివిసరె
పావనికడుభక్తిపాదయుగ్మముబట్టె వరతురగము నెక్కి వజ్రినుతుడు.

గీ. మునులు దివిజులు మనుజులు మోదమునను
రామవిజయంబు పాడిరి రమ్యముగను
కల్పతరుపుష్పవర్షంబు గలిగె మిగుల
దివ్యవాద్యఘోషంబులు తేజరిల్లె.

సీ. వాద్యమానానేక పటహదుందుభిశంఖ కాహళరవములుక్రమముగను
కస్తూరికుంకుమాగరుముఖ్య పరిమళవస్తుసమన్విత వరజనంబు
సంభ్రమద్రుతభృత్యసామజ చరణసంక్షోభ సంచాలిత క్షోణితలము
తౌర్యత్రికాక్రాంత తరుణవేశ్యాపదమణినూపురధ్వాన మహితపథము

గీ. స్వస్తివాచక సంశోభి పాఠకంబు
మంత్రనిర్వర్తితోత్సవ మహితకలన

బంధుజనబృందబంధుర భవ్యరవము
నవ్యగతినొప్పె నా రామనగరయాత్ర.

క. స్నాతానులిప్తతనులై
ధౌతామల వసనకుసుమధారులు మిగులన్
పూతాత్ములు సామంతులు
చేతోమోదంబుతోడ జేరిరి రామున్.

సీ. పుష్పాక్షతంబులుపూజ్యులుగోవులు జాతరూపంబులు చారుకన్య
లామ్నాయవిదులైనయాద్యులౌవిప్రులు నగ్రభాగంబుననలుగుచుండ
భవ్యులుమంత్రులుబ్రహ్మర్షివర్యులు ప్రకృతిజనములునుప్రబలుచుండ
పరివారయుక్తుడు పరముడురాముడు తారలతోగూడి దనరుచున్న

గీ. చంద్రుబోలుచు రఘురామచంద్రవిభుడు
మెలువువలెనుండు సీతయు మేలు గోరు
నధికభక్తులు పరిపూర్ణహర్షవశత
సేవజేయుచునుండగ జేరె పురము.

క. తల్లులకెల్లను భక్తిని
మెల్లగ నతిజేసి భరత! మిహిరసుతునకున్
మొల్లముగ నాదు గృహమును
కొల్లగ నిమ్మనియె నృపుడు కోమలఫణితిన్.

శా. త్వన్మాకాంతుండు వసిష్ఠముఖ్యు లధికాశ్చర్యాభినిర్మగ్నులై
యాకర్ణింప వచించి యాత్మకథ సీతాఖ్యాన్నబహ్వృష్టన్నరా
నీకోపేతనుజేరి మంగళగృహాస్వీతు దయోపేతు డి
క్ష్వాకాధిష్ఠితమైన గేహమును వేడ్కన్ జొచ్చె నుత్సాహియై.

వ. అంత భరతుడు సుగ్రీవు గనుగొని,

క. కేలున కేలు బట్టుకొని
మేలుగ సుగ్రీవునవుడె మిత్రమ యనుచున్

లాలించి రాము భవనము
వీలుగ నివసింపనపుడె విడిది యొనర్చెన్.

గీ. భరతు డనియెను సుగ్రీవ! భవ్యమిత్ర!
రామపట్టాభిషేకంబు రమణజరుప
పుణ్యతీర్థంబులన్నియు బోయి తేర
వానరుల బంపు వేగమ వైభవముగ.

వ. అని భరతరాజు వచించిన విని సుగ్రీవుడు

గీ. వానరేశుడు నలుగురు వానరులకు
భర్మఘటముల నిప్పించి పలికె నిటుల
సాగరోదకములదెండు సవితృ డుదయ
పర్వతంబున కెగ బ్రాక బఱచులోన.

వ. మఱియు నైదువందలకలశల గొని యైదువందల నదులలోని జలముల దెండని వానరుల కాజ్ఞాపించె.

గీ. ఐదువందల నదులలోనైన జలము
భర్మకలశల కీశులు పదిలముగను
తెచ్చి నిలిపిరి తమశక్తి దెలియగాను
మేలుమేలని యందరు మెచ్చుచుండ.

క. లలితంబగు కలశంబున
బలయుక్తి సుషేణుడపుడు భవ్యప్రాచీ
కలశోదధి కీలాలము
విలసితగతి దెచ్చి నిలిపె వీరులు మెచ్చన్.

క. సరసముగ ఋషభుడప్పుడు
వరదక్షిణవార్ధివారి భరితఘటంబున్
త్వరితగతి దెచ్చి నృపవరు
కరుణకు ధాపాత్రుడయ్యె కాలజ్ఞుండై.

క. గవయుడు పడమటి కడలికి
పవమానజవంబుతోడ బఱచి రయమునన్
సవరణజలయుత కలశము
నవలీలను దెచ్చి నిలిపె నార్యులు మెచ్చన్.

క. నలుడు గొని తెచ్చె నుత్తర
జలనిధితోయంబు మిగుల జాగ్రతతోడన్
యలయక క్లేశము లేక నె
బలవేగముతోడగూడి ప్రబలుండగుచున్.

క. అంతట గురుడు వసిష్ఠుడు
కాంతంబగు కనక పీఠి కాంతను సీతన్
శాంతుని సీతాకాంతుని
భ్రాంతుడు కాకుండ నిలిపె ప్రమదం బలరన్.

సీ. వాలఖిల్యవసిష్ఠవామనజమదగ్ని కాశ్యప జాబాలి కణ్వవిజయ
గౌతమముఖ్యులుకార్యజ్ఞులందరు శక్రుని వసువులు జలపినట్లు
పరిమళయుక్తమౌపావనజలమును నభిషేక మొనరించి రమలమతులు
వరఋద్విగ్ద్విజబృందవరమంత్రియోధులఃకన్యలువణిజులఃక్రమముగాను

గీ. దివ్యరసమున దివినుండి దేవగణము
సమ్యగభిషేకతంత్రంబు సలిపినారు
సర్వజనములు సౌభాగ్యసరణి గాంచి
పరమసంతోషసాగరపతితులైరి.

సీ. మనువాదియుగమున మహిమతోదాల్చిన మహితకిరీటంబు మిహిరకులులు
తరతరంబుగతలదాల్చిరి యభిషేక కాలముననను భద్రకలితులగుచు
నద్దానిమణివరహారిపీఠమునందు నిలిపిరిపూజించి నియతవిధుల
నిగమమంత్రంబులనిపుణులౌవిప్రులు సాంప్రదాయవిదులుసంతసింప

గీ. జలిపి రంతట గురు దతిసమ్ముదముగ
మణికిరీటము రామాని మస్తకమున

నిలిపె మంగళవాద్యము ల్నిరుపమాన
దివ్యదుందుభినాదము ల్దేజరిల్లె.

సీ. శత్రుఘ్నుడన్న కుచ్ఛత్రము బట్టెను భరతుడానందాబ్ధిపతితుడయ్యె
లక్ష్మణుడద్భుతలలితసంతసమందె చామరమునువీచెసవిత్రుసుతుడు
చేబూనివమఱియొకసితచామరంబును రావణతమ్ముడు రక్తివీచె
వాసవసందత్తవరరత్నహారంబు పవనుడర్పించెను పరమభక్తి

గీ. గురుడు రాముని గనుగొని కోర్కెలన్ని
దీక్ష దీఱెను దీఱెను తీఱెననియె
దివ్యదుందుభినాదంబు దిశల మ్రోగె
నప్సరఃకాంత లాడిరి యంబరమున.

క. ఇలబండె పైరులన్నియు
ఫలములతో వరలె సకలపాదపపంక్తుల్.
వలపులు గొలిపెను సుమములు
విలసిల్లెను దిక్కులన్ని విమలము లగుచున్.

సీ. రాఘవుడప్పుడు రమ్యతురగముల శతసహస్రంబులు సంతసముగ
గోవులనొకలక్ష కోడెలనన్నిటి ప్రియుతసిమ్మ్కంబుల ప్రబలకరుల
నయుతాభరణములనతిమూల్యవస్త్రాళిభూమిఖండంబులుపురవరములు
విప్రుల కతిభక్తి వినయముతో నిచ్చి మిత్రులకెల్లనుముదముగూర్చి

గీ. పరమపూజ్యుల పూజించి భవ్యవిధులు
హితులకెల్ల హర్షంబు హాయిగూర్చి
యధికపు లల్పులు సమరస హర్షమొంద
రాము డందర బూజించె రమ్యసితుల.

కం. భానుజు నవలోకించుచు
భానుద్యుతి దివ్యరత్న భాసురహారం
బానందపరత నిచ్చెను
మ్లానితమనువంశభవుడు మన్నిమహోద్ధన్.

క. హీర విడూరంగ మణివర
భారవిభూషితములైన పరమాంగదముల్
ధీరుడు రాముడు కృపతో
వీరున కంగదునకిచ్చె విశ్వముమెచ్చన్.

సీ. కమనీయమైయొప్పి కనులనాకర్షించు కాంతిని దిక్కులగలయగూర్చి
బహువిధమణివరభరితమైభూషిత భర్మవిశిష్టమై బఱగుచుండు
నాణెము త్తెములను నవరత్నగణములుగలిగి విమలకాంతిగమకమగుచు
బఱగు నుత్తమమైనసరమును గైకొనిమంజులవాక్కులమధురముగను

గీ. రామచంద్రుడు రఘుముఖ్య రాజవరుడు
కమలనయనుడు కారుణ్య కలశజలధి
యధికకరుణను మన్నించి యమలగతిని
జనకతనయకు నర్పించె చతురముగను.

క. అతిమాల్య వస్త్రయుగ్మము
ప్రతిగనలేకుండు నగల పతియనుమతితో
నతులితకరుణను పవనజు
మతిమంతు నలంకరించె మహిసుత మిగులన్.

చ. ఒసగియు తృప్తిలేక మహితోత్సుకత స్వరమాదరంబునన్
బసగల కంఠభాగమున భాసిలుహారము చేతబూని తా
లసితకృపాకటాక్షమున వానరవీరుల రామచంద్రుని
న్విస్ఫుమరదృష్టి గన్గొనెను వేమరు నాథునిగాంచె నింపుగన్.

ఉ. రాణదనర్చుహారము కరాబ్జమునందునబూని చూచు నా
రాణి తలంపెరింగి రఘురాముడు బల్కెను హారమిమ్మలీ
ల్వేణిరో! మెచ్చుగూర్చి కడుప్రేమకుపాత్రుడెవండొ వానికిన్
వాణికినైన మెచ్చతగువాక్కుల బల్కుచు పూజసేయుమిదా.

క. అన విని జానకి యప్పుడు
యనిలాత్మజు కంఠమందు హారము నిడగా

హనుమంతుడు శశికరసిత
ఘనయుత శైలంబుకరణి గ్రాలుచు నుండెన్

వ. పిదప రఘువీరుడు వానరులందర రావించి వారు వారు వల చినయటుల వరమహార్ఘ్యమణివస్త్ర వస్తుతతుల నొసంగి పరిపూర్ణసంతృప్తులజేసె సీతామహాదేవియు వానరపత్నుల బహువిధ గౌరవ సత్కార యుతల జేసెను. ప్రియవాక్యపంచకమున మన్నించె. శ్రీరామచంద్రుడు సుగ్రీవుని యంగదుని యధికంబుగ మన్నించె.

సీ. కులధనమైయొప్పు కోమలరంగాధినాథుని దయచేయు నాకౌమగను
మది ముదమందుచు మహితభక్తినిమ్రొక్కి యల విభీషణుడేగ
నాత్మపురికి
వినమితవైరుడు విశ్వేశుడైయొప్పు రాముడు జక్కగ రాజ్యమేలె
యాసేతుశీతాద్రి నధివసించినవారు సౌరాజ్యగరిమకు సంతసిలిరి.

గీ. ప్రజల బిడ్డలవలెగని ప్రబలకరుణ
నీతిబాధలు లేకుండ నిలనునేల
రామరాజ్యంబు మాకెపుడు రమణగలిగి
మమ్ము బాలింపవలెనని మహిపులనిరి.

సీ. ధర్మవత్సలుడైన దశరథరాముడు తమ్ముని సౌమిత్రి దయనుబిలిచి
సౌమిత్రి లక్ష్మణా సౌజన్యనిధివీవు ధర్మమార్గము దప్పదగదుగాన
యౌరాజ్యపదవినియుతమతిధరియించుచుమనినసౌమిత్రియునని మొనిట్లు
కైంకర్యవృత్తికికడు విఘ్నమాటను నాకేల పదవులు నరవరేణ్య!

గీ. పరమభక్తిని పరిచర్య జరుపుచుంద్రు
నిఖిల సుఖములు నీపద నిత్యసేవ
వలన గలిగెడి సుఖమున వరశతాంశ
మైనగాదని మనమున నధిగమింతు.

సీ. నినుజూడకుండిన నిముసము యుగమగు నినుగాంచుయుగములు
నిముసమగును
నీకోడిమాటలు నిత్యసుఖదములు నీసేవయే నాకు నిత్యపదవి

నీతోడివాసంబు నిర్జరసుఖదంబు నినువీడియుండుట నిరయసమము
నీమిత్రజనములె నిజమిత్రగణములు నీవైరిచయములె నిఖిలరిపులు

గీ. నీవెరాజ్యము ధనమును నీవె నాకు
నీవె తల్లివి తండ్రివి నీవె గురుడ
నీవె పాలకదైవంబు నీవె ప్రియుడ
నీవె హితదాయి వసువులు నీవెనాకు.

సీ. కైంకర్యవిఘ్నంబుకలుగజేయగజాలుకనకంబు మృదముగగాంచువాడ
కైంకర్యవిభవంబు గలిగించగాజాలు కరణంబు కనకమై గనగజాలు
కైంకర్యవిఘ్నంబు గలిగించగాజాలు నాత్మబంధుండైన యగునువైరి
కైంకర్యవిభవంబు గలుగక యున్నచో నసువుల విడిచెద నమరవంద్య

గీ. ప్రీతికారిత కైంకర్య వితతినాకు
సకల సుఖముల గలిగించ జాలునమ్మ
గనుక కైంకర్యపదవిని గాంచి మిగుల
నన్యమును నేను వాంఛింప నమలచరిత!

వ. అని పలుకుచు నెన్నివిధముల నిర్బంధించినను నే నధికార పదవికి నర్హుండకాననియు సర్వవిధ కైంకర్యముల నొనర్పగలననియు దృఢంబుగ బలికిన రామచంద్రుడు చేయునదిలేక భరతు నవలోకించి ప్రియసోదర ! రాజ్యపాలన మతి దుర్భరము గాన నా యాజ్ఞాకైంకర్య రూపముగ యీ రాజ్యభారము వహించి నాకు సహాయుండవు కమ్ము. ఇది నీకు క్రమప్రాప్తము ధర్మప్రాప్తమనిన విని భరతుడు నాకు విక్రమధర్మములతోడ పనిలేదు. నామతమును వినుము.

శా. అన్నా! నేబదునాల్గు వర్షములు నీయీపాదుకల్ గొల్చుటన్
విన్నాణంబుగ నేర్చుకొంటి నొక సద్విద్యన్ రమావల్లభా!
మన్నించె న్గురుశేఖరుండు గనుక న్మాన్యానసం బెవ్వడున్
చెన్నారున్గదతద్గతంబుగ నిజక్షేమానుసంధాయియై.

వ. అది యేదియనిన విన్నవించుచుంటిని వినుము. సనాతనం బాచార్యోపదిష్టము. ప్రవృత్తిమూలకము. సదాచారసిద్ధము. సర్వంబును త్వదధీనమొనర్చి స్వరక్షణమున స్వాన్వయము లేకుండ నీయందునిర్భరన్యాసమొనర్చి త్వదేకాయత్తసర్వవ్యాపారుడనై చిత్తంబున నిత్యంబు నిన్ను విస్మృతిగనక తైలధారావచ్ఛిన్నస్మృతిసంతానుడనై యుంటుట యే యను విద్యావిశేషంబు నాచే గృహీతంబయ్యె. నీపాదుకలవలె నేనును నీకు యథేష్టవినియోగార్హుడ. యౌవరాజ్యమునగాని భావత్కచిత్తానుసారము మఱియొకదానియందుగాని వినియోగించుకొనుము. నీవు నాకొసగుపదవి నాయాత్మ చెడకుండను మీపాదముల విడువకుండను స్వాతంత్ర్యలేశము గాని యధికారగర్వాంకురముగాని నామనమువగలుగకుండ ననుగ్రహింపుము. తదితరాపేక్ష నాకేమియు లేదు. ఇది నాయథార్థాశయమనిన రామభగవానుడు విస్మితచిత్తుడై విని యానందించె,

గీ. అంత రాముడు భరతుని హర్షవశత
యౌవరాజ్యపదవిని నిల్పి యతమనీప
దాను సీతయు తల్లులు తమ్ములలర
ప్రజల మనముల సంప్రీతపాత్రుడయ్యె.

వ. అట్లు సకలజనానందకరముగ రాజ్యపాలన మొనర్చుచు లక్ష్మణానుచరుడై సంచరించుచుండె నంత కొన్ని దినములు జరిగిన పిదప రాముడు సుగ్రీవుని గనుగొని యమూల్యాభరణములని నిచ్చి మిత్రమ! హనుమదంగదులు నాబహిః ప్రాణములు. వీరిని నీవు దయతో నాదరించుచుండుమని వారినిద్దరినిపిలిచి తనశరీరమునగలనగల వారిద్దరికిని సమముగ నొసగెను. జాంబవంతుడు రామార్పితదివ్యభూషణభూషితుడై రాము సన్నిధికి పోయి మహాత్మా నాకొక కోరికలదు. దానిని విన్నవించుటకు లజ్జించుచున్నాడననియె. రామప్రభుడు చెప్పుమనియె. బహుబలవిక్రమశాలి వగు నీతోడ బాహాబాహి యుద్ధమొనర్పవలెనని కోరికయని విన్నవించెను. రామభగవానుడు మహావీరుడా! జాంబవంతుడ! నేను కృష్ణుడనై యవతరించగల నపుడు నీతోడ యుద్ధమొనర్చెద. ఈ శరీరముతో

మన మిరుపురము యుద్ధ మొనర్చుట తగదది జన్మాంతరానుభావ్య మనియె. హనుమంతుడు మహాత్మా! రామకథ భూమియందు వినుపించు చున్నంతవరకు ప్రాణములతో నుండి యప్సరోగీతభవత్కథాశ్రవణమున కానందించుచుండ నన్నుగ్రహింపుమని కోరెను. రామభూపాలు డానం దించి భద్ర సింహాసనమునుండి లేచి హనుమంతు నాలింగన మొనర్చి వీరుడ! నీవట్లనె జీవించియుండి చతుర్ముఖబ్రహ్మనంతరమున సత్యలోక మున విధాతవై బ్రహ్మయుఃకాలము జీవించి మత్పదమును బొందు మని పలికి తనకంఠమునుండి స్థూలముక్తాహారమును గొని హనుమంతుని మెడలో నుంచెను. సుషేణాదివానరులకు సన్మానమొనర్చెను. సుగ్రీ వాదులు రామాజ్ఞను బొందియు రామవియోగమును సహించలేక కొంతకాలము రామసేవచేయుచు నివసించి తుదకెట్లనో నిజసదనముల కేగిరి. విభీషణుడు రామకులధనమగు శ్రీరంగరాజ విగ్రహమును బొందియు కొంతకాల మర్చించుచు రాముని సేవించుచునుండి యెట్లనో రాముని విడిచి చనియె. విభీషణమంత్రులు సన్మానితులై విభీషణుని తోడనె జనిరి.

గీ. అంత నొకనాడు రాముడు హర్షమునను
భరత లక్ష్మణ శత్రుఘ్న భరితసభను
రత్నసింహాసనంబున రమ్యముగను
పురుషవర్యుడు నివసింప పుష్పకంబు.

గీ. రామసన్నిధి కేతెంచి రాజరాజ
యాజ్ఞగైకొని ధనదుని యాలయమును
చేరి ధనదుని గనుగొని చేతులొగ్గి
విన్నవించితి నీయాజ్ఞ వినియె నతడు

క. ననుగని ధనదుడు బలికెను
మనపుణ్యము బలుకవశమె మహితుడనికనే
ననఘుని రాముని గొలిచెద
జనుమిా నీవతనికొలిచి చక్కగ నిలుమిా.

క. కన నీవు నేను మిక్కిలి
ఘనపుణ్యము జేసియుంట గడ తేరెనునూ॰
మనశత్రుడు దశకంఠుడు
వినయంబున రాము గొలచి వెలయుము వేగన్.

గీ. మనుజమాత్రునిగా రాము మదిని నీవు
దలచబోకుము వైకుంఠధాముగాను
దలచి సేవించి జన్మము ధన్యమగును
జనుము వేగమ నీవిక సలువు సేవ.

వ. యక్షలోకనాథుడగు కుబేరుడు

గీ. పలికెగావున వచ్చితి భవ్య! నన్ను
కరుణ నేలుము నను నెప్డు కంజనయన!
యనిన రాముడు ధనదుని యాజ్ఞగాన
పుష్పకంబును విలిపెను పూజ్యగరిమ.

క. సీతయు రామనృపాలుడు
చేతోమోదంబుతోడ జెలగిరి యధిక
ప్రీతిని గడచెను కాలము
సీతాసతి గాంచె గర్భచిహ్నాల మిగులన్.

క. ప్రీతినిగనె కౌసల్యయు
చేతోమోదంబుతోడ చెలగిరి మనుజుల్
నూతనకాంతుల సీతయు
ప్రీతిని గలిగించె చెలుల ప్రేమాస్పదులన్.

క. రాముడు సీతను గనుగొని
కామితమును తెలుపుమనుచు క్రమత నడుగన్
కామితము దెలిపె నిట్టుల
కోమలి గంగను గనుగొన కోరితి ననియెన్.

గీ. మునుల పాదములకు మ్రొక్క ముదముగలిగ
నాశ్రమంబుల గనుగొన నాశగలిగె

రొక్కరాత్రంబు నివసింప నోప్పుతోడి
బంప వేడెద ననియెను పద్మనయన.

వ. ఇట్లు దైవవశంబున సీత కోరినతోడనె శ్రీరామనృపాలుడు సీత నాదరించి యంతఃపురమును విడిచి బహిఃప్రదేశమున విహరించుచున్న, గ్రామవార్తల దెలుపుటకు నియమితుడై యున్న భద్రుడనువాడగుపించిన రామభగవానుడు వానిని బిలిచి భద్రుడా! గ్రామములో వింతవార్త లేమైన వింటెవేని విన్నవించుమనియె. భద్రుడు మహారాజ నేను నిన్నరాత్రి యయోధ్యా పట్టణమంతయు తిరిగితిని. ఏ గృహమున వినినను రామకథాలాపములే గాని యన్యమేమియు వినపడలేదు. పుర రజకవాటిక కేగితిని. అట నొక రజకుడు భార్యనుజూచి నీవు నాయింట నిలువకుము. నీ యిష్టమువచ్చిన చోటికేగి నివసించుమనియె. అతనిపత్ని నేనేమితప్పు చేసితినయ్యా? నీవు యింటలేకుంటివి. నా తండ్రికి శరీరములో జబ్బు చేసినదని విని తండ్రిని జూడబోయి చూచి వెంటనే వచ్చితిని. ఇదితప్పా యనియె. ఆమాటలువిని నీ తండ్రికి జబ్బుచేసినచో నేను వచ్చిన తరువాత నాతోచెప్పి పోవలసినది. నాతో చెప్పకుండా నాయాజ్ఞ లేనిది నాయిల్లు దాటిపోవుట తప్పుగాదా! నేను వెఱ్ఱిరాముడ ననుకొంటివా? నా గృహమును త్రొక్కవలదు. పొమ్ము.

గీ. రావణాంకంబునందున్న రమణిసీత
యెటుల రాముడు గైకొని యేలుచుండె
ప్రాకృతుండైన నిట్టుల జఱుపబోడు
పాపమనకను దెచ్చెను ప్రభుడుగాన.

వ. నేను వెఱ్ఱిరాముడనుగాను. నీయాటలు నాదగ్గర సాగవు. నీవు యథేచ్ఛగ సంచరించుమని తీవ్రముగ బలికి భార్యను విసర్జించెనని పలికి సెలవొంది యథేచ్ఛంజనియె. రామభద్రుడా మాటలనిని పరాపవాదమునకు భీతిల్లి లక్ష్మణుని బిలిచి సీతను గంగాతీరమున విడిచిరమ్మని యాజ్ఞాపించెను. లక్ష్మణు డేదియొ జెప్పబోవుచుండ మాఱుమాటాడకుండుము, సత్వరముగగొనిచని గంగాతీరమున విడిచిరమ్ము పొమ్ము అనియె.

లక్ష్మణుడు చేయునది యేదియులేక రామునివలన సీతను నీ కోరిక యేమి యని యడిగిన సీత గంగానదిని మునులను చూడగోరుట జెప్పెనది సాకుగా గొని పోయి గంగాతీరమున విడిచిరమ్మనియె. లక్ష్మణుడనేక విధముల ప్రార్థించినను ఫలములేకపోయెను. రామాజ్ఞాకరుడగు లక్ష్మణుడు మునులను సేవించ గోరితివి. కాన రమ్మని సీతను బిలిచె. అమాయకురాలగు సీత రాముడు తనముద్దు చెల్లించెనని తలచి లక్ష్మణుడుతోడి తెచ్చిన రథము నెక్కెను. లక్ష్మణుడు గంగాతీరమున వాల్మీకాశ్రమ సమీపమున రథమునాపి జరిగినవృత్తాంతమంతయు సీతకు విన్నవించి సీత దుఃఖించుచుండ తానును మిగుల దుఃఖించి సీతనడవి విడిచి యెట్లనో మనస్సు చిక్కబట్టుకొని యయోధ్యను ప్రవేశించెను. అట నడవిలో సీత దుఃఖించుచుండ నాదుఃఖరవమును వాల్మీకి మహర్షి విని సీతా సన్నిధికేతెంచి దివ్యదృష్టిని గతవృత్తాంతమంతయు తెలసి సీతనోదార్చి తన యాశ్రమమునకు గొనిచని తన పుత్రికగ దలచి పోషించుచుండె. అంత కొంతకాలమునకు భరతునకు తక్షపుష్కలులును లక్ష్మణున కంగద చంద్రకేతులును శత్రుఘ్నునకు సుబాహుశత్రుఘాతులును కలిగిరి. వాల్మీకాశ్రమమున సీతకు లవకుశులు జనించిరి. వీరందరును క్రమముగ పెరిగి పెద్దలై యావనవంతులై విరాజిలుచుండిరి. రామరాజేంద్రు డొకదినమున శత్రుఘ్ను నీక్షించి మన వంశంబున మాంధాత యను మహారాజగు చక్రవర్తిని లవణుడను రాక్షసుడు సంహారించెను. మనకు వాడు పరమశత్రువు. మనవారెవరును వానిని సంహారించలేకపోయిరి. నీవు సత్వరముగ సేనలతోజని వానిని సంహారించి యాదేశమును విభజించి మధురపురమున నీ జ్యేష్ఠపుత్రు సుబాహుని వైదిశమనుపురమున శత్రుఘాతుడనువానిని నిలిపి పట్టాభిషిక్తుల నొనర్చి కొన్నిదినము లచట నీవుండి రమ్మనిన శత్రుఘ్నుడన్నయాజ్ఞల నెరవేర్చి రామసన్నిధినిజేరి సుఖముగనుండెను. లక్ష్మణుడురామాజ్ఞను కారుపథేశ్వరుల జయించి యాదేశమును విభజించి యంగదీపురమున నంగదుని చంద్రకాంతపురమున చంద్రకేతుని నిలిపి పట్టాభిషిక్తుల నొనర్చి రామసన్నిధికి చేరెను. భరతుడు రామాజ్ఞను సింధునదీతీరమున నుండు

గంధర్వుల జయించి యా దేశమును విభజించి తన జ్యేష్ఠపుత్రుని తక్షశిలయందును రెండవపుత్రుని పుష్కరుని పుష్కలావతీపురమునను నిలిపి పట్టాభిషిక్తులనొనర్చి రామసన్నిధికి చేరెను.

సీ. విక్రమసింహుడు వినుతసద్గుణజాలు డిందీవరశ్యాము డీడిలేండు
లక్ష్మణానుగతుఁడు లావణ్యదేహుడుద్భృతమహోస్కంధుడుధృతియుతుండు
ఆజానుబాహువు హరిప్రియుండును నిరుపమదాతృత్వ నిరతపరుడు
కరుణాసముద్రుడు కాకుత్స్థతిలకుడు శరణార్థి సంత్రాణ శక్తియుతుడు

గీ. ధర్మరక్షణ దక్షుడు ధనదనిభుడు
కమలనయనుడు శాంతుడు కాలవిదుడు
దశరథానంద కందంబు ధరణివిభుడు
చంద్రికానిభ సత్కీర్తి చారుమూర్తి.

వ. ఇట్టి రఘువీరు డొకదినంబున వసిష్ఠాదుల నవలోకించి యశ్వమేధాది యజ్ఞంబు లొనర్చ దలంపుగలదనిన మునులందరును సంతసించిరి. సీతావియోగకర్శితుడు సర్వజ్ఞుడగు శ్రీరామచంద్రుడు వసిష్ఠానుమతంబున సువర్ణ సీతాపతికృతిని తన సన్నిధి నుంచుకొని సకల యజ్ఞముల నొనర్చెను. అశ్వమేధము నొనర్చునపుడు నైమిశమున యజ్ఞశాలల నిర్మింపజేసెను. సుగ్రీవ హనుమదాది సకల వానరవీరులును జాంబవదాది భల్లూకవరులును విభీషణాదిరాక్షససముదాయములునుభూలోకమునగల రాజలోకమంతయు నుపాయనపాణులై రాముని సేవించిరి. విప్రులందరును మునిలోకమంతయు జనుదెంచెను. సర్వవస్తుసంపూర్ణమయ్యెను. సుముహూర్తమున నశ్వమేధయోగ్యమగు (యమునా) అశ్వము విడువబడినది. రామప్రభువరుడు యజ్ఞశాలం ప్రవేశించె. భరతశత్రుఘ్ను లహర్నిశము మహాజనుల కన్నపానాదు లొసగుచుండిరి. లక్ష్మణుడు సర్వకాల సర్వావస్థల రాముని విడనాడకుండ నుండెను. విభీషణ సుగ్రీవాదులు వానరాదులతోగూడి సమయానుకూలముగ నన్ని పనులను సమయము దాటకుండ నొనర్చుచుండిరి. హనుమంతుడు రామపాదసన్నిధిని నిలచి యాజ్ఞాపితకార్యముల నెల్ల నొనర్చుచుండె. అశ్వమేధాశ్వము సకల

దేశముల దిరిగి యశ్వమేధకాలమున యజ్ఞశాలకేతెంచెను. యజ్ఞము సంకల్పింపబడి మంత్రతంత్రకలాపంబులు యథాయోగ్యముగ ప్రవర్తిల్లు చున్నవి. చిరకాలజీవులు బహ్వాశ్వమేధ సంద్రష్టలు యిట్టి యజ్ఞము నెచటను చూడలేదనిరి. యజ్ఞదర్శనార్థ మేగుదెంచిన మహాజనులందరు తృప్తిగ భుజించి పరమానందమునొందిరి. ఎవరేది కోరినను కోరికనుమించి యివ్వబడుచుండె. ఇటనశ్వమేధము వర్తిల్లుచుండ వాల్మీకిమహర్షి సకల శిష్యసమన్వితుడై యేతెంచి రాఘవరామునిచే పూజితుడై యథోచిత ముగ నివసించెను. కర్మాంతరముల యందు సీతాపుత్రులగు కుశలవులు శ్రీమద్రామాయణ మహాకావ్యమును వీణలమేళవించి పాడుచుండిరి. అవకాశము లభించినపుడు శ్రీరామచంద్రు డనుజబంధుమిత్రసహితుడై రామాయణమును వినుచుండెను. శ్రోతలందరు పరమానందము నందు చుండిరి. ఈ బాలురు కుశలవులను పేరు గలవారనియు, సీతాపుత్రుల నియు సర్వజనవిదితమైనది. రామభగవానుడు తన తమ్ములను పెద్దలను పంపి వాల్మీకిమహామునికి మహాత్మా! సీతామహాదేవి నిచటకు రప్పిం చుడు. సీత శుద్ధచరితయైనచో రామభద్రుడామెను పరిగ్రహించునని విజ్ఞాపింపజేసెను. విని వాల్మీకి మహాసభను గూర్చి దాసభకు సీతాదేవి విచ్చేయునని పలికెను.

గీ. భర్త వనితకు గురుడౌను భర్తృవాక్య
మెపుడు నిగమకల్పంబుగా నెంచదగును
గాన జానకి సభలోన ఘనముగాగ
ప్రతినచేయును ధర్మంబు బలమటంచు.

క. పతిదేవత యాచిన్నది
మతిమంతులు మెచ్చునటుల మహిలో నెపుడున్
సతియని పేరుండుటకై
పతివిన శపథంబుచేయ పాల్పడునుండీ.

వ. అని వాల్మీకి పలికె. నావాక్యంబుల రామభద్రునకు విని వించిరి. రామనరపాలుడు వసిష్ఠాదిమహాత్ములకు వినిపించి వారి సమ్మతిని

మహాసభ గూర్చ నాజ్ఞ యిడెను. సభకూడెను. మహాజనులు మహారాజులు మహర్షులు సభకేతెంచిరి. సభావృత్తాంతమును వాల్మీకికి తెలియపరచిరి. మహాపతివ్రతాగ్రగణ్యయగు సీతామహాదేవియు వాల్మీకియు సభకు వేంచేసిరి. సీతం గని కౌసల్యాద్యంతఃపుర స్త్రీలును రామలక్ష్మణ భరతశత్రుఘ్నులును రాజలోకమును మిగుల శోకించిరి. ఆ శోకరసమించుక శాంతించుటతోడనె వాల్మీకిమహర్షి సభామధ్యమున నిలిచి యుచ్చైస్స్వరంబున 'మహాజనులారా! మహారాజులారా! మహర్షులారా! రామనరపాలుడా! ఈమె సీత. యాచారప్రధాన, జనకమహారాజ కులసంభవ, సువ్రత, సుశీల. రామచంద్ర సహధర్మచారిణి. ఇట్టి యీమెను నిష్కారణముగ నీవు నా యాశ్రమ సమీపమున గర్భవతియని యైన యాలోచించక విడిచిపెట్టించితివి. నా పుత్రికాకల్పయగు నీమెను నేను నా యాశ్రమమునకుగొనిచని పుత్రికగ భావించి నా శక్తికొలది పూజించితిని. ఈమె గర్భమునుండి కుశలవులను యిద్దరు పుత్రులు జనించిరి. వారు సర్వసంస్కార సంపన్నులు. కర్మాంతరమునందు రామాయణమును వినిపించువారు. వారే నీ పుత్రులు. సీత నిర్దోషియైనను నీ కేలనో సంశయము కలిగినది. లంకలో నీమె నగ్నిలో పరీక్షించియు విశ్వాసమును పొందలేకపోతివి. నీ సంశయమును నివారించుటకుగాను యిపుడీ సభలో ప్రతిజ్ఞ చేయదలచి నీ యాజ్ఞకొరకు నిరీక్షించుచున్నది. శపథముచేయుటకు నీవాజ్ఞ యొసగుము. నీవు ధర్మజ్ఞుడవు. స్త్రీకి భర్త్రాజ్ఞలేనిచో స్వాతంత్ర్యము లేదుగదా! నీ యాజ్ఞయైనచో ప్రతిజ్ఞ చేయును. నేను సత్యమును వచించుచున్నాను. నేను ప్రచేతనుని పదవపుత్రుడను. నేనసత్యమాడువాడను గాను. బహువర్షసహస్రములు తపోనిష్ఠ నుంటిని. ఈమె దుష్టయైనచో నా తపఃఫలము నాకు లభించకపోవునుగాక! నే నేమియు పాపమొనర్చలేదు. యీమెను గూర్చి నేను పంచభూతములను విచారించితిని. జానకి మహాపతివ్రతయని తెలిసికొంటిని. ఈమె శుద్ధసమాచారయు పాపపతిదేవత' యనియె.

రామభూపాలుడు వాల్మీకినిగనుగొని మహానుభావ! వాల్మీకిమహర్షి! నీవాక్యములు సత్యములు. సీత మహాపతివ్రత. పూర్వము శపథము చేసి

దేవతలనందర మెప్పించినది. బ్రహ్మాదు లీమె పాతివ్రత్యమునకు మెచ్చిరి. నేపాపియని యెఱిగియు లోకాపవాద నిరాసకొఱకు నిండు చూలాలిని విడిచితిని. ఇది నాతప్పే. నాతప్పును మీరాగందరు మన్నించుడు. ఈమె శపథముచేసి పవిత్రయైనచో లోకుల యపవాదములు బోవును. నేను మిగుల సంతసించెద. ఈమె శపథముచేయుట కాజ్ఞ యిచ్చితిని. సీతాశపథమును వినుటకు దేవతలును మహానుభావులందరును కుతూహలులై యున్నవారని వచించె. అపుడు కాషాయవసనయు శుష్కగాత్రియు నగు సీతాదేవి తలవంచి భూమిని గనుగొనుచు అమ్మా! విశ్వంభరాదేవి! నీవు సర్వాధారవు, నేను నీ పుత్రికను.

క. ననుగావ దలచితేనియు
ఘనముగ గొనిపోవ నిపుడె గ్రక్కున రమ్మా
వినయమున వేడుచుంటిని
మనమున దయయుంచవమ్మ మామకజననీ!

గీ. తప్పు నాయందు లేశంబు దనరబోదు
కష్టములజూడ నెందుగ గలిగెనమ్మ
మహితులిందరిమధ్యను మహిమజూపి
తప్పు నాయందు లేదన దగును నీకు.

గీ. వినుము నామాటయొక్కటి వీనులలర
రామునగపతి దైవంబు రక్తినాకు
మనము రాముని విడువదు మహితముగను
గలిగె నాకు వియోగంబు కాలమహిమ.

క. మనసున వాక్కున కర్మను
గనగా నధికుండు నాకు గనపడడెవడున్
మనమున వాక్కున కర్మను
ఘనుడొక రాముండె నాకు గనపడుచుండున్.

క. మనమున రామునికంటెను
ఘనుడని నే నెవనినేని కాంక్షించినచో

నను నీవు గావబోవకు
ఘనమగు నీదర్శనంబు గలిగింపకుమీ.

క. రాముడె నా సర్వస్వము
రాముడు నాకధిపుడెపుడు రామునె దలతున్.
కామము ధర్మార్థంబులు
రామునితో కూడియుండు రాజద్గతితో.

క. మఱచితి తల్లి సుమేధను
మఱచితి నాతండ్రి జనకు మఱచితి మిథిలన్
మఱచితి మా చెల్లెండ్రను
మఱువనుబో రామునెపుడు మనమున తల్లీ !

క. అపరాధ లేశమున్నను
కృపవీడుము దర్శనంబు గలిగింపకుమీ
అపరాధము లేకుండిన
కృపతో నను గొనుచుబొమ్ము కారుణ్యానిధీ !.

క. ఎఱుగవె పంచభూతములు
నెఱుగడె శక్రుండు రవియు నెఱుగరె దివిజుల్
బరికింపలేడె శర్వుడు
మఱిపింపగవశమె నాకు మఱతురె వారల్.

వ. తల్లీ! నేను క్షత్రియాంగననుకదా! క్షత్రియాంగన యవమానమును సహించలేదు. లంక నగ్నిబడినప్పుడు రాముని విడువలేక భూమిని నిలచితిని. ఇప్పుడు తిరిగి వియోగము కలిగినది. చిరకాల వియోగదందహ్యమాన హృదయనైతిని. కాన ప్రజల ముఖములను చూడలేను. నీవు తల్లివిగాన నీ గృహమున నివసించుట నాకు ధర్మము. వనితకు నత్తవారియిల్లుగాని పుట్టినయిల్లుగాని శరణ్యముగదా యనియె.

క. సీతావచనము విని భూమిని
భీతావహమగుచు గలిగె భీషణరవముల్

భీతిల్లిరి జనులందరు
భ్రాతిగ వివరంబుగనిరి ప్రబలముగాగన్

వ. ఆ వివరంబునుండి యొక దివ్య సింహాసనంబు వెడలినది. ఆ యాసమునకు చుట్టును బహుశిరస్సులుగల నాగరాజు, యతిపరాక్రమ సంపన్నులుండిరి. వసుంధరాదేవి యటనున్నవారి కందరికిని దర్శనంబిచ్చి యుచ్చైస్స్వరంబున రామభూపాల! సీత నీకనర్హయె యగునా. అయినను నీవువిడిచితివి, ఇట్టిమహాపతివ్రత, క్షత్రియాంగనయవమానమునుసహించ లేదు. నేనుతల్లినిగానగొనిపోవుచుంటిని. నిజధామమున తిరిగినిన్నాశ్రేయిం పగల దపుడు మీరిరువురు దాంపత్యవైభవము ననుభవించగలరు. సీత యందు దోష మిసుమంతయు లేదని పలికి తన బాహువుల సీత నెత్తుకొని సింహాసనమున వసింపజేసి భూగర్భమున కతివేగముగ గొనిపోయెను. సీత పుట్టింటికి పోవుచు 'రామనృపాల! వందనము సెలవు. కరుణింపుము, అని పలికెను. దేవతలందరు సీతా పాతివ్రత్యమును కొనియాడిరి. రామ ప్రభువరుడు కోపదుఃఖపరివృతుడై యేమియుతోచక కొన్ని నిముషములు నిశ్చేష్టితుడైయుండి కోపోద్రేకమున భూమింగని యో 'వసుంధరాదేవి! సీతను నాకర్పింపుము. లేదేని నిన్నునీరగునట్లు జేసెదను. నాశక్తిని గను గొందువు. భూభాగమునంతయు ధ్వంసమొనర్చెద'నని ధనుర్బాణముల గొనిన శతానందుడు రామునిసమీపించి రామభూపాల! నేను విధాతను నీవాగ్రహించకుము. దుఃఖమును విడువుము. నీవుమాయామానవుడవు. నిన్ను నీవెఱుగవు. నీవునారాయణుడవు. సీతలక్ష్మీదేవి. నీకంటెముందుగ నీపరంధామమునకు సీత గమనించినది. పరమపదమున మీరిద్దరు కలిసి కొనెదరు. వాల్మీకినాయాజ్ఞానుసారము శ్రీమద్రామాయణమును రచించి యున్నవాడు. దానిని పూర్ణముగ నీపుత్రులవలన వినుమని పలికి యంత ర్థానమునొందెను. వాల్మీకి సీతభూగర్భమునపోయెనని మిగులవిలపించెను. వసిష్ఠమహర్షి వాల్మీకిని రాముని యోదార్చెను. రసాతలమునుండి యొక దివ్యవాణి ఇట్లు పలికినది. రామరాజా! నీవుకోపమునుదుఃఖమును విడువుము, ఇందు దైవమపరాధి. యొకరొకరు నపరాధులుకారు, దైవ

మెట్లుతలచిన సర్వ మట్లనె యగును. నీవికనిట సీతను గనజాలవు. నీవా మెను పరమవ్యోమమున గాంచెదవని, పలికెను. రామభగవాను డువశమితక్రోధదుఃఖుడయ్యెను. వసిష్ఠర్షి తత్కాలోచితవాక్యముల రాముని యోదార్చెను. రామనరపాలుడు వాల్మీకినిగని మహాత్మా రామాయణ శేషమును వినిపించుటకు కుశలవుల కాజ్ఞ యిమ్మనియె. వాల్మీకాజ్ఞను రామకథనంతయు కుశలవులు వినిపించబూనిరి. వీణలమేళగించి శ్రీరామ భగవానుడు తురగమేథమును పూర్ణముగ సాంగముగ పరిసమాప్తి నొందించి ఋత్విక్కుల యథోచితదక్షిణాల దనిపి సర్వజనులను సకల సత్కారముల సత్కరించెను. రాజులందరు రామప్రభావమున కానందించిరి. రాజులనెల్ల విశేషముగ గౌరవించి తగినరీతిని వారివారి దేశముల కంపెను. మునులందరు పూజితులై స్వాశ్రమములకు విచ్చేసిరి. సుగ్రీవ జాంబవంత విభీషణాదు లానందపారవశ్యులై నిజధామంబులకరిగి రామ భగవాను డయోధ్యను బ్రవేశించి లవకుశులను ప్రేమతో లాలించుచు కాంచనసీతను తన సన్నిధి నుంచుకొని,

సీ. నూరశ్వమేధము ల్బురదక్షిణలతోడ జేసెను దివిజుల చిత్తమలర
వాజపేయంబులు వైభవంబుగ జేసె వేదవిహితముల విడువకుండ
జ్ఞాతులు బంధులుఃసచివులు విబుధులుసన్నుతింపజెలంగె చారుమూర్తి
యూశ్రితజనముల నమరవృక్షమువలె కలుములనిడి తరిగాచుచుండె

గీ. పాడిపంటలు పూర్తిగ బఱగియుండె
వర్ణధర్మంబు గాపాడె వసుధయందు
రామచంద్రునిబోలిన రాజరాజు
భువినిలేడని పలికిరి భూమిజనులు.

క. పదకొండువేల సమములు
ముదితుండై రాజ్యమేలె మునివరనుతుడై
అదనెఱిగి జనుల గాచెను
విధితాఖిల ధర్మచయుడు విశ్వము మెచ్చన్.

గీ. ఇటుల కాలము జరుగగ నింపుగాను
కాలుఁడేతెంచె మునివలె గాంచ రాము
డతడు మునిగని పూజించె నర్ఘ్యముగను
కార్యమడిగిన బలికెను కాలుఁడపుడు.

వ. రామ! వసుంధరాధినాథ! నావాక్యంబులునీవుదక్క నితరులెవరును వినతగవు. మూడవవాడు వినుటకును మనల చూచుటకుకూడ వీలుకాదు. వినినవాడు చూచినవాడు వధ్యుడు కావలెను. నీకిది సమ్మతమేని నీతోడ నేను మాట్లాడెదను. లేదేని నాదారిని నేను పోయెదననియె. రామరాజేంద్రు డట్లనే యేర్పాటుచేసెదనని పలికి లక్ష్మణుని రప్పించి తమ్ముడ! నీవు ద్వారమున నిలువుము. ద్వారపాలకుల తొలగింపుము. ఎవనిని లోనికి రానీయకుము. నీవెవరినేని నాదగ్గరకు రానిచ్చితివేని వధ్యుడవగుదువు. జాగరూకుడవై యుండుము. పొమ్ము అని పలికెను. లక్ష్మణుడు ద్వారపాలకుల బొమ్మని తాను ద్వారమున నిలచియుండెను. కాలుడు రామభూపాలుని గనుగొని రామభద్ర! నేను శమనుడనువాడను. దక్షిణాదిగధిపతిని. పితామహాజ్ఞను నీసన్నిధి కేతెంచితిని. పితామహుడు నీతోడ పలుకుమనిన వాక్యముల వచించెద వినుము. నీవు పరమపదవాసుడవు, నారాయణుడవు. రావణవధార్థము దేవతలచే ప్రార్థితుడవై భూలోకమున సూర్యవంశమున దశరథాత్మజుడవై యవతరించితివి. రావణవధయైనది. భూభారము తగ్గినది. ఇక పరంధామమునకు విచ్చేయవలయునని ప్రార్థించుచున్నాడను. త్వరితముగ వేంచేయవలయునని విధాత నీతోడవిన్నవించుమనియె ననియె.

గీ. అపుడు దూర్వాసుడేతెంచి యునియె నిటుల
ద్వారగతుడైన సౌమిత్రి ధర్మబద్ధు
గాంచి యిప్పుడె రాముని గాంచవలయు
జాగుచేసిన శపియింతు సత్యముగను.

వ. అన విని లక్ష్మణుఁడు తనమనంబున నిట్లు వితర్కించె. నీతఁడు దూర్వాసుఁడు, ముక్కోపి. తన మనమున దలచినదియె కావలెనని పట్టు పట్టునితని స్వభావమెట్టిదైనను చెప్పి చూచెదను. మహాత్మా! యిప్పుడు రామసన్నిధికి నెవరును పోఁగూడదు. ఇది రామాజ్ఞ. మహర్షితో మాటలాడుచున్నవాఁడు గనుకనే ద్వారపాలుని తొలగించి నే నిట్లు నున్నవాఁడను. నే నొకవేళ రామసన్నిధికి పోయిన వధ్యుఁడనగుదును. కరుణించి కొన్ని నిమిషములు నిలువుము. త్వరగనె యా మహర్షి వెడలును. తమ్ము కొన్ని నిమిషములలోనే రామసన్నిధికి జేర్చెదననియె. దూర్వాసుఁడామాటలవిని యాగ్రహించి నిముషమైనను నే నాఁగుటకు వీలులేదు. రామదర్శనమిప్పుడే చేయవలెను. లేదేని నిక్కముగ శపింతు ననియె.

క అన విని లక్ష్మణుఁ డప్పుడు
దన కొకనికి మరణమైన ధన్యుఁడనగుదున్
ఘనవంశము గాపాడెద
ఘనుఁడీతఁడు శాపమివ్వ గడగునుగానన్.

క. అని తలచి రాము గనుఁగొని
ముని పలుకుల విన్నవించె మునినుతుఁడపుడే
వినయమునబంపి కాలుని
గనుఁగొనె దూర్వాసుని విగత కల్మషు ఘనునిన్.

వ అపుడు దూర్వాసుఁడు రామచంద్ర! మహారాజ! నేను సహస్ర వర్షములు దీక్షతో తపస్సును జేసితిని. అది యిప్పటికి సమాప్తమైనది. ఇపుడు మృష్టాన్నమును భుజించవలయుననియె. రామనరపాలుఁడు సిద్ధాన్నమును దూర్వాసున కొసగెను. తృప్తిగభుజించి యాతఁడు యథేచ్ఛం జనియె. రామభద్రుఁడు సభ నధిష్ఠించి వసిష్ఠునిగని గత వృత్తాంతమును తెలిపెను. వసిష్ఠమహర్షి రామభద్ర! నీవు ప్రతిజ్ఞను పాలించవలెను గాన

లక్ష్మణుని విడిచి వేయుము. ప్రీతిపాత్రుని విడుచుట చంపుటయె యనియె. రామ రాజేంద్రుడు లక్ష్మణుని బిలిచి లక్ష్మణా! నీవు ధర్మజ్ఞుడవు. ధర్మాతిక్రమణము యుక్తముకాదు గనుక నిన్నునేను విడిచితిని. నీవు యథేష్టముగ బొమ్మనిన లక్ష్మణుడు రామునికిని, వసిష్ఠమహర్షికిని నమస్కరించి సరయూనదిని చేరి ప్రక్షాళితపాణిపాదుడై యాచమించి ప్రాణనిరోధమును జేయుచుండ శచీపతి జనుదెంచి లక్ష్మణుని సశరీరునిగ దివ్యవిమానారూఢునొనర్చి పరమవ్యోమమునకు బంపెను. శ్రీరామచంద్రుడు లక్ష్మణ వియోగమునకు మిగుల దుఃఖించి వసిష్ఠవాక్యముల శాంతినొంది వసిష్ఠాజ్ఞను తన జ్యేష్ఠపుత్రునకు కుశుడనువానికి చంపక కుముద్వతులను, లవునకు సుమతి కంజాననలను, లక్ష్మణ జ్యేష్ఠపుత్రు డంగదునకు కంజాక్షి చంద్రికలను, లక్ష్మణద్వితీయ పుత్రుడగుచిత్ర కేతడనువానికి కంజాక్షి చంద్రాస్యలను భరతజ్యేష్ఠపుత్రునకు పుష్కరునకు కలావతి చంచలలను, భరత ద్వితీయపుత్రుడు తక్షునకు కాలిక చపలలను శత్రుఘ్న జ్యేష్ఠ పుత్రుడగు సుబాహునకు కమల నచలలను, శత్రుఘ్న ద్వితీయ పుత్రునకు మాలతీమదనలను పరిణయమొనర్చి తన జ్యేష్ఠపుత్రుడు కుశునకు దక్షిణ కోసలనిచ్చి యయోధ్యయందు పట్టాభిషిక్తునొనర్చె. రెండవపుత్రుడగు లవునకు నుత్తరకోసలదేశముల నిచ్చి పట్టాభిషేకమొనర్చె. సోదర పుత్రుల కిదివరకె రాజ్యము లివ్వబడి పట్టాభిషేకము లొనర్చబడినవి. తరువాత శ్రీరామచంద్రభగవానుడు తాను పరవ్యోమమునకుబోవు ప్రయత్నములో నుండె. ఆసంగతిని సుగ్రీవుడు విని యంగదునకు కిష్కింధారాజ్యమునిచ్చి కిష్కింధయందు పట్టాభిషేకమొనర్చి హనుమదాదులతోను, జాంబవదాదులతోను, సకల వానరులతోను, విభీషణాదులతోడను బయలుదేరి రామసన్నిధికి వచ్చెను. రాముడు హనుమంతుని నీవు నా తోడ రావలసినదనియె. విభీషణునిగని నీవు సూర్య చంద్రు లుండువరకు లంకారాజ్యము నేలుమనియె. జాంబవంతునిగని నీ కోర్కె కృష్ణావతారమున తీరగలదనియె. మైందుని ద్వివిదునిగని మీరు కలియుగము వచ్చువరకు జీవించియుండుడనియె. అపుడు శ్రీరామనృపతి సాగ్నిహోత్రుడై సపురోధనుడై ప్రస్థానవిధిని పూర్తిజేసి సూక్ష్మాంబర

ధరుడై దర్భలధరించి మాటలాడక నిశ్చేష్టితుడై గృహమును వెడలి పద్మయు శ్రీదేవియు హ్రీదేవియు యదృశ్యలై తనతోడజనుచేర శస్త్రాస్త్రములు పురుషరూపమున నడచుచుండ వేదములు బ్రాహ్మణరూపమున ననుగమింపగా యత్రియు వషట్కారములు నేతేర కౌసల్యాద్యంతఃపుర స్త్రీలును భరతశత్రుఘ్నులును నయోధ్యాపురమునగల సకల ప్రాణులును వానరులును సుగ్రీవుడును బంధుమిత్రులును రాము ననుసరించి నడచుచుండ దృశ్యాదృశ్య భూతకోటియంతయు రాముననుసరించనడిచి రామ నరపాలుడు సరయూనది నవలోకించెను. బ్రహ్మాదు లంతరిక్షమున నిలచి యుండిరి. రామభూపాలుడు సరయూనదీజలముల ప్రక్షాళితపాణిపాదుడై జలములలో పాదములుంచి నిలువబడెను. బ్రహ్మాదులు స్తుతించిరి. రామభగవానుడు సోదరసహితుడై సశరీరుడై పరమపదమునకు వేంచేసెను. శ్రీమహావిష్ణువు తన్నాశ్రయించి వచ్చిన సకల ప్రాణులకు నుత్తమ లోకముల నొసగెను. సకల జీవులు సద్గతి నొందిరి. రామపుత్రులు రామసోదరపుత్రులు ధర్మాతిక్రమణము లేకుండ రామాదుల కంత్యక్రియల నొనర్చి న్యాయధర్మముల ననుసరించి ప్రజల తమ ప్రజలవలె పాలించిరి. కుశునివంశమున సుమిత్రాంత మేకోత్తర షష్టిసంఖ్యాకులగు పురుషులు భూలోకమును పాలించిరి. తక్కినవారివంశములు తామరతంపరవలె వృద్ధినొందినవి. శ్రీరామభగవానునితో రామవంశమున జనించిన పురుషులు నూటయిరువదిముగ్గురు సకలకళ్యాణములబడసిరి. వారి కుటుంబములచే ధరావలయమంతయు వెలసినదని కుశలవులు రామభవిష్యత్కథను రమ్యముగ పాడిరి.

సీ. భరతచరితమిది భక్తియుక్తిని వ్రాసి రఘురామపదముల రమణనిడితి
రాముడె కరుణించి వ్రాయించె దీనిని కాకున్న నాచేతకాదువ్రాయ
రామపదంబున రమ్యమాధుర్యంబు రంజిల్లుచుండుట రక్తిగలుగ
శరణార్థిజనులను జక్కగ గావంగ దీక్షితుడనివింటి ధీరు రాము

గీ. గనుక నమ్మితి ననుగావ గలడటంచు
మహితులందరు రాముని మహిమదెలిసి

నమ్మి కొలువుడు రక్షించు నమ్మకముగ
కరుణగలవాడు కామిత కల్పతరువు.

గీ. చదివి యెఱుగను సచ్ఛాస్త్రసంచయంబు
వేదముల నేను శ్రద్ధగ వినగలేదు
కవన మేరీతి చెప్పగాగలనో రామ
భవ్యభవదీయ మహిమయె పలికె నిటుల.

క. గురుపాదభక్తి యొక్కటి
విరచింపగ సాధనంబు వెలసెను సుమ్మీ
గురుడన వేఱుగగలడే
గురురూపుడ వీవెగావె గుణగణవిభవా!

గీ. విష్ణుచిత్తుడు చదువక వేదవితతి
సభనుగట్టున శుల్కంబు చదివి వేద
వారమంతయు నీదగు పరమకరుణ
దెచ్చి నీకిచ్చె నన్నట్లు తేల్చినావు.

గీ. శక్తిలేనట్టి వానిచే చేయలేని
పనిని చేయించగలిగితి పరమపురుష
నీవు దలచిన దేదైన నిశ్చయముగ
పూర్తిగాకుండ నుండదు. పూర్ణవిభవ.

క. నీ నామము పదిసారులు
నేనీగతినుడివినాడ నీదగు భక్తిన్
గానాశక్తులు గలిగిన
నీనామమె నన్నుగాచు నిపుణము గాగన్.

క. నీపాదసేవ యొక్కటె
యేపొందిన కరుణనాకు నింపుగనిమ్మా
నాపాలిటి కిదియే గొప్పది
నీపాదము మదిని నిలిపి నిలచెద నెప్పుడున్.

శా. లోకాతీత గుణాభిరాముఁడు దయాలోలుండు రామప్రభుం
డేకళ్యాణ కృతీశ్వరుండు విధిముఖాభీష్టార్థఘుంఘాఘ్యుడన్
శ్రీకళ్యాణ సుఖంబులిచ్చి మనుచు నీ చేశోముదంబొప్పగా
నీకావ్యంబు రవీందుతారకలతో నింపొందు భద్రంబుగాన్.

మ. ఇది రామానుజయోగి రాజకథితాధీష్టార్థతత్వజ్ఞతా
పదవిభ్రాజితు యజ్ఞమూర్తిని మదింభావించి స్వీయాన్వయు
న్మద మొప్పంగను రామతమ్మని కథనోత్సాభాఫలాభంబుగా
సదయుత్మెచ్చ వచించె నైదవది యాశ్వాసంబు రామప్రభో.

గద్య

ఇది శ్రీమద్రామానుజ కరుణాకటాక్షపాత్ర యజ్ఞార్యపవిత్ర వంశ్య
చతుస్సప్తతి పీఠాంతర్గత తదీయ పీఠస్థిత భారద్వాజస గోత్ర
శ్రీ పుదుప్పళి కాండూరు తిరుమలై యచ్చాన్ రాఘవా
చార్యదేశిక వేంకటాంబా వరపుత్ర విబుధవర వినయ
చర్య వైష్ణవదాస వేంకట తిరుమలాచార్య
ప్రణీతంబగు మహాప్రబంధంబునందు
సర్వంబును పంచమాశ్వాసము
సంపూర్ణము.
శుభం భూయాత్
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

ఈ స్తోత్రము చి॥ నా జ్యేష్ఠపుత్రుడు మధురకవి రాఘవరామాను
జయ్యంగారు సుదర్శననారసింహమహామంత్రమును మండల
దీక్షతో జపించినపుడు పూర్ణాహుతికాలమున చదివితిని.

శ్లో. భాస్వద్భాస్కరకోటితీక్ష్ణకిరణం పాపాటవీపావకం
భక్తాభీష్టఫలప్రధాననిపుణం భద్రార్థదం భాసురం
దుష్టక్రూరసురారిభూధరపవిం దుష్టార్తివిధ్వంసకం
ప్రహ్లాదావనదీక్షితస్యనృహరే శ్చక్రాధినాథంభజే. ౧

శ్లో. దూర్వాసాతికఠోరకృత్యహరణం దుర్వక్రశీర్షాపహం
దుష్టాలాపమహీశచైద్యదళనే దక్షంప్రవాహోజ్వలం
అశ్వద్ధామవిసృష్టధాతృశిరసానుత్తార్భకప్రాణదం
ప్రహ్లాదావనదీక్షితస్యనృహరే శ్చక్రాధిరాజంభజే. ౨

శ్లో. అత్మీయాతివిచిత్రశక్తిదళితాఽన్యాస్త్రప్రభాభాసురం
ఆత్మీయోత్తమమంత్రభక్తమనుజాఽభీష్టకల్పద్రుమం
శ్రీనారాయణచిత్తవృత్తివశగం శ్రీదందయాసాగరం
ప్రహ్లాదావనదీక్షితస్యనృహరే శ్చక్రాధిరాజంభజే. 3

శ్లో. భక్తానందసుఖావహం సుమనసాంసంరక్షణేదీక్షిత
శ్రీవిష్ణోఃకరభూషణం జలజవప్రాణాంతకప్రక్రియం
శ్రీనారాయణమానసేంద్రియమహారూపం ప్రసిద్ధప్రభం
ప్రహ్లాదావనదీక్షితస్యనృహరే శ్చక్రాధిరాజంభజే. ౪

శ్లో. యస్యాసన్వదనాని తైదశశతాన్యాసన్తధాబాహవ
ఆరాస్తాద్వశసంఖ్యయావిలసితాః కోట్యగ్రతుల్యప్రభా
స్సామ్యంకుత్రనవిద్యతేత్రిభువనే హ్యాస్త్రేష్వశస్త్రేషుచ
ప్రహ్లాదావనదీక్షితస్యనృహరే శ్చక్రాధిరాజంభజే. ౫

శ్లో. స్వభానువత్స రాషాఢ శుక్లపక్షస్థ సప్తమీ
శుక్రవారే మయాప్రోక్తంశ్లోకపంచక ముత్తమం.

శ్లో. స్తోత్రంశ్రీచక్రరాజస్య సర్వాభీష్టప్రదాయకం
సర్వసంపత్ప్రదంనౄణాం నారాయణకృపావశం. ౬

# చతుర్థాశ్వాసము



| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 1 | 20 | నట్లు | నయట్లు | 37 | 24 | తావిత | తావిహిత |
| 6 | 4 | పక్షు | పక్షు | 37 | 25 | తమ | తప్పు |
| 10 | 16 | జేరి | జేరె | 41 | 5 | కృతం | వృతం |
| 10 | 20 | లెన | లైన | 41 | 13 | మండు | షండ |
| 11 | 11 | తార్క్ష్య | తార్క్ష్య | 51 | 14 | ,, | గీ॥ |
| 13 | 23 | ఖీ | ఖీం | 55 | 16 | చెప్పు | చెప్ప |
| 15 | 2 | సోమ్ములు | ...... | 55 | 29 | సావ | స్థావ |
| 23 | 14 | దిదే | దిది | 55 | 21 | బుట్టె | బుట్టు |
| 25 | 8 | వన్ | తున్ | 57 | 4 | శ్రుత్యా | ...... |
| 26 | 8 | బాదు | జాచు | 66 | 12 | కృతి | ప్రతి |
| 29 | 5 | లు | ల | 66 | 12 | మయనెద | మనియెద |
| 34 | 27 | జక | జక్క | 69 | 6 | క్రీత | క్రీత |
| 36 | 24 | జని | జన | 70 | 9 | మన | ఘన |



# పంచమాశ్వాసము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు | పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| 83 | 18 | విశే | వశే | 102 | 27 | బద్దులా | బద్ధులు |
| 84 | 20 | నెప్పు | దెప్పు | 102 | 29 | ధము | ధమున |
| 85 | 18 | .నుడు | నుతు | 103 | 2 | సుప్తి | సుషుప్తి |
| 86 | 27 | పదవి | సరవి | 103 | 3 | ణా | ణాదులబొంది |
| 87 | 2 | మనుడు | మసుడు | 103 | 4 | ద్యంద | ద్యంత |
| 87 | 11 | నాగ | వాగ | 103 | 4 | రాది | రాతి |
| 87 | 21 | నజ్జ | నబ్బ | 103 | 11 | నేరాక్ష | వైరాగ్య |
| 87 | 24 | జాజ్జ | దాబ్జ | 03 | 14 | క్త | ప్త |
| 88 | 10 | ధీయద | భయద | 103 | 16 | ప్రవత్తకి | ప్రవత్తికి |
| 88 | 20 | నట్టు | నట్టి | 103 | 17 | తర | వర |
| 88 | 23 | కాన | లాన | 103 | 19 | కోర్వ | పూర్వ |
| 88 | 24 | కోటిలోన్ | కోటులన్ | 103 | 21 | క్షీస్యతీత | క్షీమ్యతీతి |
| 89 | 13 | దిప్ప | దిప్పు | 104 | 8 | యనకృ | యసకృ |
| 90 | 2 | వెపు | వెస | 104 | 11 | ధర్మా-లోను | |
| 90 | 9 | శ్రోత | శ్రోత్ర | 104 | 19 | వలన | వలనకూడ |
| 91 | 19 | ధేయ | గేయ | 106 | 8 | యుతయు | యుతియు |
| 92 | 18 | బాసి | బాపి | 106 | 12 | భవదనభి | భగవదభి |
| 92 | 23 | వగ | వక | 106 | 18 | దగును | దగుచు |
| 93 | 2 | తావ | తార | 110 | 15 | దర్థములు | దర్థలు |
| 94 | 11 | యను | యని | 112 | 4 | బెంచ | బెంచి |
| 97 | 14 | తత్వ | తవ్య | 112 | 13 | తిథ్యమ | తథ్యము |
| 98 | 10 | విధుల | విధులు | 112 | 15 | సర్వధార | సర్వాధార |
| 100 | 4 | జవ | జన | 112 | 23 | నిత్యశూ | నిత్యసూ |
| 102 | 4 | పాది | పాధి | 114 | 20 | పదము | పదమురము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 117 | 5 | సకారణాధిపాధికః(తప్పు) సకారణాధిపాధిపః(ఒప్పు) | |
| 117 | 18 | స్తేవా | స్తేనా |
| 117 | 19 | తమోద | తమోగ |
| 117 | 19 | పిప్పం | పిప్పలం |
| 117 | 23 | తీశం | తీగ్మ్ |
| 118 | 3 | హో | షే |
| 118 | 4 | ము | మ |
| 118 | 10 | స్యా | స్వా |
| 118 | 13 | తిం | తిః |
| 118 | 14 | హాః | హాం |
| 123 | 9 | ర్చ | ర్చి |
| 124 | 3 | వది | వడి |
| 128 | 4 | నిద్వార | నిద్దుర |
| 129 | 12 | ము | మై, |
| 129 | 13 | త | త్వ |
| 129 | 22 | క | కు |
| 129 | 27 | సంగ | వగ |
| 130 | 16 | మును | మున |
| 130 | 25 | సశ్ర | నాద్రు |
| 131 | 5 | ఆత్మ | ఆత్మ |
| 131 | 14 | మహామమ | నమమ |
| 132 | 8 | నర | ర |
| 132 | 22 | నారాయణా | నారా యణాం |
| 132 | 24 | నానా | నా |
| 132 | 26 | నారాయణాతి | నారాణా |
| 134 | 6 | బడి | బడు |
| 134 | 17 | వానస్తి | హీనస్తి |
| 134 | 22 | తావిత్రి | తాసిత్రి |
| 135 | 3 | పి | ప |
| 137 | 5 | ల | కం |
| 138 | 4 | తి | వి |
| 139 | 17 | కత | ్రమత |
| 144 | 25 | పన | పీన |
| 144 | 26 | కట | కటక |
| 145 | 2. | తముసు | లతయు |
| 145 | 3 | కటు | కటి |
| 145 | 7 | ఖేద | ఖేధ |
| 146 | 19 | త్యాలి | త్యారి |
| 146 | 18 | ల్పాది | ల్పాత్ర |
| 149 | 18 | కం | కి |
| 153 | 4 | పెని | పైని |
| 160 | 26 | ఇదిమె | ఇదియే |
| 166 | 17 | గాంచ | గాంచు |
| 167 | 2 | నంత | నెంత |
| 168 | 5 | విధులు | తిధులు |
| 169 | 10 | మాయధ | మానధ |
| 170 | 13 | మెట్లుండ | మట్లుండ |
| 170 | 25 | విదుడు | విదులు |
| 170 | 12 | జాల | జాణ |
| 173 | 16 | మిమ్ము | మిమ్మి |
| 181 | 26 | వరు | వర |
| 188 | 4 | లతో | లు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 189 | 17 | ఆశే | ప్రవే |
| 194 | 8 | చెను | చి |
| 197 | 3 | ర్వీణు | ర్వీణ్ణు |
| 197 | 6 | జేరి | జేరిరి. |
| 201 | 16 | అవిదు | అవిదితు |
| 202 | 26 | పరశ | పరత |
| 204 | 12 | దుర్ముడు | మరుశుడు |
| 208 | 22 | ణాభ | ణాబ్జ |
| 210 | 11 | తజ్ఞానశ్చ | తజ్ఞాశ్చ |
| 211 | 10 | నీవెట్లు | నీకెట్లు |
| 212 | 22 | సర్వము | స్మరము |
| 213 | 2 | పతివ్రత | పాతివ్రత్య |
| 214 | 23 | పరవా | పరమపదవా |
| 215 | 11 | రహిత పర్యంతము | పాతము |
| 217 | 19 | సుగ్రీవ | మిత్రమ |
| 217 | 22 | సుగ్రీవుడు | విభీషణుడు |
| 219 | 16 | ధర | భర |
| 220 | 15 | పలికె | పలికెను. |
| 222 | 24 | లర్పించి | లర్పించె |
| 223 | 11 | నవ్య | గన |
| 224 | 16 | చిరి | చితి |
| 224 | 17 | ప్రటలు | ప్రజలు |
| 224 | 26 | హార్ష | హర్ష |
| 227 | 21 | సీత్యా | సత్యా |
| 232 | 7 | వాక్య | వాక్ప్రి |
| 232 | 19 | యారా | యావ్వరా |
| 232 | 19 | పదవిని | పదలి |
| 232 | 19 | యించుచు | యించు |
| 232 | 21 | చుంద్రు | చుందు |
| 233 | 20 | యారాజ్య | యావ్వ రాజ్య |
| 234 | 8 | యారాజ్య | యావ్వ రాజ్య |
| 234 | 15 | యావ | యావ్వ |
| 234 | 20 | లని:చ్చి | లనిచ్చి |
| 234 | 25 | బహుబల | బాహుబల |
| 236 | 8 | సేవించి | సేవించ |
| 242 | 3 | నేపాపి | నేపావని |
| 246 | 16 | దక్షిణా | దక్షిణ |
| 248 | 25 | వలసినదనియె | వలదనియె |
| 248 | 29 | ధనుడై | ధనుడై |
| 252 | 12 | అత్మీయా | ఆత్మీయా |
| 252 | 13 | భీష్ట | భీష్టార్థ |
| 252 | 6 | దీక్షిత | దీక్షితం |
| 252 | 17 | జలజన | ఖలజన |
| 252 | 20 | బాహావ | బాహావః |
| 253 | 21 | స్తాత్వాశ | తాదృశ |
| 250 | 22 | గానా | నానా |
| 250 | 26 | కిదియే | కిదియె |
| 251 | 3 | ధుండో | ఢుండా |
| 251 | 4 | చునీ | చున్ |
| 251 | 7 | యు | యు |